# శ్రీ మాత

## ప్రశ్నోత్తరములు

[1957 జనవరి 2 – డిశంబరు 18]





అనువాదం:

పోతాప్రగడ వెంకటేశ్వర్లు
బరంపురం

# శ్రీ మాత

## ప్రశ్నోత్తరములు

[1957 జనవరి 2 — డిశంబరు 18]







అనువాదం:

పోతాప్రగడ వెంకటేశ్వర్లు

బరంపురం

"ఈ గ్రంథములు ముద్రించుటకు అవసరమైన
కాగితము కేంద్ర ప్రభుత్వమువారిచే
తగ్గింపు ధరకు అందజేయబడినది"

సంపుట 17

కామారెడ్డి
శ్రీమాతారవింద సత్సంగ కేంద్రంవారి విరాళంతో

శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితిచే
ప్రచురింపబడినది.

ముద్రణ : శ్రీఅరవిందాశ్రమ ఆంధ్రభవనం ముద్రణాలయం, పుదుచ్చేరి.

# శ్రీ మాత

## జననం

ఫిబ్రవరి 21, 1878

## భారతదేశానికి ఆగమనం

మార్చి 29, 1914

## మహాసమాధి

నవంబరు 17, 1973

## శతజయంతి

ఫిబ్రవరి 21, 1978

# ప్రస్తావన

శ్రీ అరవిందాశ్రమములోని పిల్లల విషయంలో శ్రీమాత ప్రత్యేక శ్రద్ధ తీసుకొనుచుండెడివారు. ప్రతిదినము సాయంకాలము ఆటమైదానానికి వెళ్ళి వారి ఆట పాటలను పర్యవేక్షించి, వారితో కొంతసేపు ఇష్టాగోష్ఠి జరిపెడి వారు. అత్యంత కుతూహలము కలిగించెడి ఆ సమావేశమునకు ఆశ్రమవాసులందరు హాజ రయ్యెడివారు. అవియే 1953 నుంచి 'బుధవారము క్లాసులు' గా ప్రసిద్ధి చెందినవి. సామాన్యముగా పిల్లలకు కలిగెడి సందేహములకు, సమస్యలకు సమాధానము లగుట వలన, అవి ఏ ఒక్క శాస్త్రవిభాగమునకు గాని, దేశమునకు కాలమునకు గాని, పరిమితములు గావు. పై పెచ్చు, వివిధ విషయముల గురించిన జిజ్ఞాసాపరులకు అవి కేవలము విజ్ఞాన సర్వస్వములే యగును. అంతియేగాక, పిల్లలడుగు అనేక ప్రశ్నలకు తగు సమాధానము లివ్వగోరెడి పెద్దలకును, ఆధ్యాత్మిక జీవితము గడుప నభిలషించెడి ఔత్సాహికులకును గూడ అవి పెన్నిధి వంటివి.

1978 ఫిబ్రవరి 21 వ తేదీన జరిగెడి శ్రీమాత శతజయంతి సందర్భముగా పై ప్రశ్నోత్తరములను, శ్రీమాత ఇతర రచనలను, ఇంకను శిష్యులతో జరిగిన అనేక ఉత్తర ప్రత్యుత్తరములను కలిపి శ్రీ అరవిందాశ్రమము వారు ఆంగ్లములో 15 సంపుటములుగ వెలువరింప దలపెట్టిరి. వాటినన్నిటిని ఆంధ్ర పాఠకులకు గూడ అందచేయు నభిలాషతో తెలుగువారు సైతము 'శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితి' అను పేరుతో ఒక సంఘముగా ఏర్పడి ఒక పథకమును చేపట్టిరి. దానిలో భాగమునే ఇంతవరకు, 'శ్రీమాత ప్రార్థనలు-ధ్యానములు' అను

గ్రంథమునే కాక, ఆంగ్లములో వెల్వడిన '1953 శ్రీమాత ప్రశ్నోత్తరము' లను సంపుటమును రెండు భాగములుగా తెలుగులో ప్రచురించుట జరిగినది.

ప్రకృతమున వెల్వడుచున్న యీ సంపుటము 1957 లో శ్రీమాత ప్రశ్నోత్తరములకు సంబంధించినది. శ్రీఅరవిందుల రచనలకు తన ఫ్రెంచి అనువాదములలోనుండి యొక భాగమును చదువుటలో సామాన్యముగా ఈ ప్రవచనములు ప్రారంభమయ్యెడివి. ఆరీతిగా, 'తలపులు—తళుకులు,' 'అతిమానసాభివ్యక్తి,' 'దివ్యజీవనము' అనువానినుండి ఆమె చదివిన భాగమునే సంపుటములో కాన నగును. చదివిన అనంతరమామె దానిపై తానే వ్యాఖ్యానించుటో, లేక ప్రశ్నలకు జవాబు లిచ్చుటో చేసెడివారు. ఫ్రెంచి భాషలో జరిగిన యీ ప్రవచనము లన్నియు చేయబడి, ఆటుపిమ్మట వాని ఇంగ్లీషు అనువాదముతో సహా శారీరక శిక్షణను గురించిన త్రైమాసికసంచిక యందు (ఇదియే తరువాత శ్రీఅరవింద అంతర్జాతీయ విద్యా కేంద్ర సంచికగా వెల్వడినది) ప్రచురితమై, కాలాంతరమున గ్రంథరూపము గూడ దాల్చినవి.

ఆంగ్లమున 1957 - 58 ప్రశ్నోత్తరము లొకే సంపుటముగ వెలువడి యున్నవి. వీటిని తెలుగులోనికి అనువదించి యిచ్చిన శ్రీ పోతాప్రగడ వెంకటేశ్వర్లుగారికి శ్రీదివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితి యంతయు కృతజ్ఞమై యున్నది. మొదట తలపెట్టిన పద్ధతి ననుసరించి తెలుగులో ఇది కూడ రెండు సంపుటములుగా (1957 ప్రశ్నోత్తరము లొక సంపుటి, 1958 ప్రశ్నోత్తరములు వేరొక సంపుటి) వెల్వడుచున్నవి. ఆంగ్లమున నిది 9 వ సంపుట మగుట జేసి, తెలుగులో ఈ రెండు సంపుటములను 17, 18 సంఖ్య కలది యగును.

* * *

## విషయసూచిక

* * *



"నేను సర్వదా నీ హృదయములోనే ఉన్నాను....

ఏ క్షణములోను నిన్ను నేను మరువలేదు.

నీ నా మధ్య మరి యే ఇతర ప్రాబల్యములకు తావీయకుము."

—శ్రీ మాత



# ప్రశ్నోత్తరములు

జనవరి 2, 1957

"బ్రహ్మము ప్రత్యక్షగోచరమైన మన ఉనికికి నిత్య వ్యతిరేకి యగు అమూర్త-వివిక్తతత్వమే యగుచో, విలయనము యుక్తపరిష్కారమే యగును; కాని, ప్రేమ, ఆనందము, ఆత్మస్మృతి, అనువానినిగూడ మనము గమనింప వలసియున్నది.

"విశ్వమొక గణితసూత్రము కాదు; సంఖ్యలనెడి నిరాకార మానసికద్రవ్యముల గుణిజములు చివరకు శూన్యమునో, అగాధమునో చేర్చుటకే ఉపకరించును. విశ్వము కొన్ని శక్తుల సమీకరణపు కూర్పుల భౌతికక్రియ కాదు. అది ఆత్మప్రేమికుని ఆనందము; బాలుని క్రీడ; తన అనంత సృజనాత్మక శక్తియొక్క మహదానందమున మత్తెక్కిన మహాకవిదైన అనంతబహుళ ఆత్మ సంసృష్టి.

"బ్రహ్మమును మనము మూడు విధములుగా ఊహింపవచ్చును. 1) సంఖ్యాసమస్యలను సాధించుచున్న గణితశాస్త్రజ్ఞునిగా; 2) మూల సూత్రములయు, శక్తులయు సమీకరణమును సాధించుచున్న మేధావిగా; మరియు, 3) విశ్వజనీన విశిష్టస్వర సమ్మేళనముల వెలార్చు గాయకునిగా; లేక ప్రేమికునిగా; లేక బాలునిగా; లేక మహాకవిగా. భావనావిభాగ మొక్కటియే చాలదు; ఆనంద విభాగముకూడ సంపూర్ణముగ గ్రహింపబడవలెను. భగవానుని ఆనందస్ఫూర్తితో నింపబడనిచో, భావములు, శక్తులు, జీవనములు, మూల సూత్రములు వట్టి బోలుమూసలే యగును.

"ఇవన్నియును రూపకల్పనలు. కాని, అంతయును నొక రూపకల్పనమే. వివిక్తభావనలు మనకు భగవత్సత్యముల శుద్ధభావనను అందించును; రూపకల్పనలు వాని సజీవ వాస్తవికతను స్ఫురింపజేయును.

"భగవానుని శక్తివిశిష్టమైన భావన, — అనగా సంకల్పము, — బ్రహ్మాండముల నావిర్భవింపజేయగా, ఆయన ఆనందము ఆ సంకల్పము నుద్భవింపజేసినది. అనంతుడు తనలో అంతులేని బహుముఖానందమును పొందిన కారణముననే ఈ జగజ్జాలము లావిర్భవించినవి.

"భగవానుని జ్ఞానానందములే ఆదిమ దంపతులు; అవియే పరమాతీత సంస్థితులు కూడ. అజ్ఞానము

జ్ఞానముయొక్క ఒకానొక అవాంతరమూర్ఛావస్థ, లేక తమోమయ నిద్రావస్థ మాత్రమే. దుఃఖము, ఆత్మ విలయనము, అనునవి ఆత్మానందము తనను తాను అన్యత్ర, అన్యథా కనుగొనగోరు ఆత్మపలాయనము.

"భగవానుని ఆనందము కాలబద్ధము కాదు, ఆద్యంత రహితము. ఒక ద్రవ్యరూపమునుండి ఆయన వెలికి వచ్చుట వేరొక ద్రవ్యరూపమును బొందుటకే.

"ఇంతకునూ భగవానుడనగా, సనాతనోద్యానమున, సనాతన శాశ్వతక్రీడా నిమగ్నుడగు సనాతన బాలుడు."

శ్రీఅరవిందుల "తలుపులు, తళుకులు"
సంపుటి 16, పుట 380—81

ప్రేమమయీ, మాతా, మనిషి కాలావకాశతీతుడు కాగలడా ?

మూర్తిమత్త్వము వీడి బయల్పడుచో, పంచీకరణము, మూర్తీకరణము కాలావకాశముల కల్గించినవి. వాని నధిగమించుటకు మూర్తీకరణ మధిగమింప వలెను. కాలావకాశములు పంచీకరణము తోడనే జనించినవి.

కాలావకాశముల వీడి చనుట, అనుభూతి రూపముననే గోచరించగలదు. 'శివోహం' అను అనంతానందమే నీ వయితివను ధారణ నందెదవు.

భౌతిక రూపముల దాటి, మానసికమగు సూక్ష్మ రూపముల దాటి, తలపుల నన్నిటి దాటి చనినపుడే ఈ యనుభూతి సాధ్యము (నిర్వికల్ప సమాధి) — మామూలు స్థితికి చేరిన వేళ దాని స్మృతియే మిగలదు.—జ్ఞప్తి యుంచుకొనుట కేదియు నుండని హేతువున, శ్రీ అరవిందు లన్నదిది: బ్రహ్మము ప్రత్యక్ష గోచర

మైన మన ఉనికికి నిత్యవ్యతిరేకియగు అమూర్త—వివిక్త తత్వమే యగుచో, విలయనము యుక్త పరిష్కారమే యగును. కాలావకాశముల దాటిన వానికి వేర్పాటు స్థితి యథాతథముగ నంతరించును. అనగా, అది సాధ్యమైనను, ఫలితము ఏమంత ఉండబోదు.

అంతేనా ? కాలావకాశముల నధిగమింప యత్నించితివా ? (శిష్యుడు లేదని తల అడ్డముగ ఆడించును.)

మాతా, నూత్నవత్సర సందేశము విశదీకరింతురా ? ఏమి దీని అర్థము ? "ప్రపంచమును రక్షించునది, శిలువ వేయబడిన కాయము కాదు; ముక్తిపొందిన కాయము." *

మీకు గ్రాహ్యమగునది చెప్పెదను.

ఒకనాడు (ఏరోజో చెప్పలేను) నూతన సంవత్సర సందేశ మీయవలసి యున్నదని నాకు గుర్తువచ్చెను. ఈ సందేశములలో సామాన్యముగ రాబోవు వర్షమున జరుగబోవువాని ప్రసక్తి యుండును. ఏలనో నాకు చెప్పుట కేదియు తోచలేదు. నన్ను నేనే ప్రశ్నించుకొంటిని— సూచన మేదైన రాదాయని. నా ప్రశ్న: ప్రపంచమున నుత్తమ స్థితి ఏది ? మనుష్యులను సత్యమునకు దగ్గరగా తేగల ఆ చైతన్య స్థితి యేది ?

* ''అశుభశక్తిని మించిన ఒకానొక శక్తియే విజయమును సాధించగలదు. ప్రపంచమును రక్షించునది శిలువ వేయబడిన కాయముకాదు; ముక్తి పొందిన కాయము.''

ఏది ఆ ఉత్తమ స్థితి ?

కొన్ని గంటల యనంతర మొక చిన్న పుస్తకము నా చేతి కందినది. అది అమెరికానుండి వచ్చినది. ఫోటోగ్రాపుల ప్రదర్శనపై విమర్శన గ్రంథమది; పేరు : 'మానవ కుటుంబము'. పుస్తకమున ఉల్లేఖనము (Quotations) లున్నవి; అనేక ఫోటోల అను-చిత్రము లున్నవి.

అవి విషయానుక్రమముగ వర్గీకరింపబడి యున్నవి. మానవులలో నిజ మగు సోదరభావము మేల్కొల్పు ఉద్దేశ్యముతో కూర్చబడినవా చిత్రములు. అదొక ప్రయత్నమును తెల్పుచుండెను—హృదయ విదారకము, మహోన్నతము —రాగల యుద్ధ నివారణా ప్రయత్నము, ఉల్లేఖనము లొక మహిళా విలేఖరి ఎన్నిక చేసినవి. ఆమె యిచ్చటకు వచ్చియుండెను. నే నామెను చూచియుంటిని. సమాజ దృక్పథమునుండి అవతరింపగల ఉత్తమ మానవేచ్ఛ దీని హేతువు. ఉన్నత స్థితి నొంది ఇంకను అధిక గ్రహణశక్తి గల మానవులు లేరని కాదు. కాని అది వ్యక్తులకు పరిమితమయిపోయినది. మానవుల నుద్ధరించుటకు చేసిన సామాజిక ప్రయత్నము కాదు. నా హృదయము ద్రవీభూతమయ్యెను.

ఆ చిన్నపుస్తకము చివరి పుటలకు వచ్చితిని. వారి ప్రతిపాదన గ్రుడ్డిది- ఒకరి నొకరు చంపుకొనుట మానుట విరుగుడుగా సూచింపబడినది. ఈ సూచన బలహీనతను, అజ్ఞానమును, అసమర్థతను చాటుచున్నది. నాకు నిజముగా దుఃఖమే కల్గెను. చివరిపుటలో, ఆ ప్రదర్శన పుదుచ్చేరి రాగలదని యున్నది. వారికి నిజమగు మందు తెల్పగలనని ఆశించితిని. నా అంతఃకరణము లోలోతుల నుండి పెల్లుబికి వచ్చినట్లుగ బోధకు కావలసిన ఈ వాక్యము వచ్చెను. దానిని నా పుస్తకమున వ్రాసితిని, నాలో,— "ఇదిగో నా సందేశము" అనుకొంటిని. నాకు తృప్తిగనుండెను. మానవ సుహృద్భావము భూమిపై ప్రకటింపబడుటకిదే సమయము. ఇదొక ప్రత్యేక రూపము ధరించినది. క్రైస్తవ దేశమునుండి ఈ భావములు వచ్చిన కారణముచేత దాని ప్రాబల్యము క్రైస్తవము. ఈ వైఖరి ప్రపంచవ్యాప్తము. దేశములబట్టి, మతముల ననుసరించి వేర్వేరు రూపముల నొకే సందేశము ప్రకటిత మగుచుండును. ఈ వైఖరి మూఢమైనది.

భారతమున కూడ ఆ అభిప్రాయమే. దీనికి విరుద్ధముగా వ్రాసినదే నా సందే
భౌతిక వాస్తవికత విస్మరించుట, సకలము మిథ్య యని ప్రపంచముపై
భావము పెంచుట, మూర్ఖతా లక్షణములు. దాన విరోధశక్తుల విజృం
స్వేచ్ఛ లభించెను. దగ్గిర నున్నది వదలి, సుదూరమును, సందేహాష
మును నగుదానికై వెదకుచో ఇదియే జరుగును. ఉన్నది కాదని లేని
మనిషి వెడలగనే, నీ నిజధామ మన్యాక్రాంతమయ్యెను.—అన్ని దేశవ
శూన్యమునకై వెదకు పద్ధతి భిన్న నామముల వెలసియున్నది.

ఇప్పటివరకు అన్యాయము బలహీనతతో ప్రతిఘటింపబడుచు వ
ప్రయోగించిన ఆధ్యాత్మిక శక్తికి ప్రపంచ పరివర్తన చేయు బలము లేకు
కావున సుహృద్భావము విఫలమయ్యెను. ప్రపంచమున లంచగొండి
అసత్యభాషణము, ప్రబలి దానిని కలుషితమొనర్చెను. దుష్టశక్తులున్న
వానిని పలాయన మొనర్చజాలు శిష్టశక్తుల అవసరము. ఇట్టి బలిష్ఠ
అతిమానస (ఋత) శక్తి, ఆనందశక్తి. దూరానగల నిర్వాణమునకై పర
ప్రపంచ పరివర్తనకై ఈ శక్తిని తెచ్చుకొనుట అవసరము. ఇంట
కదా రచ్చగెలుచుట.

బలిదానము కాని, త్యాగము కాని, అసహాయత కాని విజయ మా
బోవు. బలము, ఓర్మి, ధృతి యగు ఋతశక్తియే దానికి చాలినది.
పోవుట తేలిక, ప్రతిఘటన కష్టము, అత్యంత ప్రయాసకరము. అ
అన్యమార్గము లేదు.

ఇంకేద్దియు లేదా? నావద్ద కొన్ని ప్రశ్నలున్నవి. కాలాతీత మ

మాతా, ఈ నూతనశక్తి వ్యక్తులద్వారా పని
చేయునా, లేక స్వతంత్రముగనా ?

ఎందులకీ అడ్డుప్రశ్న? ఆ ఋత శక్తికి అన్యసహాయాపేక్ష లేదు,
నను, వ్యక్తి ప్రయత్నము సృష్టించి దానిని వాడుకొనును. వ్యక్తి

మగత్యమే యగును. కాని, మనిషి ఆ శక్తి తనదనుకొనుట శుద్ధ అవివేకము. పరమాత్మ చేయుచున్నాడని మనిషి అలసుడై యున్న నది సహాయ నిరాకరణ మగును. వ్యక్తి ప్రయత్న మా శక్తిలో ఒక అంశమే, అన్యము కాదు.

నీలో సమాజప్రేమ లేకున్న, నీ వంతయు పరమాత్మమీద వదలి స్థాణువుగ నిలచిన, కలుషములు మార్చరానివని నిస్పృహ వహించిన, ఇదంతయు వృథాయగును. ఏల ? ఒక మహాశక్తి, నీకు తెలియకుండనే నీ కుత్సాహమిచ్చి, నేర్పిచ్చి, జ్ఞాన మొసంగి, తన కార్యములలో ఒక పరికరముగ తప్పక వాడుకొనును, నీవు నిమిత్తమాత్రుడవే—నీ అహము నిన్ను వంచించిననే తప్ప, ఆ మహాశక్తికి దాసోహ మనక తప్పదు చివరకు. దానితో (తెలియకనే) నీలో ఒక పరివర్తన కల్గును— సంశయములు నశించును— విజయసున విశ్వాసముదయించును— ఆ ఋతశక్తి యిచ్ఛలో నీదొక అంశమై వ్యవహరించుట నీకనుభూతమై తోచును.— అది సత్యబలము, పరమాత్మ బలము. అంత విజయ పరంపర నిన్ను వరించును, ఇదే ఏకైక ప్రక్రియ. అట్లుగాక, "ఓహో నేను నా యిచ్ఛానుగుణముగ దీనిని చేయుటలేదు. వ్యవహరించునది నా శక్తి కానేకాదు, నేను నిద్రింతును. (భగవానునితో)— స్వామీ, నీ యిష్టమువచ్చినట్లు చేయుము. నేనిక లేను", అనినచో అది సరియైన పద్ధతి కానేరదు.

* * *

జనవరి 9, 1957

"దేవుడు ప్రకృతిదెస మొగ్గకుండ నుండలేడు, మనిషి దైవమును చేరు నుత్కంఠ లేక ఉండలేడు— అది పరిచ్ఛిన్నమునకు అపరిచ్ఛిన్నముతో గల శాశ్వత సంబంధము. అవి వేరగునట్లు తోచుట సాన్నిధ్యము కొఱకే.

"మనిషిలో ప్రకృతి ఉద్యమము తనను దానెఱిగి కొని, తా నెవరికి భోగ్యమో ఆ మహాభోగి వైపుగా త్వరితగతి నేగుటయే. భోగముల కొఱకై 'జీవి' అన్వేషించుచున్నది— కాని ఆ భోగములు తనలోనే యున్నవనియు, తానే అవి యనియు నెఱుగ లేకు న్నాడు. తన్ను తా నెఱింగినవేళ తానే ఆ బ్రహ్మా నంద మగును.

"ఏకత్వసాధనయే పరమగుహ్యమయినది; దేవుడు, మనిషి ఒక్కటే, రెండుకావు; ప్రపంచము, ప్రపం చము కానిది— రెండును ఒక్కటే— ఈ నాల్గును మఱల ఒక్కటే— అద్వైతబ్రహ్మమే. ఇది ఎఱుక గలవానిపట్ల నిజము-అజ్ఞాని కిన్నియు కలవు."

(తలుపులు, తళుకులు సంపుటి 16- పు 38)

శ్రీఅరవిందు లిచట చెప్పినదాని ప్రకారము, జగత్తు వాస్తవ స్వరూ పము భగవానుడే. కాని, ముఖ్యముగా అది ఆనందము, జగజ్జనన మానందమున దాని ఉద్దేశ్య మానందము. సృష్టి, సృష్టికర్తల కలయికయే ఆనందము.

అదియే శ్రీఅరవిందుల దేవుడు. దేవుడే సంసార మయ్యెను—సంకల్పబలమున. ఈ రెండును రెండు కావను తెలివియే ఆనందమునకు మూలము.

ఒకటి రెండయి, రెండును, ఒకటి రెండవదానిని విస్మరించి రెండుగా భావించెను. అంత ఆనంద మజ్ఞానముగ మారెను. ఈ అజ్ఞానమే సకలానర్థహేతువు, ఈ అజ్ఞానము మన మూహించు అజ్ఞానము కాదు—అవిద్య యనిరి దీనిని శ్రీ అరవిందులు; మాయ, ఈ మాయాఫలితమే అజ్ఞానము. అద్వైతభావమెఱుంగకుంటయే నిజమగు అజ్ఞానము.

ఈ రెండుగా మారిన వేళనుండి, సృష్టి దాని జనకుని విస్మరించినదాది అనర్థములు పెరిగినవి—

అద్వైతస్థాపనానంతరము సకలానర్థములు తొలగునని యోగు లెఱుంగుదురు, దానికై దీర్ఘకాల ఉద్యమము సాగెను. కాని, (గతవార మిది చెప్పితిని)—ఆ ప్రయత్నమున దొర్లిన తప్పు సృష్టికి మూలముగ ఆనందమునకు మారు వాంఛనుంచుటయే. సృజనాత్మకానందము, మూర్తీకరణము, స్వవాచకత్వము అనువానిని గుర్తించుటకు మారుగ, వాంఛయే సృష్టికి మూలమనిక. బౌద్ధము తీరిట్టిదే.

మనకు ముఖ్యముగా వ్యక్తిగతానందమును, ఐక్యతను దెచ్చు అద్వైతమును చూడక, గమ్యమును సకలవాంఛా విసర్జనము గాను, శూన్యమున లీనమగుటగాను భావించుచున్నారు బౌద్ధులు.

ఇది సదవగాహన కాదు; —ప్రపంచము దుష్టమను భావము, దాని అభివృద్ధికి వాడు సాధనములు కూడని వనుటయు నొక దౌర్భాగ్యమే— ఈ భావమున కెంత త్వరితముగ దూరమగుదుమో అంత త్వరితముగ మానవాధ్యాత్మిక జీవిత చరిత్ర సౌభాగ్యవంత మగును.

ఒకప్పు డది లాభదాయకము కానోపు, ప్రపంచచరిత్రలో ప్రతిదియు లాభదాయకమే యయి యుండినది, కాని, నేడది అట్లు కాదు. మఱియు నా విధా

నమే శిథిలమయి పోయినది. దానిని విడిచి ఉన్నత సత్యమునకు రాగల కాల మిది, మానవా, ఆనందమునకు మరలిపొమ్ము. — అద్వైతానందమునకు, దివ్యానందమునకు,

ఈ క్రొత్త మార్పు ప్రపంచమునకు సరిక్రొత్త. పూర్వపు ఆధ్యాత్మికాను భూతులకు స్వస్తి చెప్పి, ఈ ఆనందా (అతిమానస) నుభూతిని ప్రవేశింప నీయ వలెను. ఈ ఋతమే (అతిమానసానందమే) జయ మిచ్చునని వెనుకటిసారి చెప్పియుంటిని.

దీనిని గూర్చిన సంశయములు వలదు. శ్రీ అరవిందు లెప్పుడును, "భోగానంతరమే బ్రహ్మానందము" అనుచుండిరి. సుఖసంతోషములకు భిన్న మీ ఆనందము. సర్వసంగపరిత్యాగికే ఇది సాధ్యము.

(శిష్యునితో) ఏదైన ప్రశ్నయా ?

ఆ, ఉన్నది. కాని ఆ భాగమింకను చదవలేదు.

ఏమది ?

అది దేవుడు, ప్రకృతి గూర్చి.

అలాగా ?

చూచీచూడగనే దైవ ప్రకృతు లేల ఒకరి కొకరు దూరమగుదురు ?

క్రీడకై. శ్రీ అరవిందులట్లనిరి: "వారాడుకొనుచున్నారు."

(ఒక యువక శిష్యుడు) మాతా, ఆ సంగతి ప్రకృతి ఎఱుంగునా ? భగవానున కది తెలియును; కాని ప్రకృతికి ?

ప్రకృతికూడ ఎఱుగుననుకొందును. ఎఱుగనిది మనిషే—

(మరొక శిష్యుడు) ప్రేమమయీ, మాతా, ప్రకృతి ఎచట దాగుకొనగలరు ?

ఎచట దాగుకొనగలదు? నాయనా, ఆమె నిశ్చేతనలో దాగగలదు—అదొక విస్తృత దాగుడుమూతల స్థలము—అంతేకాక, భగవానుడుకూడ నందే దాగుకొనును.

ఆటయని ఎఱిగి హుషారుగ ఆడిన ఆట వినోదమిచ్చును. తెలియకున్న నది హుషారుగ నుండదు. భగవానుని పక్షమున నున్నవారికే ఇది ఆటయని తెలియుట. దీనిని మఱువకుడు. అజ్ఞానవశతచే, సుఖమీయదగినది బాధాకర మగుచున్నది. తెలిసి బుద్ధిపూర్వకముగా చేయునది ఆసక్తికరమై వినోదమిచ్చును. బలవంతముగా నీ చేయునది, నీవు సహింపవలసినది దుఃఖమునిచ్చును. కావున ప్రాయికముగ నీయబడు సమాధానమిది: "నేర్చుకో, తెలుసుకో, బుద్ధిపూర్వకముగా చేయి." కాని, నా సమాధానమిది: "ఆట మార్చుకో", అట్లు చేసిన స్వభావానుగుణ్యమగు హాయి కలుగును. ఆట యనుకొనక పట్టుదలతో ఆడి విసుగు చెందు వారిని చూచిన, విచారింతును—ఇది నా వ్యక్తిగతాభిప్రాయము సుమండీ.

ఆవలి పక్షమున చేరగనే దిగులుతో నిక దుఃఖింపవు—ప్రేక్షకుని దృష్టితో చూచుటయే గాక అతనివలె వ్యవహరించుచున్నచో భావములు తారుమారయి వెనుకటి దుఃఖ మిక తోపదు. వెనుక అజ్ఞాన భారమున క్రుంగి గమ్యము కానరాక, అంతు తెలియక ఖిన్నుడ వయితివి, ఇప్పుడో, "సనాతనోద్యానమున సనాతన క్రీడ" అనగల్గుటచే దుఃఖమునకు చోటులేదు. ఆటపద్ధతుల నెఱింగిన వినోద

మధికమగును. కావున, ఆ పద్ధతులు నేర్చుకొనుడు. కాని అది అందరకు సాధ్యముకాని పని.

నా కేదో స్మృతిపథమున గాఢముద్ర వేసినది— హాస్యగా డొకడు వచ్చి ఆటను నాటకముగా మార్చినట్లు. వీడే సకలానర్థములకును కారకుడు. ఆధ్యాత్మిక సంప్రదాయములన్నను, ఈ అజ్ఞానజనితారిష్టము లాదినుండియు నున్నవే యని చెప్పజాలము. నే నట్లున్నట్లు నమ్మలేను. అదొక యాదృచ్ఛిక సంఘటన యందును, విశ్వచైతన్య దృష్టికి సరిదిద్దగలదే యయినను మానవదృష్టికి మిక్కిలి భయానక ప్రమాదమే అనవలెను. అయిన నది శమించినను జ్ఞప్తినుండి తొలగదు.— "అయనే, మన కన్యథా లభింపనిది మన కిది ఇచ్చెను." అనుకొన గలము. కాని అది మొదట తొలగవలెను.

"ఈ ప్రమాదము ముందుగానే దర్శించబడినది, సంకల్పించబడినది." అనువారుండవచ్చును. నే నది నమ్మను. అయినను, దానితో ఆదినుండి వేరొకటి లేచెను. ఇది రానిచో అది రాకుండెడిదేమో! ఆనంద మానందముగ నుండి, ఆనందముగ నూహించబడి, సకల మానందోద్భవమే యగుచో, పరమ జ్ఞానమున కజ్ఞానములో ప్రేమగా చోర నగత్య ముండెడిదికాదు; విభజనే లేకుంటను, బయట నుండి క్రిందుగా చూచువాడు, "చివరికేదియో దానినుండి వచ్చినది" అనుకొనును, ఎంతో దూరమునుండి ఎత్తున నుండి చూచిననే అది సాధ్యము. అదంతయు విడిచి ఆనందమును చేరగనే (దుఃఖము, వేర్పాటు భావము మొ॥) "ఆ! అవును,— అన్యథా కనరానిదానిని కని అనుభవము సంపాదించితిని" అనును. కాని, ఇందులకది గతించిపోయిన అనుభవము కావలెను. ఏలయన, ఎంతటి సిద్ధునికైనను అజ్ఞానమున దొర్లు మందభాగ్యులు విచారము కల్గింపగలరు. మానవాళి యంతయు పూర్తి పరివర్తన చెందిననే, "ఆ ప్రమాదమూలముననే నిత్యలాభము పొసగినది," అనగలుగుదుము. అయిన, దీని కెంత మూల్యము చెల్లింపవలెనో!

అందులకే ఎందరో సాధకులు 'నేతి' సిద్ధాంతమున కాకర్షింపబడిరి. అజ్ఞాన ప్రమాదమునుండి తప్పుకొనుట కదొక్క బాట.

సత్యమనునది శాశ్వతసత్యమే—అన్యము కాబోదు. 'నేతి' సిద్ధాంత మును వాస్తవిక దివ్య సిద్ధాంతముగ మార్చుట మన నేటి ధ్యేయము. ఎంత మూల్యమయిన చెల్లింపగలము. దానికైన మొదటి అడుగు వేసితిమనిరి శ్రీ అరవిందులు. ప్రాప్తికాలము సమీపమున నున్నదనిరి, నడక సాగించుటే తరువాయి. అంతే.

కావున నీ ప్రశ్న (దాగుడుమూతల ఆటను గూర్చి అడిగిన శిష్యు నుద్దే శించి)— ఇదేనా నీ వడిగినది?

నిజముగా నీ వడిగినది.... ఎందుకీ ఉపమానమని?

అవును.

దీనిని తారుమారు చేయవచ్చును. విశ్వమిట్లున్నదనక, భగవానుడు, మనిషి, అట్లు కనిపించెదరని చెప్పక, ఇది వారికున్న ముఖ్య సంబంధపు స్థూల వర్ణన, అనవచ్చును.

ఆటలోనున్నపుడు మనిషి ఎక్కువ దివ్యుడని దీని యర్థము. (నవ్వు) శాస్త్రజ్ఞుని పాండిత్యమునను, తపసి తపస్విత్వమునను లేని దివ్యత్వము, బాలుని క్రీడలో నున్నదేమో! దానినే నిత్యము భావించుచుండును. (మందహాసముతో) తన్ను తా నెఱుగని దా దివ్యత్వము.

సంతోషముగ నాడువేళ నేను నేనుగ నున్నట్లు నాకు తోచును. గంభీర ముగనుండి గాఢముగ యోచించువేళ అట్లనిపించదు; నే నేదో సృష్టిభారము మోయుచున్నట్లుండును. మోయరాని భారము, త్రోవ తెన్ను కానరాదు. కాని, నే నాడువేళ.... పైనుండి ఆనందపరాగము పడి సృష్టికి పూత పూసినట్లు తోచును, ప్రపంచమును దాని నిజస్థితికి తెచ్చినట్లు తోచును— చాల దగ్గరగా.

మాతా, మీరు గంభీరముగ ఎల్లపుడుందురేల?

మీరు చూచియేయుందురు—కాదూ? నాకు తెలియదు. ఒకడు నీట మునిగి పోవుచున్ననో, కష్టములో నున్నపుడో; వానికై ఒడ్డునుండి నీట దూక వలెను—అదే కారణమేమో? సృష్టియొక ప్రత్యేక దుర్దశలో నున్న వేళ, ఓ మెట్టు దిగి దాని నుద్ధరింప జనును. అందులకే గంభీరత, అంతయు సవ్యము గనున్న నవ్వుచు హాయిగా గడపవచ్చును.

జోస్యములు, ఉత్సాహ వాక్యములు, స్తోత్రములు, ప్రార్థనలు అపరార్ధ గోళ జనితములు (శ్రీ అరవిందులవాణి). సాధకు డింకను దిగువనేయున్నాడు, అది శిఖరము కానోపు; అపరార్ధగోళపు టంచు కానోపు. దీనిని దాటగానే ఇవ న్నియు పిచ్చి చేష్టలుగ, వ్యర్థములుగ కాన్పించును. అపరార్ధగోళము దాటకు న్నంతవరకే వీని ప్రయోజనము. పరార్ధగోళమున చేరినవేళ, పూర్తి ఎఱుకతో వ్యవహరించువేళ వీని ప్రయోజన మిక లేదు. ఎటుచూచిన నిది పతనమే.

(దివ్యజీవనము) 'Life Divine' మీతో కలిసి చదివెదను. దానిని చదువుటకు తగిన ఈడు మీకు వచ్చినది, దాని నర్థము చేసికొనగల మేధా శక్తి కలదనుకొందును. పాఠ్యభాగ మాధారముగ మీ రెన్నో తెలుసుకొన గలరు. ముందుకు సాగగలరు. ఆత్మదర్శనమున కదియే మొదటి మెట్టు, ఆయన వర్ణన లద్భుతములు. ఎఱుకల భేదము నిర్దుష్టముగ వర్ణించిరి. మనిషి సర్వోత్కృష్ట మనుకొనునది సర్వము అపరార్ధగోళమున కెట్లు సంబంధించినదో ఆయన స్పష్టపరతురు. దివ్య లనబడు సురేంద్రాదు లెట్లు అపరార్ధమునకు మాత్రమే పరిమితు లగుదురో తెలుపుదురు. పరార్ధగోళమున ఆనందస్థితి (అతి మానస) ఎట్టిదో కూడ వా రెఱింగింతురు.

వాస్తవమున కచ్చట చేరకుండ తెలియరాని విటనెన్నో కలవు.

ఇప్పుడిక మన మా బాట తెఱచి కొంత పైకిపోదము.

* * *

16 జనవరి 1957

"మనిషి గ్రుడ్డిగా ఆరంభించి తాను వెదుకుచున్న దేదియో కూడ నెఱుగడు— జడప్రకృతి నుండి వచ్చుట నాతడు చూడగల్గు నప్పుడుకూడ తనలో నంతకంత కధిక మగుచున్న కాంతిచే మోహితుడై తన నిజ స్వభావమగు దివ్యత్వ మాశంకింపబోడు. మన ఆక్రందనకు భగవానుడు బాహాటముగ జబాబీయడు. మనిషి గ్రుడ్డితనము భగవానుని కానంద జనకము; పసిపాప తల్లిని చేతులతో తడివి నిశ్చయింపజూచుచో జనని కానందము గదా!"

(తలపులు- తళుకులు సంపుటి 16, పుట 382)

ప్రేమమయీ, మాతా, వెదకుచున్న దేదో తెలియ కుంట సంభవమా ?

ఎన్నో కలవు: భావించునవి, స్ఫురించునవి, వాంఛించునవి, చేయునవి, నిన్ను నీవెఱుగుదువా ? నీలో జరుగుచున్న దెఱుంగుదువా ? లేవు. ఆకస్మికముగ నిన్నెవరైన, ఏమి చేయుచున్నావని యడిగిన, 99% "నాకు తెలియదు, ఏమీ లేదు" అందువు; నీకేమి కావలెనన్నచో, నీవు చెప్పలేనందువు; ఏ మాలోచించుచుంటి వనిన, తెలియదందువు. ఆత్మపరీక్ష చేయువారే (జీవితవిధానము), తమ్ము తా మెఱుంగు నక్కఱ పొందినవారే ఈ ప్రశ్నలకు సూటిగా జబాబీయగలరు, జీవితావసరముల యోచించుచున్నవా రగుటను; "అవును, నా కది కావలెను, దానినే యోచించుచున్నాను, అనుభూతి నందుచున్నాను" అనగలరు. ఇవి జీవిత మున కొన్ని క్షణములు మాత్రమే, జీవితమంతయును కాదు,

మీ రిది గమనించలేదా ?

అనేకులు తాము భూమిపై జన్మించుటకు, తమ రూపమునకు హేతువేమో తెలియ కోరరు—తమ నిజసత్త్వ మేమో అంతకంటె నన్వేషింపబోరు. అతి స్వల్ప సంఖ్యాకులే దీనికై శ్రమింతురు. దీని నెఱింగినవాడు కలసిననే వాని కది తెలియుట సాధ్యము. దృష్టాంతము: శ్రీఅరవిందరచనలు మీకు లభింపలే దనుకొనుడు. దీనికై తమ జీవితముల నంకిత మొనర్చుకొనిన సన్యాసుల, వేదాన్తుల గ్రంథములును మీకు దొరకలే దనుకొనుడు, కోటాను కోట్ల సామాన్యుల వలెనే, దేవుళ్లు, ఒక మతము అలవాటు ప్రకారము చేకొని, విశ్వాసము తప్ప హేతుపూర్వక నిశ్చితము లేవియు లేక కాలము గడుపుచుందువు. బాల్యమున క్రీడలు, తిండి నీ ఆలోచనా విషయములు; చదువుగూర్చి కొంత చింతన; జీవిత పరిస్థితుల గూర్చిన చింత తదుపరి. అంతే. తా నెవరో, స్వస్థలమేదో తెలుసు కొన తహతహ నొందువా రెందరు? ఒక ఘోరప్రమాదము రానున్న వేళ కొందరి కీ ప్రశ్న కల్గవచ్చును. తా మధికముగ ప్రేమించిన వ్యక్తి మరణము, లేక అతని ప్రత్యేక దురవస్థ చూచినవేళ కొందరు మేధావులు తమలో, ఏమిటీ దుస్సహజీవితము? ఏమి ప్రయోజనము? గమ్య మేమి? అనుకొందురు.

ఆ ముహూర్తముననే వానిలో జిజ్ఞాస జనించినది. తానేదో అనన్యుడ నను ఊహ జనించిననే అన్వేషణ. అది ఆలస్యముగ వచ్చును. ఈ దేహమున జన్మించినదాది ఎన్ని అవాంతరములు ఘటిల్లినను, మనోంతరాళమున ఈశ్వరావాస మున్నదే—అదియే జీవుని తన కృతకృత్యత దిశగా త్రోయును. ఇది సర్వదా గ్రహింపరానిది; విషాదపరిస్థితులలోనే ఈ సత్యము గోచరించుట. కాని, నీకు తెలియకుండనే ఈ ఐక్యతాకాంక్షను నీలో మేల్కొల్పుచున్నాడు.

పదేండ్ల ప్రాయమున బాబూ నీ కిది తెలియునా? తెలియదుకదూ? నీలో నున్న ఈశ్వరుడు నిన్ను వాంఛింపజూచునది, నిన్ను వెదికింపజూచునది నీ ఎఱుకలేకనే నిన్నిచ్చటికి తెచ్చియుండనోపు.

ఎన్నిటినో విచారించకయే అందినవి చేకొందుము: "అట్లా కావలసి యున్నది, కావున నట్లైనది" అవియే అనేకుల నమ్మిక. నే నడుగకముందు

మీ రిటకు వచ్చుటకు హేతు వాలోచించినవా రెందరు ? అది తెలియుట కుత్సహింతును.

మీ జబా బిట్లుండును: "మా తలిదండ్రు లిట నున్నారు. కావున నే నిట నున్నాను". ఏమయిన, మీరిట జన్మింపలేదే !— నీవు, నీవుకూడ— నీవు బెంగుళూరులో పుట్టితివి, మీ రెవరును ఇట పుట్టలేదు. అయిన నిట నుంటిరి. కారణ మరసితిరా ? "అట్లా కావలసియున్నది, కావున నట్లైనది ?" అనుటతప్ప, "ఈ సంఘటన నా జీవితోద్దేశ్యపు సూచనయేమో !" అని భావించుట ఎంతటివారికి ?

ప్రతివారును స్వభావానుగుణముగ సంఘటనల వ్యాఖ్యానింతురు. వాని కంత విలువ లేదు. వెనుక నొక గాఢహేతువు, మీ రెఱుంగని దున్నది. మీరిట నుండుటకు కారణ మరసినవా రిట నున్నారా ? "నే నిట నుంటకు ప్రధాన హేతు వేది ?" అని శంకించు వా రున్నారా ?

బాబూ, నిన్ను నీవు ప్రశ్నించుకొంటివా ?

ప్రేమమయీ, మాతా, మిమ్ముల నొకసారి
ఈ ప్రశ్న అడిగితిని—

అవును — నిజం— మఱి నీవో ? నీవో ?

నాకు గుర్తు లేదు.

ఆ! నీకు గుర్తులేదు —నీకో ?

మాతా, ఇంతకుముందు లేదు.

ఇంతకుముందు లేదు— ఇప్పుడు వచ్చెను. నీవో ?

లేదు —

లేదు !— కారణ మిది. మీ రందరు కొంత జీవితానుభవము గడించి వచ్చినవారే. కోరి వచ్చినవారే—కారణ మున్నవారే, పాక్షికసత్యము కావచ్చును- పూర్తిసత్యము కాకపోవచ్చును.

ఈ పరమ సత్యాన్వేషణలో అనేక మజిలీ లున్నవి. ఒకటొకటిగా దాటు టావశ్యకము.

ఈ ఎఱుక నన్వేషించుటకు పూర్వము, తన యుగముల తరబడి చెందిన అభివృద్ధిని మానస తెరలో చూడగలవాడై యుండవలెను. తన ఆత్మ నెఱింగి యుండవలెను. స్థూలదేహము తాను కానని ఎఱుంగవలెను. అంత నది ఉత్సాహ జనకమగును. జీవితమునే మార్చివేయును. నా మాట నమ్ముడు.

అస్పష్ట దృశ్యమునకును విస్పష్టదృశ్యమునకును ఎంతో భేదమున్నది : ఒకటి: అనియు అననిది; శక్తియొక్క త్రోపు నిన్ను కార్యమున దింపునట్లు, ఏదో ఆకర్షణ నిన్ను సక్రమముగ నడుపుచున్నట్లు; ఇదమిద్ధమని అనరానిది.

రెండు: స్పష్టముగ కననగునది. జీవితపు పూర్ణావగాహన. అంత వస్తువుల యథార్థస్వభావము భాసించును. అప్పుడే మనిషి విధివిలాసగామి కాగల్గును. గమ్యము దెస దృఢబుద్ధితో పయనించి చేరగలడు. అంతర్గతాభివృద్ధి చేతనే అది సాధ్యము. క్రొత్త క్షితిజములపై ద్వారములు తెఱచుకొనునట్లు అది నవ్య జననమే యగును. గభీరమును, చిరకాల ముండునదియు నగు ఎఱుక ఇప్పుడు నీకుండును.

అంతవరకు, మాసిన దృష్టితో, తడవుకొనుచు, సడలింపరానిదను విధి భారమున నలుగుచు తపించుచుందువు. విధికి బానిసవై దాని బంధన విచ్ఛేద మొనర్చు విధాన మెఱుంగలేక కాలిక్రింది కీటకమువలె నలుగుచుందువు.

ఇది నీ పాక్షిక ఎఱుక ఫలము. సాధారణముగ నీ శృంఖలముతో తుష్టి వహింతువు. దానిని శంకించుట నీ కాశ్చర్యముగ తోచును. అయిన నీవు పట్టుదలతో, బుద్ధిపూర్వకముగ నీ దుఃస్థితి హేతువు నన్వేషించినచో (ఇది అరుదు) నీ జీవిత మార్గమే పూర్తిగ మారగలదు—వాస్తవిక జీవితక్షేత్రమున ప్రవేశింతువు. వెనుకటి దంతయు పెద్ద కలగా మారిపోవును.

  

జనవరి 23, 1957

"మానవ మాధవుల కలయిక మానవునిలో మాధవుని ప్రవేశము; మాధవునియందు మానవుని విలీనము-

"ఈ విలీనము విలయనము కాబోదు. అన్వేషణ, ఉద్వేగము, బాధాసహనము, ఉత్కంఠ- వీని గమ్యము నాశనము కాబోదు. అట్టి అంతమునకీ క్రీడారంభమేల?

"దాని గమ్య మానందము- నిర్మలానందము పొందిన నీవు భగవంతుని పొందగలవు.

"దీనికంతకు ప్రారంభమేది ? బ్రహ్మము తన్ను తాను చూచుకొనెడి ఆనందము కొఱకు తన్నుతాను పృథక్కరణ మొనరించు కొనుటయే- అర్బుద ఖర్వ సంఖ్యలలో.

"దాని మధ్య మేది ? వీని ఏకీకరణము కొరకైన తపన, దుర్భరవ్యథ ఇవి కాలాకృతులు, అసంబద్ధమైన విపరీతస్పందనములు.

"దాని అంతమేది ? తేనె తన్ను తాను రుచి చూచు నట్లు, ప్రతి బిందువును ఇతర బిందువులను చవి గొనునట్లు. అన్నియు కలసి పట్టును చవిగొనునట్లు, జగజ్జీవేశ్వరుల శాశ్వత సమాగమమే, ఐక్యతాసిద్ధియే.

"దీని కంఠకును కీలకము ప్రేమ. సంతోషము స్వరము, గానము; శక్తిగీతము, జ్ఞానము గాయకుడు; పరమాత్మ కూర్పరియు, శ్రోతలును. మన మెఱింగినది ఆరంభమందలి అపస్వరమే. గానమాధురి ఎంత శ్రావ్యముగ ఆనందముగనుండునో ఇది అంత కటువుగ బాధాకరముగ నుండును. కాని మనము చివరగా దివ్యానంద సంస్థితులను తప్పక చేరగలము —"

(తలపులు. తళుకులు సంపుటి 16. పుట 384)

నిర్మలానంద మెట్లు కల్గును ?

మొదటగా కోర్కెల స్వభావమును, వానిలోని దోషములను, అవి యీయగల సంతోషము యొక్క క్షణికత్వమును శ్రద్ధగా గమనించి తేల్చుకొనుము.

తర్వాత కోర్కెల జోలికి పోకుము. వానియెడ జుగుప్స వహింపుము. ఇది గౌతమబుద్ధుని ప్రథమబోధ ఫలము : కోర్కెల తీర్చుకొనుటలోకంటె వదలుటలో గల ఆనంద మెక్కువ. ఈ సత్యమును ప్రతి సాధకుడు నెప్పుడో యొకప్పుడు తెలియకపోడు. ఈ ఆనందము ముందు అది సూర్యుని ఎదుట దివిటీవంటిది మాత్రమే సుమీ.

దీనిని పట్టుదలతో అభ్యసించిన, కోర్కెలు నిన్ను వదలి పలాయనమగును. అంత నిన్ను నీవు అంతర్గతముగ విమర్శించుకొనుట కవకాశము లభించును— నీ ఆకాంక్షదిశ వెళ్లగలవు— బ్రహ్మము దెస- ఆనందధామమునకు- ప్రతిఫలము కోరని నిర్మల ఆత్మార్పణతో నీ విది చేసిన, హృదయ మొక వెచ్చని, తీయని, హాయిగొల్పు కాంతితో నిండును. నీలో ఆనందముద్భవించునని సూచించు సాంకేతిక మది.

అంతట మార్గము తేలిక—

ప్రేమమయీ, మాతా, బ్రహ్మానంద మెట్లుండును?

నేను చెప్పుచున్నట్లు—

అయిన మాతా, శ్రీఅరవిందులు, "ఈ ఆనందానుభవమునకే భగవానుడు తన్ను అద్భుత సంఖ్యారూపములుగా మార్చుకొనె" ననిరి. అది ఎట్టిది ?

అస్తిత్వానందమే—

తాను సిద్ధమను భావన తోచును. సృష్టిలోని సకల చరాచరములతోను, జడములు చేతనము అను భేదభావన ఏ మాత్రమును లేక ప్రతి వస్తువునందును ఈ ఆనంద మనుభవించును. ఉనికియే ఆనందము. ఈ ఆనంద ప్రకంపనముల నన్నిటను గుర్తింపగలడు. చేతికి తగిలిన దేదైనను అతని నీ యానందమున ముంచిలేల్చును. పైన సూచించిన శిక్షణ ప్రణాళిక మీరరాదు. కోర్కె లేపాటి మిగిలియున్నను, అనురాగాదులు లేశమాత్రమున్నను దీనిని పొందరాదు. ముమ్మాటికిని పొందరాదు.

విషయముల భౌతికప్రాణసుఖ మున్నంతవరకు రానిదిది. ఈ ఆనందము దిగ్వ్యాప్తము, అత్యంత సూక్ష్మము. వాని మధ్యనున్న వాని స్తోత్రములు విననగును. అది నీ పరిసరములలో నిత్యమును విను సమయము రాకపోదు. మానవిక ప్రాణప్రకంపనముల మధ్య మానవులలో దీనిని గాంచుట కష్టము. మానవాళి అహంకారప్రేరితమగుటయు నొక అవరోధమే. జంతువుల మధ్య సుగమము. మొక్కలలో, పూవులలో దీనిని పొందుట అతి తేలిక. అవి ఆనందమున తొణికిసలాడుచుండును. మన ముపయోగించునవన్నియు ఆనంద ప్రఫుల్లములే. వాని ఆనంద మైచ్ఛికము. అనుకూల అననుకూల పరిస్థితుల ప్రసక్తియే అట లేదు. దాని సంబంధము విశ్వాకారజానందముతోడనే. అక్షయానందమది.

దేహమందలి జీవాణువు లన్నియు దానితో నిండును. అది యోచనా ఫలితము కాదు; హేతువాదోద్భవమును కాదు; విమర్శ మంతకంటె కాదు. అదొక సహజస్థితి, జీవనస్థితి. అదెంతయో స్వచ్ఛము, ధారావాహికము. దానినుండి విముఖత ఇక లేదు. అది సంతోషకారి యగు కీర్తన— అత్యంత శాంతము, ఉద్వేగరహితము, హింసాదూరము. మఱియు నది అతి సూక్ష్మము. స్థూలము కూడ. దానిరాక విశ్వమంతయు సమశ్రుతిలో నున్నట్లు తోపజేయును. మనస్సుకు సాధారణముగ జుగుప్సాకరములగునవి ఇప్పుడెంతో మోహనముగ భాసించును.

నే ననినట్లు ప్రజ పరిస్థితులు, ప్రాణమానస స్పందనములు ఎప్పుడు కలగుండు పడుచుండునో అప్పుడీ తామసిక దృష్టికి దిగజారవలసివచ్చును. దానిలో నుండి బయటపడినచో సకలము మారిపోవును. అద్భుతసామరస్య మేర్పడును. అదియే ఆనందము- వాస్తవికానందము.

దానికై శ్రమ అవసరము.

నే సూచించిన శిక్షణకూడ అవసరమే. ఉద్దేశ్యముతో చేసిన కాలవిలంబ మగును. అహము చేరినచోట అర్పణకు తావేది? ఏదియు నాశించని వేళ, దేనికొఱకు నెదురుచూడని వేళ, అది పూర్ణార్పణమే యగుచో, ప్రధానమగు అక్కఱయగుచో, దివ్యుడ వగుట అవశ్యమగువేళ, బేరమే లేనివేళ— శీఘ్ర ముగా ఆ ఆనందము నిన్ను వరించును.

అంతే.

మాతా, ఈ "తేనె బిందువును" వివరింతురా ?

ఓ! తేనె— అదొక చిత్రీకరణమాత్రమే— బాబూ.

ఆయన ఇట్లన్నారు—"ఊహాశీలికది దృగ్గోచర మగునట్లు చేయుటకే" నని. నీవు తేనెపట్టు నూహింపగల్గుచో, తన్నుతాను చవిచూడగలది, అదే నమయమున తన్నుతానేకాక ఇతర బిందువులను, తేనె నంతను చవిచూడగల్గుచో, తానే సకలమూ నయిన ట్లూహింపగల్గుచో— ఇదొక పరమాద్భుతమగు ఉపమాలంకారము. దీని యవగాహన కెంతో ఊహాశక్తి అవసరము.

అట్లే అనుకొంటిని - అది సూచించునదేమి ?
తాత్పర్యము ?

తేనె రుచి శ్రేష్ఠము- కాదా? ప్రతివస్తువున సంతోషమున్నదంటివి. స్థూలదేహమున నది యున్నను, కొంత మోటుగ నుండును.

అది ఆలోచనాసాధ్యము కాదు. భక్తిసాధ్యము. ఊహాశక్తి అవసరము. ఇవి కలవాడే దాని కర్హుడు. పఠనమునకూడ దానిని సాధింపనగును. అది మనుజుని తన నిజస్థితికి మేల్కొల్పగలదు. ఉపమానముమాత్రమే నాయనా, ఇది.

మాతా, చిత్రములు భిన్నములుగా నుండవా ?

తప్పక- అయిన ప్రమాదములేదు. అది వానికి హితమే.

(మౌనము)

అంతేనా ?

నన్నడిగిన ప్రశ్నలు తెస్తిని— అప్పుడే ఆలస్యమైనది.

(మాత కొన్ని కాగితముల తిరగవేయును)

వానిలో ఒకటి జిజ్ఞాస కల్గించును. అది మరొకదినము. వేరొకటి, ప్రశ్నగా తోచునది మాత్రమే. మూడవది, ఉత్సాహకరమేగాని, దాని జబాబు విపులమైనది. అప్పుడే ఎంతో ఆలస్యమయినది.

నా రచనలలోని ఈ క్రింది వాక్యముమీద ఒక ప్రశ్న :—

"భగవానుని దివ్యేచ్ఛ బాహాటముగ ప్రపంచమున వెల్లడి యగుననుట సరికాదు—"

ఇది శ్రీఅరవిందుల "యోగసమన్వయము" నుండి :—

"అంతట నేకత్వము చూడగల్గినచో, సర్వమును భగవదిచ్ఛచే కల్గునని స్ఫురించినచో— "

ఇది "ప్రార్థనలు- ధ్యానముల" నుండి :—

"నీవే అన్ని వస్తువులందు, సకల ప్రాణులందు వ్యవహరించుచున్నావు. సకలక్రియలలోనను నిన్ను చూచు సామర్థ్యము కలవాడే ప్రతికార్యమును దీవనగా మార్చగలవాడు." (డిసెంబర్ 10, 1912)

ఈ రెంటిని సమన్వయ మెట్లు చేతుననునది నన్నడిగిన ప్రశ్న. వీనిలో వైరుధ్యము నాకు తోచుటలేదు. మొదటిదానిలో చెప్పినదిది: "భగవానుని దివ్యేచ్ఛ బాహాటముగ వెల్లడి యగుననుట సరికాదు." నేననునది ఎల్లప్పుడు వెల్లడి కాదని, అట్లగుట అరుదని- బాహాటమయిన అద్భుతముల క్రింద ప్రజ జమకట్టెదరు. అద్భుతము లరుదు, అద్భుతములు క్షణికములు. అవి లేవని కాదు. బాహాటము కావనియే భావము— కాన వైరుధ్యమునకు తావు లేదు. వైరుధ్యమా? వాచకమున మాత్రమే, దానిహేతువు మాటల సరిగ అర్థము చేసుకొనకపోవుటే.

దివ్యేచ్ఛ వ్యవహరించును; కాని బాహాటముగ కాదు. అట్లయిన నది అద్భుతము క్రింద చేర్చబడును. అంతే. దివ్యేచ్ఛ నిత్యము వ్యవహరించుచునే యుండును.

* * *

జనవరి 30, 1957

"ప్రపంచ మంతయు స్వేచ్ఛకే తపించుచున్నది. కాని ప్రతి జీవియు తన శృంఖలములనే ప్రేమించుచున్నాడు. ఇది మన స్వభావపు మొదటి అసత్యాభానమును, విప్పరాని గ్రంథియును.

"జన్మబంధనముల ప్రేమించుచున్నాడు కావున మనిషి దాని సహచరి మృత్యుబంధనముల తగుల్కొనెను. ఈ బంధనముల జిక్కి స్వేచ్ఛకై తహతహనందుచు. తన ఆత్మ సాఫల్యమునకై స్వతంత్రుడు కాగోరుచున్నాడు.

"మానవుడు శక్తిని ప్రేమించుచున్నాడు. కావున అశక్తత కధీనుడైనాడు. ఒకదానిపై నొకటి విరిగిపడుచున్న సముద్రతరంగ శక్తివంటి ఈ ప్రపంచములో ఒక తరంగపు టంచుపై తేలవలె ననుకొన్నవాడు ఇతర తరంగముల తాకిడికి మూర్ఛిల్లవలెను.

"మనిషి సుఖమును ప్రేమించుచున్నాడు కావున వేదనల నాతడు భరింపవలెను. ఉద్వేగరహిత స్వేచ్ఛాజీవితే నిర్మలానందము. సుఖము వెంట బడుట సంకటకారకము శక్తి దుర్వ్యయమది.

"మనిషి స్తిమితమునకై వేగిరించుచున్నాడు. తన చంచల మనస్సు యొక్కయు, కల్లోలిత హృదయము యొక్కయు అనుభూతులకై ఆరాటపడుచున్నాడు. భోగ మాతని కొక జ్వరము. స్తిమితము జడత్వము.

"మనిషి తన భౌతిక దేహపరిమితులను ప్రేమించుచున్నాడు అదే సమయమున తన అపరిమిత మనస్సు యొక్క, సనాతన జీవుని యొక్క స్వేచ్ఛను కోరుచున్నాడు.

"ఈ వ్యత్యాసములలో వానిలోని దేదో ప్రత్యేకాకర్షణ పొందుచున్నది. అది వాని మనీషకు కళాకారకము. అమృతమే కాక విషముకూడ ఆతని రసనను జిజ్ఞాసను ఆకర్షించుచున్నవి."

(తలపులు, తళుకులు సంపుటి 16, పుట 385)

ప్రేమమయీ, మాతా, కళాకారక మనసేమి ?

కళావిలసనముగ పెక్కురు తెల్పు 'వ్యత్యాసమే' అది. కళాకారులు వెలుగునిచ్చునవి నీడలే యందురు, భావింతురు, వ్యత్యాసమే లేకున్న చిత్రలేఖనమే లేదందురు. సంగీతము నట్టిదే. తార, మంద్రాది వ్యత్యాసములు సంగీతమున కొక రక్షరేకు.

నే నెఱింగిన కవులు కొంద రిట్లనిరి; "నా శత్రువుల ద్వేషమే న మిత్రుల స్నేహ మమూల్య మొనర్చుచున్నది; దారిద్ర్యమే సుఖమున కంత చః నిచ్చునదందురు. శాంతివిలువ దైనందిన కలవరపాటుననే. ధ్వనుల హేత పున మౌన మమూల్యమైనది. ఒకమెట్టు పైకిపోయిన: ఆరోగ్య మంతగా ప్రేమింపబడుట రోగముల మూలముననే యనవచ్చును. వస్తువు విలువ దానిని పోగొట్టుకొనిన పిదపనే తెలియగల దనువరకు వచ్చినది: శ్రీఅరవిందు లను చున్నారు; "ఈ కర్మల జ్వరము, కదలిక, సృజనాత్మక భావముయొక్క కలవర మెప్పు డుండవో తాను జడుడైనట్లొకడు తలంచును. కొందరకు మౌనము, అచలత. నిశ్శబ్దము, స్తిమితము భీతిగొల్పును. ప్రకోపనము లేకున్న జీవచ్ఛవ ములుగ తలంచెదరు."

వారు మౌనము విధించిన దృష్టాంతముల నెఱుంగుదును. మనస్సును స్తంభింప జేయుటయు నెఱుంగుదును. నిస్పృహతో మఱలి వచ్చి, "నేను మూర్ఖుడనైతి" ననుటకూడ ఎఱుంగుదును. వారి భావన ఉద్వేగ రహితము.

ఆయన ఇట వివరించున దొక భయానక సత్యము. మనుజులు స్వేచ్ఛా ప్రియులే, అయినను బంధనముల ప్రేమింతురు. ఎపడైన వారికి బంధనచ్ఛేదనా మార్గము చూపగోరిన, వెనుకాడెదరు.

ప్రకృతివిజ్ఞాన, కవిత్వ, లలితకళలకు జీవనముపై గల ఉద్ధృత వైపరీత్య ములపై మానవుని కళాసృష్టి ఆధారపడియున్నది. తమ నిత్య నాటకములనుండి వానిని తీయునపుడు అది కళ కాబోదను శంక కల్గును. ఒక గ్రంథము వ్రాయ గోరినను, ఒక నాటకము వ్రాయగోరినను, (వైపరీత్యరహిత) సకలము సమశ్రుతి యుతము, రమ్యము, ఛాయారహితము అయిన నిరుత్సాహజనకమై విసుగు గొల్పును. జీవమే లేకుండును, కారణము? మనిషి సామాన్యజీవిత విధానమే, ఈ వైవిధ్యముల నిండియున్నది. మృత్యువేలేకున్న జీవనము దుర్భరమే అయి యుండెడిది, జీవించుట కెవ్వరును కోరకుందురు.

(దీక్షమౌనము)

వెనుకటిసారి యొక ప్రశ్న యడిగిరి.

"ఒక గమ్యమును చేరగోరు వేళ, ఎన్నో అవరోధము లేర్పడును. వానిని బట్టి, నీ తలంపు లోప భూయిష్ఠమని ప్రయత్నము మానవలెనా, లేక అవి విజయ సూచకములనియు, పొందగల పరివర్తనా సూచకములనియు, పట్టుదల సడలింపకుండుటకు సంకేతమనియు, భావింపవలెనా ?

నే నిచట యోగమును గూర్చి మాట్లాడుటలేదు. మన పనులు, క్రీడలు మొదలగు చిన్న విషయముల గూర్చియే. మరొక విధమున చెప్పిన, —పరిస్థితుల ప్రాబల్యమున, ఇతరుల సాంగత్యమున, అనుభవముల వలన లభించుచర్యకత్వము నెట్లుగుర్తించి అన్వయింప నగునను దాని గూర్చి నేను మాట్లాడుచున్నాను."

యోగశిక్షణ పొందగోరువాడు ఏదో యొకటి ఆరంభింపక పూర్వము అది అంతఃప్రేరణమో, పరమాత్మనుండి వచ్చుచున్నదో, బాహ్యపరిస్థితుల ప్రక్రియయో, మానస ప్రాణ సంబంధమగు వేగిరపాటో, విచారపూర్వకముగ ప్రయత్నించి తెలుసుకొనవలెను. ఇది చాల ముఖ్యము. అత్యంతముఖ్య మీ విచార్యాప్రయత్నము. అప్పుడే కారణము పూర్తిగ నెఱింగి వ్యవహరింప వీలగును. మనిషి చేయు ననేక కార్యములను ముందుగా పర్యాలోకించు అలవా టాతని కుండదు. పరిస్థితి దాపురించిన, దానికి తలవంచును. అన్ని కార్యములు ముఖ్యములుకావు. వానిని చేయురీతి ప్రధానము. ప్రాత పద్ధతినే పోవుచుండుటయు, బాహ్యఫలితములకై ఒకవిధముగ నడచుకొనుటయు జీవితదృష్టినుండి ప్రాధాన్యము వహించుచున్నవి. ఉదాహరణకు; పెండ్లి చేసుకొనుట, ఒకచోట వసింప జనులు, ఏదో వృత్తి చేకొనుట—వీనిని ప్రధానముగ భావింతుము. కొంతవరకవి అట్టివే. యోగ

మునకూడ విషయ ప్రాధాన్యముకాక వైఖరి ప్రాధాన్యముమీదనే సర్వ మాధారపడి యున్నది. నిత్యజీవితములోని చిన్నచిన్న పనులకు ప్రాముఖ్యము అతి తక్కువ.

కొందరు భయస్థులు (న్యాయాన్యాయ శంకగలవారు) సమస్యల నెదుర్కొని సాధింప జూతురు. సమస్యల వివరణావిధాన లోపముచే తప్పటడుగు వేతురు. దివ్యజ్ఞాన సామాజికురాలగు నొక యువతి నెఱుంగుదును. ఆమె ఆ సమాజసూత్రము లభ్యసించుచుండెను. నాతో ఆమె ఇట్లనెను: "మన చేత లన్నిటను దివ్యేచ్ఛయే గెలువవలెనని బోధింపబడితిమి. కాని ఉదయమున ప్రథమ భోజనావసరమున కాఫీలో ఒక చక్కెర గుళికయో, రెండో, ఎన్ని భగవంతుడు కోరుచుండెనో ఎఱుంగుటెట్లు? ఇది చాల కరుణాభరితము. చక్కెర గుళికల సంఖ్యకంటె, కాఫీత్రాగు నుద్దేశ్యమునకు, ఆహారముపై ఆమెకుగల వైఖరికి ఎక్కువప్రాధాన్యము కలదని నచ్చజెప్పుట కెంతో శ్రమ యయ్యెను. అనుక్షణము చేయు చిన్నపనులిట్టివే. మానవవిధానములు భగవానునివి కావు. చక్కెర గుళిక లాతని పని కాదు. పనులయెడ క్రమవైఖరిని నీలో ప్రేరేపును. ముఖ్యమైన వివి: అంకిత బుద్ధి, మార్దవము, పట్టుదల, ఆశారాహిత్యము, సద్భావము, సరిదిద్దుకొనుట, అభివృద్ధికగు ప్రయత్నము. నీవు మానసిక నిశ్చయములు గైకొన గలవు. కాని, ఉత్తమ, నీచకార్య విచక్షణ, సమత్వవాతావరణ జనిత ఆంతరంగిక వైఖరీమూలముననే సాధ్యము. ఐచ్ఛిక క్రియకు ఈ వైఖరియే పరమాదర్శము. ఇది బహుకాల ప్రయత్న సాధ్యము మాత్రమే— దానిని పొందువరకును సత్యవైఖరి నవలంబించుటకు పూన్కి వహింపుము. సత్యమగు జిజ్ఞాస ముఖ్యము. కసరత్తు ముఖ్యమా, పాఠమా? అనువానికి ప్రత్యేక ప్రాముఖ్యము లేదు. తారతమ్యప్రాముఖ్యమే యున్నది, ముఖ్యమగునది తత్వజిజ్ఞాసలో నవ్యముగ నుండుటయు, అభివృద్ధికైన సజీవేచ్ఛయు. లాభమునకై చేపట్టిన పనిని పట్టుదలతో చేయుము. అవరోధముల లక్షింపకుము. ఇక చేయ నవసరము లేదను నిక్కచ్చి భావన ఏర్పడు సంఘటన కల్గువరకు ఆగకుము. ఈ సూత్రము పాటింపుము. కాని, ఇట్లు చేయువా రరుదు.

విషయములు ప్రాయికముగ వాని మార్గ మనుసరించును. ఒక ఘట్టము చేరగనే అంతమగుటో, కోరిన ఫలితము కల్గుటో జరుగును. కారణము

తెలియును—అయిన అడ్డంకులు విపరీతములుగా, ప్రోత్సాహములుగా, తిరుగులేని వానిగా పరిగణింపరాదు. విషయానుగతముగ వేర్వేరు అర్థము లుండవచ్చును, బాహ్యసంఘటనలనుబట్టి తాను చేయు పనియొక్క సమంజసత్వ నిర్ణయము చేయరాదు.

శ్రద్ధాళువుకు సూచన రానోపు, తన పని ప్రాముఖ్యమును తెల్పు మనో భావము. సద్భావశీలున కెల్లపు డిట్టి సూచన రాగలదు. ప్రమాదకార్యము చేయగలవానికి హృదయచక్రమున కలవరముదయించును. అది అతిసూక్ష్మ స్పందనమగుట సామాన్యుడు గుర్తింపబోడు. శ్రద్ధాళువునకే ఆపని సాధ్యము. ఓ విధమగు అనుతాపమువలె, పతనమువలె నది భాసించును. దానిని యత్నించి తేల్చుకొనవలెను. దానిని లక్షింపకున్న నది మాయమగును.

తప్పెదిగినకొలది అది ఎదుగదు. అది మాయమగును. ఎఱుక మాటున కేగును—ముసుగులో దూరును. దాని సూచన సందేహాస్పదము. దానిని దూర మొనరించిన మరి రాబోదు, దానిపై శ్రద్ధ చూపిన నీ కది అత్యుత్తమ సారథియగును.

. కాని, వ్యాకులత యున్నచో అది వచ్చును. అది పొడచూపకున్న, చేయుదానిని సాంతముగ చేయుట శ్రేయము. నిరాతంకమును, అప్రతిహతమును నగు సూచన అంది ననే తప్ప ఏ పనినిగాని మధ్యలో మానరాదు. అంత నీ అనుభవము సమగ్రమగును.

* * *

ఫిబ్రవరి 6, 1957

బతుకునకు ప్రకృతి నిత్యము అడుగు ప్రశ్న చావును గూర్చి. చావుకు జబాబు కనుగొనలేదని గుర్తు చేయుట అది. చావే లేకున్న జీవుడు జీవిత పంజరమున బంధింపబడుట నిశ్చయము. చావుచే తఱుమబడి శాశ్వత జీవనభావ మెఱుంగుచున్నాడు. దాని విధానావకాశముల నన్వేషించుచున్నాడు.

(తలపులు, తళుకులు—సం 16. పు. 386)

ఈ వాక్యములు నేటికి చాలు ననుకొందును. దాని పైది అనవసరము. ఏ మాత్రపు మననశీలి యయినను, జీవితమున నొక పర్యాయమయిన తన్ను తాను ప్రశ్నించుకొనియే యుండును. మనిషి తన శాశ్వతత్వము నభివృద్ధి పొందించుకొను నక్కఱ తనలో చూచాయగా కనుచుండును. ఒకసారి చావు తప్పి బ్రతికిన కుంచించుకు పోవును.

దీనివలన అంతఃకరణమున భయము కొందరకును, ఆగ్రహ మితరుల లోను జనించును. తాను కోరకయే వచ్చిన ఈ ఘోరవిపత్తెట్టిది? అను ప్రశ్న తోచును. చావు విధాయకమగుచో ఈ పుట్టు కేల? తన్నభివృద్ధి పరచుకొనుట కీ తాపత్రయ మేల? అంతయు నాశమునకు గుఱియగుచో ఈ అద్భుత ప్రకృతి వశీకరణ వృథాశ్రమ. ధీరులు ఈ నిరాశ పాల్గారు. తగిన కారణ మన్వేషింపసాగెదరు. భీరులు నిరాశానిస్పృహులై విధికి పాదాక్రాంతులగుదురు.

సృష్టిలోని వస్తువులలో పరిపూర్ణత్వము యొక్క అవసరము జాగరిత మొనర్చుట కిది వదలరానిదనిరి శ్రీఅరవిందులు. ఈ ఉపద్రవమే లేకున్న మనిషి ముందుకు సాగ ప్రయత్నింపక, ఉన్నదానితో తృప్తుడగుననిరి. ఇదమిద్ధమని ఏదియు చెప్పలేము.

అయినను మన విధాయక కృత్యము మరణమును పలాయన మొనర్చుట; మృతు దమృతు డగుట.

సకలమును సదా అభివృద్ధి దిశగా సాగిపోవుచున్నది. అయినను తిరోగ మించునట్లు భ్రమ కల్గించుచున్నది. ఏల? పరిపూర్ణమనుకొనునది అట్లు కాకుండ పోవుచున్న దొకప్పుడు. ఈ విపరీతమునకు హేతువు మనలోని సూక్ష్మాంశములు దివ్యత్వము దెస నూర్ధ్వముగ పోవుచుండ, భౌతిక భాగము బిఱ్ఱబిగుసుకొని క్రిందికి లాగుచుండుటయే. ఇది తప్పుటకు భౌతికభాగమున తగినంత ఎఱుక ప్రవేశపెట్ట వలెను. అంత మరణావసరమే యుండదు.

ప్రకృతి ద్రవ్యములలో చాలిన జిజ్ఞాస, మూర్ఖపము జాగరిత మొనర్చు విధానము కన్గొనినది. అవి అచట నున్నవే కాని మాయాచ్ఛాదితములు.

వస్తువు ముఖ్యలక్షణము స్తబ్ధత. ఇదియే మనిషికొక వరప్రసాదము; అభివృద్ధిదెస నడపు అంకుశము. మనలో ఎఱుకగలవా రితరులలో దీనిని మేల్కొల్పుట విధాయకము.

దీని కవరోధము వస్తువులయందలి అనురాగము. ప్రకృతికి వంకరతిరుగుళ్ళు, క్రమ ప్రయత్నములు తిరోగమనములు, క్రొత్త పోకడలు తిరోగమనములు ప్రియమైనవి. ఎదురుచూడని సన్నివేశము లామె కానందమిచ్చును. కాలయాపన మనుభవింపదగినదనును — జ్ఞానుల కిది యంతయు నచ్చదు. శీఘ్రముగ, సూటిగ గమ్యము చేరవలెనందురు.

ఉత్తమ క్రీడలు సహితము కాలక్రమేణ విసుగు గొల్పును. మార్పు అవశ్యకమగును. స్తబ్ధత, అలసటభావము, ఉదాసీనత వదలుట కీ మార్పు అవసరమగును, గమ్యమును దగ్గరగా తేవచ్చును.

కొంత అభివృద్ధితో దేహము విశ్రాంతి కోరునేల? అది అలసినది; "ఆగండి—విశ్రాంతి నాకు అవసరం," అని దేహము- ఇదే దానిని మరణమున

క్రీడ్చువది. అందచందములు, నిత్య యౌవనభోగములు దేహధ్యేయము—ఈ విస్మయముగొల్పు ప్రకృతి (దేహము) వికృత చేష్టల బారిపడక తప్పించుకొనవచ్చును.

ప్రకృతి అలుగదు—అది నష్టపోదు.... ఒక కటాహములో అనేక విధముల పదార్థముల నుంచి నవ్య పదార్థములు కల్పింప గోరువాని వంటిదామె. ఇదొక క్రీడ ఆమెకు— అందరకు కాదు. ఆమెతో తుల్యమగు ఎఱుకగలవా డామెను కాదని ఆమె కంటె మేలగు నిర్మాణము లొనర్పలేడా?

మన మట్లు చేయజాలమా? యనునదే మన ముందున్న ప్రధాన సమస్య.

బలిష్ఠమగు మేధ వలయును- ఆశక్తి దిగివచ్చుటకు కార్యక్రమ నిర్ణయము చేయవచ్చును. ప్రకృతిని మొదట నమ్మించవలెను. ఆమెకంటె మేలిమి పద్ధతులలో చేయగల వీలున్నదని నచ్చచెప్పవలెను. ఇది వెఱ్ఱిగా ఆదిలో తోచవచ్చును. అద్భుతిక ప్రయోగములెన్నో మొదట అపహసింపబడలేదా?

ఈ వెఱ్ఱి సార్థకమగు తరుణ మేతెంచినది. మన మందర మిట చేరుట అందులకే. కారణము లజ్ఞాతములు కావచ్చును; ఊహకందనివి కావచ్చును. మన మా వెఱ్ఱిని సార్థకపరచుటలో కృతకృత్యులమగుచో మన జీవితము వృధా కాబోదు.

* * *

ఫిబ్రవరి 7, 1957

[నేడు గురువారము. సాముదాయిక ధ్యానదినము. మాత ప్రత్యేకముగ ప్రసంగించెను. అది ఆమె ఆచారముకాదు]

పలువురు సాముదాయిక ధ్యానమునకును, వైయక్తిక ధ్యానమునకును గల వ్యత్యాసమునుగూర్చి ప్రశ్నించిరి. ధ్యానారంభపూర్వము ఆ విషయము కొంత ముచ్చటింతును.

విభిన్న ధ్యానములను మీ కిదివరలో తెల్పియున్నాను. దాని నిక తీసికొనను.

వేర్వేరు ఉద్దేశ్యములతో, వేర్వేరు పద్ధతుల, వేర్వేరు హేతువుల సాముదాయికధ్యాన మన్నికాలముల నభ్యసింపబడెను. కొంద రొకచోట ఒక నిర్దిష్ట ప్రయోజనమునకై కూడుట సాముదాయికధ్యాన మననగును. ప్రార్థించుటకై పల్వు రొకచోట చేరుట ప్రాయికమే— గుడులలో, అన్య స్థలములలో, ప్రార్థన కూటములు ఏర్పాటగుట సహజమే.

మానవచరిత్ర ప్రారంభమైనదాది జనసమూహములు తమ సామాన్య జీవ భావప్రదర్శనకై ఒకచోట చేరుట తెలిసినదే. కలసి దైవస్తుతి చేతురు కొందరు. దీనిలో భక్తి, కృతజ్ఞత ముఖ్యవిషయము, కొంచరు కలసికట్టుగా భగవానుని వేడుకొందురు. ఇట్లు చేసిన తమ ప్రార్థనకు బల మధికమగునని వారి నమ్మిక. వీని కనేక దృష్టాంతములున్నవి. క్రీ. శ. 1000 లో కొందరు ప్రవక్తలు ఉమ్మడి ప్రార్థన చేసిరి, ప్రపంచమునుద్ధరించమని. ఆధునిక కాలమున, జార్జి రాజు న్యుమోనియాతో బాధపడుచుండ, చర్చిలలోనే కాక రాజప్రాసాద సమీప వీధులలో కూడ జనము గుంపులుగా చేరి ఆయన ఆరోగ్యమునకై ప్రార్థనల జేసిరి. రాజు బ్రదుకుట వా రది తమ ప్రార్థనా ఫలితమనియే నమ్మిరి, ఇది బాహ్య ధ్యానము.

అన్ని ఆదిమ కూటములలో, అతి పురాతన ఆధ్యాత్మిక సంస్థలలో సామ దాయిక ధ్యానమే ఆచారము. ఉద్దేశ్యము భిన్నము - సంఘాభివృద్ధికి, నూతన శక్తికై సత్యకాంతి ప్రసారమునకు, మనము చేయునదియు నిదే.

పద్ధతులు మాత్రము రెండు- దీనిని వినుడు. రెండిటిలోనూ వైయక్తికధ్యానములో వలెనే అభ్యాసము. ఉచితాసన మెన్నుకొనుట (నిద్రను ప్రోత్సహించునది కాదు);అటుపైన నే చేయమన్నది- అనగా, ధ్యానమునకు సిద్ధమగుట, మౌనివగుట, బాతాఖాని విరమించుట, చిత్తము మనీషాయత్తము చేయుట, దానిని అనాహతమున నిల్పుట. తలలోని తలపులు, వికారములు అన్నియు నిట చేర్చుట కొన్ని సెకన్లలో సాధింపనగును. ఇది ధ్యానప్రారంభమునకు ముందు. అంత రెండు ప్రవృత్తు లుండవచ్చును. ఒకటి క్రియాపూర్వకము, వేరొకటి నిష్క్రియా పూర్వకము.

మొదటిదానిలో ధ్యానమున కూటము నడపుచున్నవానిపైననే మనస్సు నిల్పి వాని బోధ విని వా డందించు శక్తిని చేకొను నాసక్తితో నుండుట విధాయకము, ఇది కార్మిక ధ్యానము. ఇచట ఇచ్ఛాకర్మ కలదు - పుచ్చుకొనుట, వినుట.

విన్నుసీవు తెలుసుకొనుట నిష్క్రియా పద్ధతి. నిన్ను నీవే తెరచుకొని ఆకాశమునుండి స్రవించుదాని నందుకొనుట. తెరచునది హృదయకవాటము- ధ్యానమున దానిని తెరచి యుంచుము. పుస్తకమున పుటలు త్రిప్పుదువు. అదే సమయమున నీలోని కందలి తలపులు చొరుచుండును,

వీటిలో నొకదాని నెన్నుకొనుము. నీ ప్రవృత్తి అనుకూలత ననుసరించి ఒకటి ఎన్నుకొనుము. రెండును సత్ఫలితములే ఇచ్చును.

నే నిపుడు చేయునది ప్రత్యేకముగ చెప్పెదను. ఏడాది క్రిత మొక బుధవారమున ఆనందశక్తి (అతిమానస) మనకు ప్రకటితమయ్యెను. అప్పటినుండియు (తెలియకున్నను) ఆశక్తి మనలో చురుకుగా వ్యవహరించుచున్నది. దానితో సహకరించు తరుణ మరుదెంచినదని భావించితిని, గ్రహించితిని.

అది ఆశ్రమముననే గాక సకల ప్రపంచమున, అంతట— ఎక్కడెక్కడ దాని స్వీకరింపగలవారుండిరో అక్కడ— అది వ్యవహరించుచున్నది. మనకు తెలియుటచే వ్యష్టిగా మన మొక్కొక్కరము దాని ప్రయోజనము పొందుచున్నా మనుకొందును. సమష్టిగా దాని లాభమును గరిష్ఠముగా పొందుట కొక భూమిక తయారుచేయగలమని ఆశించుచున్నాను. కాలము, శక్తి (ఏ స్వల్పమో తప్ప) వృథాకాకుండ చూడగలము.

చేయదలచినది చెప్పితిని. ఇక చేయుటే మిగిలినది. అది మీనంతు.

* * *

ఫిబ్రవరి 13, 1957

"మన మనుభవించు సుఖము, వాస్తవికానందము లో అల్పాంశ మేయను సత్యమును ప్రకటించుటే బాధ ప్రయోజనము— ప్రతి యిక్కట్టునను ఆనంద జ్యోతి నిగూఢముగ నున్నది మనము హాయి యనుకొను నది మెఱువువంటిది. భయంకర జీవితానుభవములు, దుఃఖములు, దారుణ పరీక్షలు జీవాత్మ నాకర్షించు ట కిదే కారణము. ప్రాకృత మానసములు భయపడి వీనిని తప్పించుకొనజూచును."

(తలుపులు, తళుకులు సంపుటి 16- పుట 386)

బాధద్వారమున మనల నాకర్షించెడి యీ రహస్యమేమియని మనము ప్రశ్నించుకొనుట సహజము. స్థూలదృష్టికలవాడు జీవిబాధనే కోరుచున్నాడని నమ్మవచ్చును. అది తప్పు. జీవి స్వభావమే ఆనందమైయున్నది,—అవికార స్వేచ్ఛాయుత తన్మయకారియగు ఆనందము. కష్టముల ధైర్యముగా నెదుర్కొని వాని నాహ్వానించుట భగవత్కృపపై గల అచంచల విశ్వాసమూలముననే; అవి పిలో నున్న ఆనందాబ్ధికి అతి దగ్గరి మార్గమైన హేతువుననే. సుఖమును గూర్చి కాదు నేను చెప్పునది,—ఈ ఆనంద పరిసరములకైన దాజాలదు సుఖము.

సుఖము మనలను మోహింపజేయును. మన గమ్యమునుండి దూరము చేయును. సత్యాన్వేషకులు దానివంక చూడజనదు. సుఖము కూట స్నేహితుడు. నమ్మించి నమ్మించి గోతిలో త్రోయును. బాధ మనకు ధైర్యసాహసము లిచ్చి, మనల కఠినింపదానితో పోరించి, గమ్యము సుగమము చేయును. బాధయే మనల ధీమంతుల నొనర్చును—బాధను దాటిననే ఆనందధామము చేరగల్గుట.

సుఖకాంక్షి జీవిత సమరమున కనర్హుడు. అతడు దేనినీ ఎదుర్కొనలేక మరుగుటకు ప్రయత్నించును. ఈ జీవితోద్దేశ్యము నెఱుగక, వినోదించుటకై భూమికి వచ్చినారమని తలచుట జీవితమును పాడుచేసినట్లే. ఒక మహత్తరావకాశమును జారవిడచినట్లే. మన శాశ్వత స్థానమునకు చాల దూరమైనట్లే. ఈ భువిపై జీవిత మా శాశ్వతావాసప్రాప్తికై యత్నించుట కిచ్చిన మహదవకాశము, సచ్చిదానందములను చేరుటకైన గొప్ప అవకాశము.

(మౌ న ము)

పీడలను, బాధలను వరించుట హేయమనియు, వానిని తొలగించుకొనవలె ననియు మీ కనేక పర్యాయములు చెప్పితిని. వానికి వెన్నిచ్చుట, తప్పించుకొనజూచుట పందతన మంటిని. వాని నెదుర్కొని ఎంత శీఘ్రముగ మాపుకొనిన అంత మంచిది. అవి మనకు కొన్ని గుణపాఠముల బోధకే పంపబడినవి. ఎంత త్వరితముగ నేర్చిన నంత త్వరితముగ అవి వెడలును. బాధారహిత స్థలమును కన్గొనిన వేళ బాధల ప్రయోజనమే యుండదు. ఆకలి లేనివాని కన్నమేల?

అహమును వదలి బ్రహ్మమున చేరుము. ఆయనలో లీనమగుము— ఆయననుండి ఏ పరిస్థితులలోను దూరము కాకుము. నిత్య మాయనలో నుండుచో బాధ కాస్కారమేది? అఖిల సంకటముల కిదియే అమోఘమగు ఔషధరాజము.

ఈ అహంకార విసర్జనము సర్వార్థసాధకము. దీనిని కాయమందలి అణు వణువున నింపినవాడు అమృతుడే. తనలో గర్భితమైయున్న మహాసత్యమును అణువణువున చేర్చగల్గుచో ఇక కావలసినదేమి?

దీని కప్రమత్తత వలయును. హృదయ దౌర్బల్యము ఏ కోశమున నుండరాదు. కష్టముల కదలరాదు. ధైర్యముతో ప్రశాంతుడై, భగవత్కృపపై సడలని విశ్వాసముంచి పోరాడిన జయము నిశ్చయము—దీని మాధుర్యము నొక సారి ఎరిగినవా డెంతటి విపత్తునైన ఎదుర్కొనుటకు జంకడు.

* * *

ఫిబ్రవరి 20, 1957

"ఈ దేహమునకుగల పరిమితు లొక మూస వంటివి. మనస్సు, జీవుడు వానిలో ప్రవేశించి వానిని తమ కనుకూలమగు రీతి పగులగొట్టి తిరుగ తయారు చేసుకొనవలెను. పరిమితులకు తమ అపరి మితముతో సమన్వయము సాధించు దనుక ఈ ప్రయత్నము జరగవలసినదే."

(తలుపులు, తళుకులు సంపుటి 16, పుట 386)

ప్రేమమయీ, మాతా, దేహమునకుగల పరి
మితు లొక మూసవంటివి"—అనుదాని భావమేమి?

నీకొక దేహమే లేకున్న ఒక నిర్దిష్టరూపమే లేకున్న, నీవొక పూర్ణవ్యక్తివి కాకున్న, నీకొక తెలివి, విశిష్టగుణములు లేకున్న, మీ రంద రొకరినుండి యొకరు వేర్పఱుపరాకయుందురు. దేహాంతరమున కేగిన ఏవో స్పందనములు కలగా పులగమయి మీరు గుర్తించుట కనువుగా నుండరు. దేహమే లేకయున్న అంతయు విచక్షణ కందని ముద్ద మిగులును, ఈ దేహ మీ వేర్పాటు ఘటించు టకే మూసగా వ్యవహరించును— (ఒక శిష్యునితో) మూస నీకు తెలిసినదే. దానిలో ఏదైన ద్రవము కాని, చిక్కని దేదికాని, మరుగుచున్నది పోతురు. అది చల్లారిన పిమ్మట మూసను విరుగగొట్టి ఆ రూపముగల వస్తువును తీసెదరు. మానవప్రాణశక్తులకు దేహము మూసవంటిదే. అది లేకున్న వ్యక్తి లేదు, విభిన్న శక్తు లంతకంటె భాసించవు.

క్రమముగా, మెల్లగా విద్యవలనను, జీవిత కదలికల వలనను నీకు ప్రత్యేక స్పందనము లేర్పడుచున్నవి. వ్యక్తి కొక మనస్సు బహుకాల విద్యాభ్యాస ఫలితము, లేకున్న నది ప్రవాహమై సర్వులగుండ ఒకరినుండి యొకరిలోనికి, గుంపునుండి గుంపులోనికి ప్రవహింపవలసినదే. ఆచారసరణి ఒక్కటేయయి వేర్పరుపరాకయుండును. నిన్ను నీవు పరిశీలించుకొనిన, నీ ప్రత్యేక తలంపు లతి తక్కువ. అధికము జనసామాన్యము తలపులే. వ్యక్తిగత తలంపు లపూర్వము-అవి ప్రత్యేక కృషిఫలితము. ఈ సామాన్య తలపులు వినుటవలనను, పఠనము వలనను, శిక్షణ వలనను నీకు లభించును.

బుద్ధిజీవులు, మననశీలురు, పరిశీలనాసక్తులు భావములను క్రమముగ వర్గీక రించుకొని వ్యక్తులుగ ప్రసిద్ధివహింతురు. వారే నాయకులు, మహాపురుషులు, సామాన్యు లెన్నో వైరుధ్యముల నెఱుగకయే తమలో కల్గియుండవచ్చును, అతి ఉన్నతాభిప్రాయములతో పాటు వానికి వ్యతిరేకభావములను కల్గియున్నవారి నన్ని రంగములలో నే నెఱుంగుదును— నిన్ను నీవు గమనించినచో నీ కనేక భావము

లున్నవనియు. అవి అంతర్గత భావనలతో సాదృశ్యముగ నుండుట ముఖ్యమనియు గ్రహింపగలవు.

వ్యక్తిత్వమునకు మనిషి తనకున్న గుణముల నొక కటాహమున పోసి వానిని మేళవింపవలెను. లేకున్న నవి నీళ్లవలె జారిపోవును. ఊరు పేరు లేకుండపోవును. నిమ్నశ్రేణి మనుష్యులు పేర్లను బట్టియే ఒకరినొకరు వేర్పాటుగా చూడగలరు. నామమే లేకున్న అది అసంభవమగును. నీ వెవరనిన, జవాబు: "వెంకయ్యను" కొంత ఆలస్యముగ, "కుమ్మరిని". ఒకశ్రేణిలో ఏకైక జవాబు నామమే.

పేరనగా— మాట. అవునా? దాని వెనుక నేమున్నది? ఏదియు లేదు. అది అస్పష్ట చిత్రము — ప్రతిబింబము కాదు. అందరకు నొకే పేరున్న చెప్పుట కేమున్నది? ఫలిత మూహింపదగినదే.

ముందొకనాడు 'ఆకాశయాన' మను గ్రంథమునుండి ఒక బానిస కథ చదివియుంటిని. ప్రశ్నింపబడినపుడు సర్వదా తన పేరును జతపరచి జవాబిచ్చువాడా బానిస. అది కొంత మెరుగే. ఇతర బానిసలకు 'బానిస' యని మాత్రమే వ్యవహారము. అది సామాన్యనామమగుట వృత్తిగా మారి, వ్యక్తిత్వము లేకుండ జేసినది.

స్వల్పమగు ఎఱుకతో మనిషి అలవాటు ప్రకారము జీవించును. తాను చేయునది గమనించడు. కారణమూహింపబోడు— చేయు విధాన మారయబోడు. ఒక కాలము ప్రజ, ఒక దేశప్రజ ఆ కాలపు, ఆ దేశపు టలవాట్లను ప్రశ్నింపకయే గ్రహింతురు. భౌతికాచారములే కాక, ఆలోచనా సరిణికూడ యథాతథముగ చేకొందురు. వారి నెవరైన ప్రశ్నించిన విస్తుపోదురు. లేక మా సంప్రదాయమని గర్వింతురు.

నీ ప్రాణము మనసే అలవాట్లు. వానిని శంకింపబోడు. ఇతరమ నెప్పటితో అనాలోచితముగ చేయుచుండును. అలవాటు ప్రాబల్యమున ఆ వేనిని పరీక్షింపడు. అట్లు పరీక్షించినవాడు ద్రోహిగా, దుష్టుడుగా ఎంచబడున

వ్యక్తిత్వము సర్వసామాన్యము కానేకాదు. రూపభేదమే లేకుండి: మనల నందరను వేర్పరుపరాక యుండెడివారే

శ్రీ అరవింద అన్నట్లు, వ్యక్తిత్వ మొక విజయము. ఈ విజయము మన ప్రయాణమున మొదటి మజిలీ. వ్యక్తిత్వముగలవానిగ నిన్నునీవు చేసికొనుట మొదటిపని. అనంతర కర్తవ్య మా రూపనాశనమొనర్చి ముందుకు సాగిపోవు టయే. మానసికముగ ఏర్పడియున్న మనోరూపముల నన్నిటిని హరింపుము. అప్పుడే సర్వసిద్ధాంతములకు చోటు దొరకును. వ్యక్తుడ వగుట కెంతో శ్రమ పడవలెను. తర్వాత నీ ప్రాతిపదికల కాల్చివేయుము. చదువుట, పనిచేయుట, మొదలగునవి నీ ప్రమేయము లేకుండనే జరిగిపోవుచుండును.

బాహ్యరూపముల ఘర్షణచే నీలో వ్యక్తిత్వము జాగరిత మగును. ఇతరుల కంటె భిన్నుడవని తెలిసికొందువు. లేకున్న భిన్నత్వము నామమాత్రమే.

ఇతరులందరివలె నీవును నిద్రాదుల చేతువు. వారికి భిన్నముగా చేయనేమని ప్రశ్నించుకొనెదవా? నిన్నీ ప్రశ్న యడిగిన జబాబు తోచదు. నీ పరిస్థితుల ప్రభావమున నీ పద్ధతు లేర్పడినవి. వేరొక కాలమున, వేరు పరిస్థితులలో పుట్టియుండిన నీ అలవాట్లు భిన్నముగా నుండెడివి, నీ కది సహజముగ తోచును. ఉదాహరణకు : పాశ్చాత్యదేశములలో, కొన్ని ప్రాచ్యదేశములలో కూడ, కుట్టుపని కుడినుండి ఎడమకు. జపానులో వ్యతిరేకము. నీవు నేర్చుకొనిన విధమున నీవు కుట్టెదవు. అది నీకు సహజమయినది, జపానులో నీ విధానము సాగించిన, వారికి నవ్వుకలుగును— వింతగా తోచును. వ్రాయుటలో కూడ నీ వైరుధ్య మున్నది. నే ననుట విద్యార్థులనుగూర్చి కాదు. వారు వైపరీత్యకారణము లరసినవారు— సామాన్యులనుగూర్చి నేను చెప్పుచున్నాను. ముఖ్యముగా పిల్లలనుగూర్చి. పిల్లలు తాము చూచినదిచూచినట్లు చేసెదరు, విశ్వాసముతో, నిశ్చింతగా

చేసెదరు. ఒకవేళ తమకు భిన్నఆచారము గలవారిని కలసినచో అది వారి కొక విస్మయకరమగు కనువిప్పు. ఒకే పనిని వేర్వేరు విధముల చేయవచ్చునా ? అనునది వారి భయహేతువు.

ఇవి అందరకు తోచునవే. నీ కాలదేశములు నీచే నిట్లు చేయించునన్నదే సత్యము. నీ కిది తెలియనే తెలియదు.

ప్రాథమికముగ మూలమొక్కటే, కాదూ ? సృష్టి పృథక్కరణము పొందవలసెను. దీనికై ఎంతో శ్రమ అవసరమయ్యెను. అట్లే తన అసంఖ్యాకత్వమది ఎఱుంగగలదు.

సృష్టి తన శాశ్వతమైన యునికిపట్టును చేరుటకు సాధన మొఱింగిన, ఆ పృథక్కరణ మయ్యెడిదికాదు. ప్రతిజీవి అంతరమునను తన ఏకత్వభావన యుండెడిది. వైవిధ్యమే యుండెడిద కాదు. ఆ ఏకత్వస్ఫురణ కోల్పోవుటచేతనే భేదభావముల కదనేర్పడెను. అజ్ఞానమున పడిన తాను ఆవలనున్న ఎఱుకలేని ఏకత్వములోనికి చొరవతో పోవలసిన ప్రయాస యుండెడిదికాదు.

రెండు చివరలను వైవిధ్యము లేదు. ద్వంద్వము లేదు. ఒకచోట పూర్ణమగు ఎఱుక; మఱొకచోట పూర్ణమగు విస్మృతి.

రూపస్థిరీకరణము వ్యక్తిత్వము రూపొందించుట కొరకే. అంతే—అంతే.

* * *

మార్చి 6. 1957

కండ్లు చదువుట కష్టోధముగ నున్నవి. అయినను మీకు నేను గత వారము చదివినదానిపై ఒక ప్రశ్న వేయబడెను, ఇప్పుడు దానికి జబాబిచ్చెదను. పవిత్రా, చదివెదవా?

(పవిత్ర చదువును) ఈ పరిచ్ఛేదమునకు అర్థమేమి?
"తన అఖండకేవలత్వమున జీవిధర్మము స్వేచ్ఛ;
ఆతడే ప్రకృతి అజ్ఞాతనేత— ప్రేమ ధర్మము సేవ:
పృథక్కరణమున గల ఇతర జీవుల సేవించుటకై
తనకుతానై ఆత్మార్పణ మొనరించుకొనుట."

(తలపులు, తళుకులు సంపుటి 16, పుట 386)

పైకి ఈ రెండును పరస్పర విరుద్ధములుగ కాన్పించును. స్వతంత్రుడు, దాసుడు ఒకే సమయమున నుండుట ఊహింపరానిది. కాని ఈ రెంటిని సమన్వయ మొనర్చుటకు వీలున్నది.

స్వేచ్ఛ, మనిషి అభివృద్ధికి అవసరమగు ప్రధానమైన అక్కఱ. అత్యుత్తమమగు చైతన్యము దాని సారము. అది బ్రహ్మముతో ఏకత్వద్యోతకము. అది మూలమును చేరు భావన. ఈ ఏకత్వము బహుళత్వమున ద్యోతకమయ్యెను. కావున ఈ రెంటిని కల్పు గొలుసు కావలసివచ్చెను. అత్యుత్తమమగు గొలుసు ప్రేమ, ప్రేమ మొదటి చిహ్నము ఆత్మార్పణము, సేవ. దాని గతి ధారాళమును, పరిపూర్ణమును, ఆనందదాయినియు నగు ఆత్మబలి.

కావున, సేవాస్వాతంత్ర్యములు పరస్పర విరుద్ధములు కాకుంటయే కాక పరస్పర సంపూరకములు. పరమ సత్యముతో సమగ్రమగు ఏకీభావములోనే స్వేచ్ఛపొందెదవు, తెలివి లేమియు, ఎఱుక లేకుంటయు బంధనములై నిన్నస మర్థుని జేసి పరిమితు నొనర్చును. అజ్ఞానమే మనిషిని పరిమితునిగా నొనర్చును,

స్వేచ్ఛను హరించును. పరమసత్యమున కలియుటలోనే, పూర్తిస్వేచ్ఛ కాస్కారమున్నది. ఈ ఏకత్వసాధనకు ప్రేమార్పణలే సాధనములు. సేవాసక్తునకే ప్రేమ గ్రాహ్యము కాగలదు.

ఈ రెండును సత్యమున లీనమగును. ఈ అవిద్యా ప్రపంచమున కీ రెండును (సేవ, ప్రేమ) ఎంతేని అవసరము. బ్రతుకుట కెంతేని అక్కఱ కలవి. దురదృష్టవశమున నీ రెంటను జుగుప్సాకరమును హేయమును నయిన ఈ అజ్ఞాన మూఢప్రపంచమున, స్వేచ్ఛయొక్క అక్కఱకూడ దీనిచే కుంఠితమయినది. స్వాతంత్ర్యము తృష్ణపై తిరుగుబాట్లకు దారితీసినది. ఇది నిజమగు స్వేచ్ఛకు గొడ్డలిపెట్టు. స్వేచ్ఛ! నా కొకటి జ్ఞప్తికి వచ్చుచున్నది. ''నాకు స్వతంత్రము కావలెను, స్వతంత్రుడ నగుదును, అప్పుడే జీవించినట్లు'' అని ఒక డనెను. దీనికొక రహస్యజ్ఞానవేత్త ఇట్లు జబాబిచ్చెను:

"ని న్నెవరును ప్రేమించరన్నమాట; ఎవరైన ప్రేమించిన, నీ వా ప్రేమపై ఆధారపడి యుండవలెను,''

ఇది చక్కని జబాబు, ఏకత్వప్రాప్తికి ప్రేమయే సాధనము. ఏకత్వమే ప్రేమకు చిహ్నము. స్వేచ్ఛపేరిట ఏ తగులములును లేక యుండగోరువారు ఈ వాస్తవిక ప్రేమకు విముఖులు, వారు ప్రేమను కాదనుటయే దానికి హేతువు. నిర్బంధమున వికలత ప్రాపించును.

నిర్బంధమున ప్రేమింపలేవు. నిన్ను ఎవ్వరును ప్రేమింప నిర్బంధింప జాలరు. అట్టి ప్రేమ ప్రేమయే కాదు, నిర్బంధము కల్పించుకొనినచోట నది అసత్యమగును. ఆత్మార్పణమువలన, పరమసత్యముదెస మఱలుటవలన (మన పుట్టినచోటు, గమ్యము) ధారాళమగు గతిచే అంతర్గతావగాహన వలన లభించు సమత్వమూలముననే ప్రేమ నీలో ప్రభవింపగలదు.

* * *

మార్చి 8, 1957

[ఇది ఒక శుక్రవార సమావేశమున మాత చెప్పిన కథ, సాధారణముగ శిష్యులకు ఆ రోజున మాత పాఠములు చెప్పును.]

## బౌద్ధ కథ

నా కనుదెబ్బనను చదువనిచ్చుటలేదు. మీ కొక కథ చెప్పెదను, అదీ బౌద్ధ కథ; కాని ఆధునికము, ప్రామాణికముగూడ; శ్రీమతి 'జడ్' ఇది నాకు వినిపించినది, లాసా ప్రవేశించిన ప్రప్రథమ మహిళ ఆమె; పాశ్చాత్య మహిళ, ప్రసిద్ధ బౌద్ధమహిళ. ఆమె టిబెట్ ప్రయాణ మనేక దుర్భర కష్టములతో కూడినది, ఉత్తేజకరము. ఆమె తన ప్రయాణమున జరిగిన ఒక సంఘటనగూర్చి నాకు చెప్పెను. నే నది మీకు వినిపించుచున్నాను,

ఆమె యొక బిడారుతో పయనించుచుండెను, ఇన్డూచైనా (Indo-China) నుండి టిబెట్‌కు మార్గము సుకరమగుట, వా రా వైపునుండి పోవుచుండిరి, ఇన్డూచైనా కీకారణ్యములతో నిండినది,-అందు పులులు మెండు, వాటిలో కొన్ని మనుష్యాశనులు,

ఒకనాటి సంధ్యాకాలమున, చీకట్లలముకొనుచున్న వేళ వారొక కాననాంతరమున నుండిరి, సురక్షిత మజిలీ ఆ కాననము దాటిననే, శ్రీమతి 'జడ్' అది తన ధ్యాన సమయమని గుర్తించెను, క్రమము తప్పక నిర్దిష్టసమయమున నామె నిత్యము ధ్యానించుచుండెడిది. అంత ఆమె వారితో నిట్లనెను, "మీరు ముందుకు సాగిపొండు; నేనిట నాగి ధ్యానమొనరింపవలెను, అది ముగించుకొని మిమ్ముల త్వరలో కలసుకొందును, ఒక కూలివాడు; "అది అసంభవమమ్మా, పూర్తిగా అసంభవం"—ఆ కూలీ టిబెటన్‌లో మాట్లాడెను, శ్రీమతి టిబెటన్ భాష టిబెటన్‌ల వలెనే మాట్లాడగలదు, "ఇది అసంభవము— ఇచ్చట మానుష్యాశనుడున్నాడు (పులి), వానికి తిండి వేళయినది, ఏ క్షణముననైన రాగలడు,

పదండి. మీ రిట ఆగరాదు.'' అని అత డనగా, ఆమె దృఢముగ, ఇదంత గొప్ప విషయముకాదు. ఆత్మరక్షణకంటె ధ్యానమే నాకు ముఖ్యము.—మీ రంద రును నడచిపొండు. "నా కేమియు భయములేదు." అని జవాబిచ్చెను.

వారి కిష్టములేకున్నను, ఆమె తత్వమెఱిగినవారగుట ఆమె నట విడిచి పైమజిలీకి పయనము సాగించిరి. ఒక చెట్టుక్రింద నామె ఆసీనయయ్యెను; ధ్యానమగ్న యయ్యెను. ఇంతలో, ఆమె యొక వ్యాఘ్రదృశ్యానుభూతి పొందెను. కనులు విప్పెను. మూడు నాల్గడుగుల దూరమున ఎదురుగా మనుష్యాశనుడు; వాంఛాపూరితోజ్జ్వలములగు కను లామెపై కేంద్రీకరించియుండెను. ఆమె నిశ్చల మనస్సుతో తదేకదృష్టితో వాని నీక్షించుచు, "బాగుబాగు! ఈ విధమున నిర్వా ణము గనజాలిన ఎంతో అదృష్టము. ఈ కాయవిసర్జన కిపుడు తగురీతి సిద్ధము కావలెను,'' అనుకొని మరల కనులు మూసికొంచి సత్యభావమున నిశ్చలముగను స్థిరముగను మఱల సమాధిలో మునిగెను. అత్యంత గాఢసమాధి—దేహాత్మల శాశ్వతముగా విడదీయు నిర్వికల్పసమాధి- 5 నిమిషములు, 10 నిమిషములు, 30 నిమిషములు దొర్లిపోయెను— ఏమియు కాలేదు! ఇంతలో ధ్యానకాలము పూర్తి యయి, ఆమె కనులు తెఱచెను. పులి ఏది? దాని జాడ ఆ పరిసరముల లేనే లేదు. ఆ పవిత్రకాయము తనకు అందనిదని పులి భావించెనేమో! దుష్కరగుండు విడచి మఱి యే వన్యమృగమును మృతకాయము ముట్టవు. పులి ఆమె చచ్చిన దనుకొనెనేమో! ధ్యానమహిమ యన సాహసింపను. ధ్యానము పులిని మోహింప జేసెననియు అనజాలను. పులి వెడలెను—ఆమె ఏకాకి యయ్యెను - గండము తప్పెను. ప్రశాంత చిత్తముతో ఆమె అచ్చటనుండి లేచి త్వరలో బిడారును కలుసుకొనగానే "వచ్చాను"అని మృదువుగా పల్కెను.

ఇదీ కథ. ఆమె పద్ధతిలో మన మిపుడు ధ్యానింతము. నిర్వాణమునకై సిద్ధమగుటకు కాదుసుమీ (నవ్వు) మన ఎఱుకను పెంపొందించుకొనుటకు.

* * *

మార్చి 13, 1957

[నేడుకూడ పఠనము లేదు. నా రచనపై ఎవరో ఓ ప్రశ్న చేసిరి. పవిత్రా, నీ దగ్గరనున్నదానిని చదువు.]

(పవిత్ర చదువును) "మనలోని మంచిని ప్రేమించి, అదే సమయమున మన స్వభావమునకు విరుద్ధముగా నుండమని కోరనివాడు మన ఉత్తమ మిత్రుడు."

(శ్రీమాత ప్రవచనములు. 1966 కూర్పు. సంపుటి 3, పుట 66)

దీని భావ మేమిటన్నదే ప్రశ్న. మీ కెన్నియో అసంభవములుగ దోచు వానిని గూర్చి చెప్పవలెనను కుతూహలమున్నది. అయినను—దీని నేదో మన సున నుంచుకొని వ్రాసియుంటిని. ఆదేదో మఱచితిని. మనము మన మిత్రులను పరిసరములవారిని వారివారి ప్రవృత్తులను మార్చుకొనగోరుట సహజము. మన మొక ఆదర్శమును చేకొని, వారందరు దాని ననుసరించగోరెదము. ఈ సంద ర్భమున టాల్‌స్టాయి పుత్రుడు జ్ఞప్తికి వచ్చుచున్నాడు. మానవ జాతి ఏకత్వ సాధనకై ఆతడు ప్రపంచపర్యటన మొనర్చుచు జపాను చేరెను. అచట నే నాతని కలియుట తటస్థించెను. ఆతని ఉద్దేశ్యము మంచిదే; ఆచరణ పద్ధతిమాత్రము సంశయించితిని. అందరు ఒకే భాష మాట్లాడుచు, ఒకేరకము దుస్తులు ధరిం చుచు ఆహారవిహారములలోకూడ ఒకేవిధముగ వ్యవహరించిన ఐక్యత సిద్ధింపక తప్పదని ఆతని విశ్వాసము. దీని నెట్లు సానుకూలపరచెదవని అడుగగా, "నా యుద్దేశ్యముల ప్రచారముద్వారా" అని జవాబిచ్చెను.

(నవ్వుచు) ప్రతివానికి కొన్ని ఆదర్శములు, నమ్మికలు ఉండును. అవి సర్వోత్తమములుగా విశ్వసించి వానిని ఇతరులపై రుద్దజూచును. తమ నమ్మి కలు దేవుని వన్న దృఢబుద్ధితో బొందిలో ప్రాణమున్నంతవరకు వాని ప్రచారము సాగింతురు.

ఇటువంటి ఊహింపనివై ఖరే నా మనమున నుండెను. "అదీ నీవు చేయ దలచినది" అని మీలో ఎవరితోనైన నే నినచో అతడు గట్టిగా, "నా జన్మలో కాదు'' అనును. కాని, ప్రజల అభిప్రాయములు, వారి జీవితపద్ధతులు నీ అభి ప్రాయానుగుణ్యముగ నుండకున్న వారిని నిందింతువు, నీ సిద్ధాంతములకు వ్యతి రేకముగ నున్నందులకు, విశ్వమున నే రెండును ఒకే విధముగ నున్నవి లేవు. అట్లుండిన, ఒకటి నిరర్థకమగును. కోటానుకోట్ల విషయములు—భావమునను, రూపమునను, ఇతరవిధములను తుల్యము గాకయున్నవి. ఈ అసమత్వ భిన్నత్వ ములలో నొక సమశ్రుతి ఆలాపించుచున్నది. ఒకటి అట్లుగాక ఇట్లుండవలెనను అధికారము నీ కెవరిచ్చిరి ? నీ వొకరీతి యోచించిన, వేరొక డింకొకరీతి యోచించును— నీ వొకరీతి మనిషివయిన, వాడు దానికి వ్యతిరేకరీతి మనిషి కావచ్చును. విభిన్నములగువానిని సమన్వయ మొనరించి వానిలో ఏకత్వము చూచుట నేర్వవలెను, యుక్తస్థానముల సమన్వయముగనున్న నే సమహితత్వము నెలకొనుట,—అన్నియు ఒకటిగా మార్చుట మూలమునకాదు.

నిజమగు మిత్రునినుండి ఆశింపవలసిన దిదియే—నీ మిత్రుడు నిన్ను నీవలె నుండగోరును. తనవలె మారగోరడు.

''అతడు నీలోని మంచిని ప్రేమించు'' నంటిని. అనగా నీ మిత్రుడు నిన్ను నీ నీచస్వభావమునకు దిగజారమని కోరడు, ప్రోత్సహించడు. నీ దుష్టకార్య ములు మెచ్చుకొనడు, అయినను తఱచుగ ఒకనితో స్నేహము చేసినవేళ వాడు నీ చెడుగును మెచ్చుకొనును, నీవు వాని ఎదుట పాడుపనులు చేయుటకు సిగ్గి లవు, వాడే నీ ఉత్తమ మిత్రు డనుకొనెదవు. బడికి పోక చాంద్రాయణము పోవువారిని కూడెదవు, తోటలలో దొంగిలింపబోదువు, వారితో కలసి గురు వుల వెక్కిరింతువు. మిమ్మెవరినీ ఉద్దేశించి నేనీ మాటలనుటలేదు, నే నెన్నో దృష్టాంతముల నీయగలను, వీరందరు నీ నిజమిత్రులు కాబోరు, వారు నీ కనుకూలురే అయినను మిత్రులగుట కనర్హులు. ఎవడైన వచ్చి, "బడికిపోవుట మేలుకాదా ?" అనిన నీవు—''పో, పో, నన్ను వేధించకు, నీవు నా మిత్రుడవు కావు'' అందువు. ఇందుకే నే నీ వాక్యము వ్రాసితినేమో ! నే నెవరిని విష

ర్శించుటలేదు. ప్రాయికముగ జరుగుదానిగూర్చి చెప్పుట కిదొక అవకాశము మాత్రమే.

మన ఆశ్రమమున తెలివిగలవార మనుకొను పిల్లలున్నారు. తరగతిలో వారే అగ్రశ్రేణివారు. వారినుండి నేనెంతో ఆశించితిని. వారు చెడు మిత్రుల గూడి పాడయిరి. ఈ మాటలనుట నా కెంతో వ్యధ కల్గించుచున్నది. వా రికనైన అట్టివారు శత్రువులని ఎరుగుదురు గాక. అంటురోగులకువలె వారికి దూరముగా తొలగవలెను.

అంటురోగి సావాసము కోరకుంటయేకాక వానిని తప్పించుకొని తిరుగుదుము. వారి నేకాంత ప్రదేశముల నుంచెదము. రోగ విస్తరణ కాకుండ— చెడు ప్రవర్తన, అసత్యభాషణ, నీచపు పనులు, అంటురోగమును మించినవి. నీ ఉత్తమ మిత్రుడు నీ వ్యసనములలో పాల్గొనడని దృఢముగ చెప్పును. నిన్ను వానిలో దిగవలదని హెచ్చరించును. క్రమముగ నీలోని చెడుగును తన మాటలతో, వడవడితో నశింపజేసి నీలోని మంచిని పెంచును.

ఈ విషయ మింతటితో ఆపెదను— నా ఉద్దేశ్యము గ్రహించితి రనుకొందును. నీ మిత్రులను నీ వెన్నుకొనవలెను. నీకంటె విజ్ఞులు నిన్నుదారునిగ మార్చగలవారు, నీ ఆత్మ నిగ్రహము పెంచువారు, నీ అభివృద్ధి కోరువారు, నిన్ను మంచి ప్రవర్తన కుత్సహింప జేయువారు నీకు తగిన మిత్రులు.

ఇంతకూ, నీ ఉత్తమమిత్రుడు పురుషోత్తమునకు మించిన వా డున్నాడా? అతడే సకలము గ్రహించును; నీ గాయము లన్నియు మాన్పును. నీకు సర్వదా సాయముగనుండి, తూలిపోకుండ ఆదుకొని సక్రమమార్గమున నడిపించి సంశయముల ప్రోద్రోలి గమ్యము చేర్చును. సకలావస్థల నాయన మన సన్నిధినే యుండి మన బాగోగుల నరయును. మన సంకటముల నర్థము చేసికొని వానిని తీర్చగలడు. నీ వెట్టి పిచ్చిపనులు చేసినను, దుష్టకార్యము లొనర్చినను, నీవు పిలిచీ పిలవగనే నిన్ను ఆదుకొనుటకై మరుక్షణమున సన్నిధిచేయువాడు

ఆయనయే, ఆయననే నీ పరమ మిత్రునిగ చేకొనుము — నీ కింక ఏ అందోళనయు నుండదు.

* * *

మార్చి 15, 1957

[ఈ ప్రసంగ మొక శుక్రవారము నాటిది. ఆనాడు మాత సామాన్యముగా పిల్లలకు చదువును.]

## ట్లెంసెన్ స్మృతులు

ఈ సాయంత్రము కూడ పఠనము లేదు — కధ చెప్పను — శ్రీమతి ఎక్స్ (X) చరిత్ర వినిపింతును.

శ్రీమతి ఎక్స్ వైట్ ద్వీపమున జన్మించెను. రహస్యజ్ఞాన దక్షుడగు భర్తతో ట్లెంసెన్ పురిని నివసించుచుండెను. ఆమె కూడ ఆ శాస్త్రమున దిట్టయే; అతీంద్రియ దర్శన; అంతేకాక, పరలోకవాసుల మాటల గ్రహించి తెల్పగల మహత్తర శక్తి కలది. ఆమె సమగ్రము, కఠినము నగు శిక్షణ పొందినది. పరకాయప్రవేశ మామెకు వెన్నతో నేర్చిన విద్య. సూక్ష్మ శరీరమును తన్మయతలో ముంచి, వరుసగా పండ్రెండు పర్యాయములు కాయమునుండి కాయమునకు (మానవకాయమే కాదు) మారగలది. ఈ సంగతి మరొకసారి వినిపింతును. ఇప్పు డది మీకు బోధపడదు. నే నామెతో కలిసియుండిన రోజులలో జరిగిన కొన్ని సంఘటనల నిప్పుడు వివరింతును.

నే చెప్పునవి అత్యంత ఉల్లాసకరములు—— ఆమె ఎక్కువ కాలము తన్మయతలో నుండెడిది. ఎంతయో నైపుణ్యము కలదగుట కొంత బాహ్యస్మృతి లేకయున్నను, ఇటునటు తిరుగుట, చిన్నచిన్న పనులుచేయుట కామె చాలియుండెను. ఆ సమయమున నిరాతంకముగ సంభాషింప గలదు. తన దివ్య చక్షుస్సుల చూచినది వర్ణింపగలదు. అది వ్రాయబడి తదుపరి బోధింపబడెడిది. ఆమె కీ కార్యములు నిస్త్రాణ కల్గించుటవలన బలము పుంజుకొనుట అవసరమయ్యెడిది.

ఒకనా డామె ఎక్కువ అలసియుండెను. నాతో ఇట్లనెను: "నా సత్వము తిరిగి పొందెదను—— ఆ విధ మెట్టిదో చూడుము-" కొండ సానువున నగమెత్తువరకు వ్యాపించిన పెద్దతోట వారిది. అందులో అనేక రకముల ఫలవృక్షములు (ఆపిల్, అత్తి, నారింజ, నిమ్మ.... వందలలో.... ఇక ద్రాక్ష....) కలవు. ద్రాక్ష ప్రసూన సుగంధము నారింజపూవుల పరిమళమును మించెను. అవి పెద్ద పూవులు, వానినుండి పరిమళద్రవ్యముల చేయగలరు. నాకొక సీసా ఇచ్చినది కూడ. సరే, ఆమె యొక పెద్ద పండినద్రాక్షపండు కోసి, పాన్పున వెల్లకిల పరుండి, దానిని అనాహత చక్రమున నుంచి రెండు చేతులు దానిపై నుంచెను. ఆమె విశ్రమించినది—— నిదురింపలేదు. నన్ను పోయి గంట తర్వాత తిరిగి తన వద్దకు రమ్మనెను. నే నట్లే చేసితిని. ద్రాక్షపండు అట్టువలె చదునయినది. ఆమె పండులోని జీవమును తనలోనికి తీసికొన్నది—— పండు కృశించెను. స్వయముగా చూచితిని. మీరది చేయలేరు (నవ్వు) ఎంత ప్రయత్నించినను.

మఱొకసారి: ఇది మరింత అద్భుతము. మొదటగా, మీకు ట్లెంసెన్ గూర్చి కొంత విస్తరింతును. బహూశః మీరది వినియుండరు. దక్షిణ అల్జేరియాలో సహారా ఎడారి పరిహద్దులలో గల చిన్న పట్టణము ట్లెంసెన్. చుట్టును పర్వతములుగల లోయలో నున్నది. సారవంతమగు ప్రదేశము. ఎక్కువ ప్రజ అరబ్బులు, ధనికులగు వర్తకులు, దినదినాభివృద్ధి గాంచుచున్న పట్టణమది. ఇప్పు డెట్లున్నదో: ధనాఢ్యులగు వర్తకు లప్పుడప్పుడు (X) ఎక్స్ దంపతులను చూచుటకై వచ్చుచుండిరి. వారి కేమియు తెలిసెడిది కాదు. అయినను అభిలాషకు లోటులేదు.

ఒకనాటి సాయంత్ర మొక వర్తకుడు వారిని చూడవచ్చి ఏవో చెత్త ప్రశ్నలడుగ జొచ్చెను. శ్రీమతి X నాతో నన్నది :- "మన మీతని సాయమున కొంత వినోదింతము" అని. వసారాలో పెద్ద మేజాబల్ల (భోజనమున కుపయోగించునది) ఉండెను. ఎనిమిది కాళ్లు — చాల బరువు. చెరిపైపున నాల్గేసి చొప్పున దాని కనతిదూరమున అతిథుల కొఱకు కొన్ని కుర్చీలున్నవి. ఆతడొక చివర, శ్రీమతి ఇంకొక చివర నుండిరి. నేనును, ఆమె భర్తయు ఓ ప్రక్క,— నల్వురమే. ఇంకెవ్వరును లేరు. "మనిషి కెట్టిశక్తు లుండగలవు ? గారడి ద్వార ఏమి చేయగలము ?" ఈ మాదిరి ప్రశ్న లడుగుచుండెను. ఆమె నాపై పూరక చూచెను. నిశ్చలముగ నుండెను. అంతలో పెద్ద కేక— భయమును సూచించునది ! మేజా కదలి ఆతని మీదికి పోవుచున్నది ! మేజా నెవ్వరును తాకనే లేదు. శ్రీమతి మేజాపై తన దృష్టి కేంద్రీకరించెను. అంత మేజా మొదట ఇటుఅటు ఊగి మెల్లగా ముందుకు సాగెను. అతనిపైకి ఒక్కదూకు— ఆత డదే పరుగు— మఱెప్పు డాయింటికి రాలేదు.

ఆమెకు ఎదుటగల వస్తువులను మాయము చేసి మఱల రప్పించు శక్తి కూడ కలదు— స్వోత్కర్ష అవంతయు లేదు. చెప్పకుండ చేసెడిది. వీని కంత ప్రాముఖ్య మిచ్చెడిది కాదు. అలౌకిక శక్తులు వీనిని మించిన వున్న వని ఆమెకు తెలియును.

సాయంసమయముల కొండలపైకి, లేదా పట్టణ పరిసరముల కామెతో కలసి వాహ్యాళి కేగుచుంటిని. నేను లేనప్పు డెల్లవేళల నా గదికి తాళము వేయుదానను. అది నా అలవాటు. ఆమె సాధారణముగ ఇంటనుండి నన్నే పోయిరమ్మనును. ఆమె ఎక్కువకాలము తన్మయతలో నుంటయే దీని హేతువు. నే నొక్కరితను పోయి తిరిగివచ్చి నా తలుపు తీయుసరికి నా దిండుపై ఎల్లపుడు ఓ చిన్న పూలదండ యుండెడిది. ఆ తోటలోని పూలతో కట్టినది. ఫెరూవింతలను పేరుగల ఆ పూలు సాయంత్రము వికసించును. వాని సువాసన మనోహరము. ఒకే తుప్పపై వివిధరంగులలో పూయునవి. పసుపు, ఎఱుపు, మిశ్రము, కెంపురంగులు. మన తోటలలోకూడ నున్నవి. ఆమె వాని నెల్లపుడు తన చెవులలో ధరించెడిది. ఎంతో మధురమైనవి, ఆహ్లాదకరములు! ఎన్నో

గుబురుగా పెరిగిన తుప్పలు— వాని మధ్యగా పోవుచు ఆమె వీని నేరెడిది. నా గదిలోని కెట్లు వచ్చెడివో ఆమెను నే నెన్న డడుగలేదు; ఆమె చెప్పలేదు. ఒకసారి ఆమె, "నీ గదిలో పూలులేవా?" అనెను. "ఉన్నవి"— అంటిని. నా కామెయే ఆ పూల నంచెనన్న నమ్మిక బలపడెను.

ఆమెను గూర్చి ఎన్నో చెప్పగలను. అయిన నామె చెప్పినది, నేను చూడనిది ఒక సంఘటన చెప్పి నేటి ప్రసంగము ముగించెదను. ఆ పట్టణము సహారాఎడారి దాపున నున్నదని చెప్పియుంటిని— వాతావరణము సహారా వాతావరణమే. ఆ లోయలో నొక జీవనది ప్రవహించుచు ఆ ప్రాంతమున కొంత పచ్చదనము విచ్చుచున్నది— చుట్టునున్నవి బోడికొండలు. వ్యవసాయమున్నచోట కొంత పచ్చన. శ్రీమతి తోట (ఉద్యానవనము) అద్భుతము. అచట మన ఊహకందిన సకలము మొలుచుచున్నది. ఆమె ఇట్లు చెప్పెను: "పది సంవత్సరముల క్రితమా పట్టణాధ్యక్షుడు కొండలపై చెట్లునాట కాజ్ఞాపించెను. లేకున్న ఆ నది ఎండిపోవు భయముండెను. 'పైను' చెట్లనె నాతడు — దైవయోగమున 'పైను' బదులు సర్వేమొక్కలు తెప్పించబడెను. ఇవి ఎడారి ప్రాంతముల ఎదుగుట చూడలేదు- ఉత్తర భూముల తప్ప. శ్రీమతి ఇది గమనించెను. అయిదేండ్లలో నవి నిలద్రొక్కుకొనుటయే కాక ఎత్తుగా ఎదిగెను. నేనట నున్నపుడు వానిని చూచితిని. సర్వేలు 'క్రిస్‌మస్' చెట్లని మీకు తెలియును కదా.

ఒకనాడామె రాత్రి దీపమార్పి నిద్రించుచుండ ఏదో అలికిడికి లేచి చూడగా ఒక చంద్రకిరణ మొక మూలను వెలిగించుట చూచెనట. అది అమావాస్యరాత్రి. ఓ పొట్టి భూతపిశాచి (gnome) నట చూచెనట. గంధర్వకథలలో వచ్చునవి. మరుగుజ్జు, పెద్దతల, శంక్వాకారపు టోపీ, పొడుగాటి గడ్డము, మంచుతో కప్పబడి— కొనలుదేరిన పెద్ద చెవులు:

తా నాతని వైపు చూచెను—"ఏమి చేయుచుంటి విచట?" ఆమెకు కొంత ఆందోళన కల్గెను. మంచు కరిగి తన వెచ్చని గదిలో చిన్న మడుగేర్పడుచున్నది- "ఏం? చెప్పవేం?"

అత డెంతో సున్నితముగ నవ్వి, "సర్వేలు మమ్ము పిలిచినవి. అవి మంచుదేశముల చెట్లు— అవి మమ్ము ఆహ్వానించినవి. నేను మంచురాజును-మేమిటకు వస్తిమని చెప్పుటకు వచ్చితిని మీ పిలుపంగీకరించి.

ఆమె — "మంచా? మేము సహారా ప్రక్క నున్నామే?"

అతడు— "అయితే మీరు సర్వేచెట్లు నాటక యుండవలసినది."

ఆమె — "నీ మాట లెంత నిజమో నాకు తెలియదు— అయితే నా గది నేల పాడుచేయుచుంటివి? పో పో.

అతడు నిష్క్రమించెను చంద్రకాంతితో సహా మీట నొక్కిన విద్యుత్తు వెలుగలేదు. దీపము వెలిగించి, చూడగా మడుగున్నది. అది కలకాదు. మర్నాటి ఉదయమున చోద్యము. కొండ శిఖరములు హిమాచ్ఛాదితములు. మసకమసకగా బాలభానుడు. ఇది మొట్టమొదటిసారి— ఇంతకు మున్నెన్నడును లేనిది,

అప్పటినుండియు ప్రతి శీతున కొండ లన్నియును మంచుతో కొంత కాలము కప్పబడియుండును. ఇదీ నా కథ—

* * *

మార్చి 20, 1957

"సంఘర్షణ, సంకటము జయోల్లాసము కంటె ఎక్కువ ఆకర్షణీయముగ నొకప్పుడు కాన్పించును. కాని జయశీలి యగు జీవుడెల్లప్పుడును విజయమునే కాంక్షించవలెను, ఓటమిని కాదు.

"నిరాశా జీవులు భగవానుని వైఫల్యములు. కాని ప్రకృతి కిది ప్రియమగుటను వారి సంఖ్య పెంచ జూచును. ఆ విధముగ తన స్థిరత్వమును అధికార మును పొడిగించుకొన గోరును.

"దీనులు, అజ్ఞానులు, హీనజన్ములు, సామాన్య మంద కాదు. తమ అల్పత్వము తోడను, ఆ పాటి మానవత్వము తోడను తృప్తి పొందువారే మంద వంటి వారు.

"సాయము చేయవలసినదే కాని వారి సహజ శక్తుల నాశము చేయరాదు. వారి ఉద్యోగోత్సాహ ములు సడలకుండ, వ్యక్తిత్వము గోలోపకుండ జాగ్రత్త వహింపుము.

"ఇతరులను చేరదీయుము — స్వభావసిద్ధమగు దివ్యత్వమును వారికిమ్ము — ఇట్లు చేయగలవాడే గురువు, నేత—

"భగవానుడు ప్రపంచము నొక రణరంగ మొన ర్చెను, యోధుల పాదఘట్టనా శబ్దములతో నింపెను, తుముల యుద్ధ గర్జనలతో నింపెను. ఆయన నిర్ణ యించిన మూల్య మీయక శాంతిని కొనజాలవు.

"పైకి జయముగా తోచుదానిని నమ్మకుము. కాని, నీవు గెలిచి, ఇంకను చేయవలసిన దెంతో కలదని తెలిసిన వేళ నంతసింపుము. ముందుకు సాగిపొమ్ము. నిజమగు విజయము అధిక శ్రమ మూలముననే సాధ్యము.

"జయాంశమును పూర్ణజయ మనుకొనుట కంటె అధికమగు భ్రమ లేదు—మార్గమున ఒక మజిలీలో ఎక్కువ జాగు చేయుటయు అట్టిదే.

(తలపులు, తళుకులు- సంపుటి 16, పుట 391, 92)

ఇచట శ్రీఅరవిందులు కోరున దొక్కటే. మానవ స్వభావము మార్పుకు వ్యతిరేకి— అలసత్వము, అల్పసంతుష్టి, ఉదాసీనత వీని స్వభావగుణములు. వీనిని ఎదుర్కొనుమని వారి సలహా. శాంతి ప్రియుల మనుకొనువారు చాల మంది పిరికిపందలనుట నిర్వివాదము.

కొంత ప్రయత్నించి దాన వచ్చు స్వల్పలాభముతో సంతృప్తి చెంది మధ్యలో విరమించు వా రెందరో.

సామాన్య జీవితమున నిది పరిపాటియే. ఇది ముఖ్యముగ బూర్జువా ఆదర్శము. అదియే నేటి ప్రపంచ మానవాళి దుఃస్థితికి కారణము. "యౌవన

మున పరిశ్రమించుము. ధనము, యశము సంపాదించుము. ముందు చూపుతో కొంత వెనుకవేయుము. ఉద్యోగివి కమ్ము, నలుపది వత్సరముల ప్రాయమున విశ్రాంతి కొనగలవు. పింఛను అనుభవింప గలవు. సంపాదించిననే ఇది సాధ్యము.'' కూర్చుంచుట, మధ్యలో ఆగుట, ముందుకు సాగకుంట అకాల మృతి తుల్యము. జీవితోద్దేశ్యమునే విడచుట— ఈ కూర్చుంట.

ముందుకేగవి మరుక్షణమున నీవు వెనుకకు పోవుట నారంభింతువు. ఏ క్షణమున ఆకాంక్ష ఆగునో అ క్షణమున నీవు మరణింతువు. జీవన మొక ప్రయాణము, ముందుకుసాగు ప్రయత్నము, పర్వతారోహణము. అయ్యది క్రొత్త విశేషముల నారయుటకు, భావిసాక్షాత్కారములకు, విశ్రాంతికి కాదు. పనిలో, ముందుకు సాగిపోవుటలో విశ్రాంతి గొనుము. దేవుని కృపలో దృఢవిశ్వాసమే నిజమగు విశ్రాంతి. వాంఛారాహిత్యము విశ్రాంతి— అహంకార విసర్జనము విశ్రాంతి.

ఎఱుకను విశ్వవ్యాప్తముగ పెంచుకొనిన వేళ నీకు విశ్రాంతి లభించును. ప్రపంచమే నీ వగుచో నీ కెల్లపుడును విశ్రాంతియే. కర్మమధ్య, యుద్ధము మధ్య, సకలప్రయత్నోత్సాహములో, నీవు శాశ్వతమును, క్షతి నెఱుగనిదియు నగు విశ్రాంతిలో నుండగలవు.

* * *

మార్చి 22, 1957

[ఈ కథ ఒక శుక్రవారమునాటి పాఠమున శ్రీమాత చెప్పెను.]

మీకు గుణపాఠము కాగల కథ చెప్పెదను. అది పూర్వగాథ. అచ్చు యంత్రములు, గ్రంథములు లేని కాలమది. ఆ కాలమున కొందరికే చదువుండెను. గురువు తన దృష్టిలో అర్హుడయినవానికే దక్క ఇతరులకు బోధించువాడు కాడు. ఆతడు నిరంకుశుడు. రాజాధిరాజు లాతని పాదాక్రాంతులు. 'అర్హు' డన, నేర్చినది ఆచరణలో పెట్టువాడని గురువు భావన. మొదట కొంచెము చెప్పి అది ఆచరించిన పిదప నింకొకటి చెప్పును.

ఈ కాలమున సర్వము దానికి వ్యతిరేకము— ఎవనికైన పుస్తకములు లభించుచున్నవి. వానిని సొంతముగ చదువనగును— ఆచరింపనీ, ఆచరింపక పోనీ. అది ఛాత్రుని ఇష్టము. ఇది మంచిదే యయినను కొన్ని చిక్కులకు దారి తీయుచున్నది. చాల పుస్తకములు చదివి తమకిక చదవనక్కరలేదనియు, తాము కొన్ని అద్భుతములు చేయగల్గియుండవలెననియు కొందరు భావింతురు. ఆచరణ మాట తలంపరు. "ఎన్ని చదివినా పూర్వమువలెనే యున్నాను, ఆత్మదర్శన మేది?" అని విసుగుకొందురు.

వా రొకటి విస్మరించుచున్నారు. వారు నేర్చినది మానసికము, వారి ఎఱుకకును, భావములకును చుక్కెదురు. ప్రసంగము లాచరింపనిపుడు నిరర్థకములు. గుజ్జులేని వెలగకాయలు.

అనుకొనునది మేఘాలపై రాపలెనను ప్రవృత్తి గలవారికీ కథ. ఒక పుస్తకమైన లేక, చదువుట సాధ్యమగు కాలమున పనులు జరిగినరీతి మీ కిప్పు డెఱింగింతును. గురువు తనకు వచ్చినది తా నెన్నికచేసిన వానికే చెప్పెడివాడు.

ఇదీ కథ (చదువును) :

# ప్రథమ బోధ

## (మూలము గుజరాతీ)

మహావిద్వాంసుడును, సన్యాసియు నగు నొక మహాత్ముడుండెను. ఆతడు వయోవృద్ధుడే గాక జ్ఞానవృద్ధుడును- సర్వులు నాతని పూజించువారు. ఆతని పేరు జూనన్. పెక్కు బాలురు, యువకులు ఆతని ఛాత్రులుగ నుండిరి. ఆశ్రమముననే యుండి కొన్నేండ్లకు విద్వాంసులై తమ దేశముల కేగుచుండిరి.

ఒకనా డొక యువకు డాతని విద్యకై ఆశ్రయించెను, వాని పేరు యూసఫ్ హుస్సేన్. ఆతడెవడో తెలుసుకొనకయే వానిని తన యాశ్రమమున చేర్చుకొనెను. నాల్గువత్సరములు దొర్లిపోయెను. అంత ఒకనాడతడు మొదటి సారిగా యూసఫ్‌ను రప్పించి, "నీ విట కెందుకు వస్తివి?" అని అడిగెను.

జవాబు: "మతబోధకై."

జూనన్ ఒక నౌకరును పిలిచి "నే నడిగిన పెట్టె సిద్ధమైనదా?" అనెను. వాడు, "స్వామీ, అయినది."

"తొందరగా తెమ్ము"-

అతి జాగ్రత్తగా తెచ్చి వాడద్దానిని గురువు నెదుట నుంచెను. దానిని యూసఫ్ కిచ్చుచు, "వత్సా, నీలానది యొడ్డున నా మిత్రు డొకడున్నాడు- దీనిని భద్రముగా గొనిపోయి నా కానుకగా ఆతని కిమ్ము. నీవు తిరిగి వచ్చినంత నీకు బోధింతును." అట చేరుటకు చాలిన గుర్తులు తెల్పి, చివరగా తన హెచ్చరికను రెట్టించెను. యూసఫ్ ఆతని పాదముల వ్రాలి నమస్కరించి నీదొకాని పెట్టెతో పయనమయ్యెను.

మహాత్ముని మిత్రుడుండు స్థలము చాల దూరము. వాహనాదులు లేకుంట కాలినడకనే పోవలసియుండెను. ఉదయమంతయు నడచి మధ్యాహ్నమగుడు ఎండకు తాళలేక యూసఫ్ ఒక చెట్టునీడ చేరెను. "పెట్టె చిన్నది. బీగము లేదు. ఇంతకుముందది చూడలే దాతడు— ఇప్పుడు తీరికగ యోచింప దొడగెను. కనులా పెట్టెపై పడెను. ఎంత తేలిక ? తాళము లేదు. లోన నేముండును ? ఖాళీ పెట్టెయేమో ! ఎంత తేలికగా నున్నదో ! అయిన తన కెందుకా విషయము. మిత్రుని కిమ్మనెను. అట్లే చేసెదను."

ఆలోచన కట్టిపెట్టి కొంతకాల ముండెను. కాని మనస్సాతని వేధించుట మానలేదు. "అందమైన పెట్టె.... ఏమియు లోననున్నట్లు లేదు- తాళమా లేదు. తెఱచి చూచిన ప్రమాదమేమి ? ఒక్కసారి, ఒక్కసారిగా తెఱచి వెంటనే మూసెదను".

పెట్టె నలువైపుల తిప్పిచూచెను. వెనుకాడెను- నిగ్రహించుకొన జూచెను. కాని మనస్సు అధీనము తప్పెను. "ఓ సెకను చూచి మూతును- తప్పు కాబోదు." చిట్టచివరకు మూత మెల్లగా తెఱచెను. అంతలో ఓ చుంచు పైకి వచ్చి క్షణములో నెటో పారిపోయెను. పెట్టెలో ముక్కి చావనున్న చుంచు ఓ సెకనులో స్వేచ్ఛకై పరుగెత్తెను.

యూసఫ్ గుండె లదరెను. దుఃఖాక్రాంతు డయ్యెను. "ఓ చుంచును పంపెను- దానిని కూడ భద్రముగా కొనిపోజాలనైతిని. దౌర్భాగ్యుడను- నే నిపు డేమి చేతును ?"

కాని ఏమి చేయగలడు- చుంచుకై ఆ పరిసరముల వెదకెను. చుంచు దొరుకునా ? వెఱ్ఱికాక ! మూసినపెట్టె పట్టుకొని దుఃఖమగ్నుడై ముందుకు సాగెను.

నీలానదిపై గల గురుమిత్రుని గృహము చేరి ఆ పెట్టె ఆతని కిచ్చి మౌన ముగా ఒకమూల నిలబడెను. ఆతడు దివ్యజ్ఞాని యగుట పెట్టె తెరచునంతలో సర్వము గ్రహించెను.

"మంచిది. నీవా చుంచును జారవిడచితివి. జూనన్ నీకిక బోధింపదని నా భయము. బ్రహ్మజ్ఞాన మాశించు వానికి ప్రధానముగ కావలసినది ఆత్మ విగ్రహము. నీ సంకల్పశక్తిని శంకించియే నీకీ పరీక్ష ఇచ్చెను నీ గురువు. ఈ స్వల్పకార్య మొనర్పజాలవైతివి. మహనీయ భావముల నీ మేధలో నెట్లు భద్రపఱుపగలవు? సత్యజ్ఞానము నీ హృదయమున నుంచగలవా? పనికిమాలిన దేవస్తువును లేదు. పో, యూసఫ్, నీ గురువు వద్దకు తిరిగిపొమ్ము. స్థిరశీలమును, పట్టుదలను నేర్చుకొనుము. నమ్మదగినవాడవు కమ్ము. ఎప్పటికైన ఆతని విజశిష్యుడవు కాగలవు."

గురువు నొద్దకు మఱలి వచ్చి ఆతడు తన నేరము నొప్పికొనెను.— ఆతడు, "గొప్ప అవకాశము పోగొట్టుకొంటివి నాయనా. పనికిరాని చుంచును పహితము భద్రముగ చూడలేకపోతివి. నిధులలో ఉత్కృష్టనిధియగు భగవత్సత్య మెట్లు భద్రపఱుపగలవు? వెళ్లు. నిగ్రహము నేర్చుకో. మనస్సు వశమొనర్చుట నేర్చుకో. అవి లేక ఏ ఘనకార్యమును సాధింపలేము".

యూసఫ్ తలవంచుకొని తరలిపోయెను. ఆతని పట్టుదల పెరిగెను. చాల సంవత్సరములు గతించినవి. దుర్ఘట తీవ్ర తపస్సొనరించెను. తన కార్య సిద్ధికై. చివరకు జితేంద్రియుడయ్యెను. తిరిగి గురువును చేరెను. గురు వానందముతో ఆతనికి బ్రహ్మవిద్య గఱపెను.

క్రమేణ యూసఫ్ మహావిజ్ఞాని యయ్యెను. ఆతడు ఇస్లామ్ పైగంబరు లలో అగ్రగణ్యుడయ్యెను.

(శిష్యులతో శ్రీమాత)- దీనిలో నేర్వదగినవివి : వేగిరపాటు కూడదు. ఆచరణయోగ్యము కాని జ్ఞానము వృధా- విజితేంద్రియుడవై అనుష్ఠానపరుడవు కమ్ము.

మీ కెన్నియో చెప్పితిని- సత్యప్రపంచ సంపర్కము కల్గించితిని, మీరు సత్యములో జీవించుచున్నారు. మీరు పీల్చుగాలి సత్యమయము. కాని సత్యము విలువ ఆచరణలోనే యున్నది. ఆ సత్యము విలువ నెఱిగిన వా రెందరు ? ఎఱుక, జ్ఞానము, జీవసమత్వము, విశ్వవ్యాపకత్వము, ఆనందము మొదలగువాని గూర్చి భాషించుట నిష్ఫలము. అవి పొందగలవి కాని వినుమాత్రమున లభించునవి కావు. నేనిట నెన్నో సంవత్సరములు గడపితిని. నా ప్రయత్నఫలము పొంద నిచ్చగింతును. నీచత్వము, నికృష్టత పోగొట్టుకొనుట కెంతటి ప్రయత్నము, ఎడతెగని ప్రయత్న మవసరమో చెప్పలేను. అకుంఠితమగు ఓర్మి ముఖ్యమని ఎఱుంగుడు. నిరహంకారముగ ప్రేమింపలేకున్న భగవత్ప్రేమను గూర్చిన ఉపన్యాసము లేల ? అమరత్వమునుగూర్చిన భాషణము లేల ? గతమున బంధితుడు వర్తమానమున తృణమైన నీయ నుత్సహింపబోడు.

మీరందరు పిన్నవయస్కులు. నేటినుండియే గమ్యసాధనకై చెల్లింపదగు మూల్యమును తెలుసుకొనవలెను. మీ ధ్యేయము పరమసత్య మెఱుంగుట. మీరు నేర్చుకొనుచున్నది మీ దైనందిన జీవితమున వాడవలెనని జ్ఞప్తిలో నుంచుకొనుడు- అదియే పరమసత్యమునకు రాచబాట.



మార్చి 27, 1957

"ఎచ్చట అంతమో అచ్చటనే గొప్ప ప్రారంభము. ఎచ్చట అమానుషమును, బాధాకరమును నగు విధ్వంసము భీతి గొల్పునో అచ్చట పెద్ద నిర్మాణము కానున్నదని ఊరడిగొనుము. దుఃఖపీడితుల రుద్ధకంఠములలోనే గాక, నిప్పులోనను, సుడిగాలులలోనను భగవంతుడున్నాడు.

"విధ్వంస మెక్కువ గలచోట నిర్మాణమున కెక్కువ స్వేచ్ఛ. అయినను విధ్వంసమున కధిక కాలము కావలెను— అది మందము బాధాకరము— నిర్మాణము ఆలస్యముగ వచ్చును; లేదా మధ్యలో ఆపివేయబడును. రాత్రి అదే పనిగ వచ్చును; పగలు వెనుకాడును, లేదా అభాసోదయముగ తోచును. నిరాశ వలదు కాని నిదానముగ శ్రమించుము. దురాశాపరు లెక్కువ త్వరలో నిరాశ చెందెదరు. నీకు ఆశ వలదు, భయమును వలదు. భగవానుని ఉద్దేశ్యము నెఱుంగుము, నీ సంకల్పమున విశ్వాసముంచుము.

"భగవానుడు తన నేర్పులో, పరికరములలో విశ్వాసము లేనట్లు వ్యవహరించును. అనేక పర్యాయములు పరీక్షించి, త్రోసివైచి, మఱల తీసుకొని శ్రమించి విఫలుడై మఱల ఆరంభించునట్లు తోచును. అన్నియు సిద్ధమగుసరికి ఎన్నో అనూహ్యములు, నిరాశలు, ఆతని పనిలో సాధారణ సంభవములు. ఎంచినది ఎందుకు

పనికిరానిదిగ పారవేయబడును- పారవేయబడినది మహా సౌధపు కోణశిల యగును. దీని వెనుక మన యూహ కందని యొక విశిష్ట జ్ఞానమును, అపరిమిత శక్తియు నున్నవి.

"కాలమాయన వశమగుట తొందర అవసరము కాదు. ఆయన సాధింప దలచిన దాయనకు తెలియును. ఎన్ని పర్యాయములు మధ్యలో విరుగగొట్టిననూ విచారింపడు. ఆయన కోరునది పరిపూర్ణత — మనము మొదట నేర్వ వలసినది ఓరిమి. అది పందల మందగతి కాదు; సంశ యాత్ముల, బలహీనుల జాగు కాదు. నిరుత్సాహుల నత్త నడక కానే కాదు. అది క్షమతో నిండినది, క్రమేణ బలము పుంజుకొనునది. సమయమునకు నిరీక్షించి సిద్ధముగనుండి రెండు మూడు బలిష్ఠమగు వేటులతో విధిని మార్చుటకు చాలినది.

"భగవానుడు బలిష్ఠమగు వేటులతో ప్రపంచ నిర్మా ణము చేయును. రొట్టిపిండివలె పిసికి, తొక్కి, ఎన్నియో పర్యాయములు రక్తపుజలము, నరకపు వేడి గల కటా హములో వేయును. మొత్తముమీద చూచిన మనుష్యు డింకను, కఠినము, కల్మషము, కుటిలత గల ముడి లోహము. అతడింకొక విధమగు లోహముగ నుండి భగవానుని నిర్దిష్ట భావముల కనుకూల మగుచో ఇంత కంటె సౌమ్య పద్ధతు లనుసరించి వానిని తీర్చి దిద్ద గలడు; అత్యంతోప యోగమగు సృష్టియే జరుగగలదు.

"ఆయన చేసిన ముడిపదార్థ మనేకవిధముల రూపొందించుట కవకాశము కలదు. ఆయన దివ్య భావమున అంద చందములే కాక ఇచ్ఛాశక్తులు కూడ నూహింపబడినవి. కావున శక్తిని నిర్లక్షింపకుము, దానిలోని కొన్ని నికృష్టతలకై దానిని ద్వేషింపకుము. ప్రేమ యొక్కటే దైవమని తలంపకుము. సంపూర్ణ సమగ్రతకు ఇంద్రుని శౌర్య సంపదయే కాక రావణుని అమానుష క్రౌర్యము కూడా కావలెను. దుర్భర కష్టముల నెదుర్కొనగల వానికే అత్యధికశక్తి సాధ్యము."

(తలపులు, తళుకులు— సం 16. పు. 392-93)

ఇంతకూ తెలుసుకొనవలసినది మానవత్వము పాళాబంగారము స్థాయి చేరినదా, లేక ఇంకను కొలిమిలో శుద్ధము చేయవలెనా? అనునది.

తేటతెల్లముగ తెలిసిన దిది: ఇంకను మానవత్వము స్వచ్ఛసువర్ణము కాలేదని.

చరిత్రపుటలు తిరగవేసిన, కొందరు వ్యక్తు లా దశ చేరినవా రున్నారని తేలును. ఇది ఆశాజనకము, వీరిది హింసలేని బలము, భీరువోని శౌర్యము, దైన్య మెఱుంగని ధైర్యము.

కాని శ్రీఅరవిందుల జబాబీ తర్వాతి పేరాలో నున్నది: "మనిషి ఆధ్యాత్మికముగ మార విచ్చగించిన." ఇచ్ఛగించిన,... మనిషిలోని దేదియో దానిని కోరుచున్నది, ఉద్వేగము నందుచున్నది. కాదనుచున్నదియు వానిలో నున్నది. తన దయనీయస్థితినే వరించుచున్నది, ఇదే కొలిమిలో వేయవలసియున్న కలుష స్వర్ణము.

ప్రపంచ చరిత్రలోని యొక ముఖ్యమలుపులో మన మున్నాము. సర్వులు ఇంకొక పర్యాయము ఏమి జరుగబోవుచున్నదని ఆశంకించుచున్నారు. వ్యథ, ఆశ, భీతి, సర్వత్ర వ్యాపించియున్నవి. "ఏమి జరుగబోవు చున్నది?" జవాబు: "మానవు డాధ్యాత్మికముగ మార నిచ్చగించిన...." బహుశః కొందరే స్వచ్ఛ సువర్ణమయిన చాలునేమో! చరిత్రగతి మార్చుటకు చాలునేమో! శీఘ్రముగ తేల్చవలసిన అవసర మెంతేని కలదు.

మన కష్టములకు, అసంపూర్ణతలకు, అయోమయములకు, భగవానుడు మననుండి రాబట్ట దలచిన ధైర్యశౌర్యము లేల వాడరాదు? శౌర్యమున నంతర శుద్ధి కొలిమి నేల నెదుర్కొనరాదు? అట్లొనరింపగలచో మఱొక పర్యాయము ఘోరమును, అపర్యాప్తమును నగు వినాశమున కవసరము రాదు. వినాశము ఎంతో శ్రమతో పెంచి పెద్దచేసిన నాగరికతను ధ్వంసము చేసి మానవాళి నంధ కారమున క్రూలద్రోయును. మన ఎదుటగల సమస్య ఇది—— ప్రతివాడును వాని ప్రత్యేకపద్ధతిని సాధింపదగ్గది.

మీ రడిగిన ప్రశ్నలకు జవాబు శ్రీఅరవిందు లిచ్చినదే. "మానవు డాధ్యాత్మికముగ మార నిచ్చగించిన"—— దీనికి నే నిది చేర్చెదను: "మానవ దృష్టి నుండి విలంబనమునకు సమయము లేదు."



ఏప్రిల్ 3, 1957

"మనిషి ఆధ్యాత్మికముగ మారుట కిచ్ఛగించిన సకలమును మారును. కాని, అన్న ప్రాణ మనో మయ ములా యున్నత శాసనములకు లొంగక తమ అసం పూర్ణతనే వలచుచున్నవి.

"జీవుడు పరమాత్మ. మనః ప్రాణ భౌతిక దేహము లాతని అసమగ్రు నొనర్చు ఆచ్ఛాదనలు. అవి సమగ్ర మగుచో వాని కర్త్వ మగు మూసలు కాదగినవి; ఆతని నిజ స్వభావమును వెల్లడింప జాలును. ఆధ్యాత్మికత యొక్కటే చాలదు. అది అసంఖ్యాక జీవులను పరమ పదమున కర్హుల జేయును. కాని ప్రపంచమును దాని పూర్వ దుఃస్థితిలోనే వదలివేయును. సమాధానము ముక్తిమార్గము కాబోదు.

"ఈ ప్రపంచము మూడు రకముల విప్లవముల నెఱుంగును. భౌతిక విప్లవములు బలమగు సద్యః ఫలితముల నిచ్చును. నైతిక. బుద్ధి విప్లవముల ప్రభా వము విశాలమున్ను, ఎక్కువ ఫలప్రదమును; ఫలము కొంత విలంబమున కల్గును. ఆధ్యాత్మిక విప్లవములు దిగన్తవ్యాప్తము కాగల భావి ఫలితముల బీజములు.

ఈ త్రికము సహకరించి వ్యవహరించిన ఏ ఒడు దొడుకులు లేక కార్యములు సాగిపోవును. కాని మానవుల మనో దేహములు వడిగల ఆధ్యాత్మిక

ప్రవాహమును తమలో నుంచుకొనజాలవు; ఎక్కువ భాగము ఒలికి పోవును. మిగిలినదానిలో చాలా భాగము కలుషితమగును. అధికముగా నాటిన ఆధ్యాత్మిక బీజములనుండి స్వల్ప ఫలితము రాబట్టుట కెన్నో భౌతిక బుద్ధి విప్లవము లవసరము

"మతములన్నియు మానవ జాతికి సాయపడినవి. మూర్త్యారాధనము (Paganism) మనిషి సౌందర్య పిపాసను, ఉన్నతమును పుష్కలమును అగు జీవితమును, ఆతని సర్వతోముఖ సమగ్రతోద్దేశ్యమును సఫలపఱచెను. క్రీస్తు మతము దివ్యప్రేమను, ఉదారతను ఇచ్చెను. ఎక్కువ విజ్ఞునిగ, సౌమ్యునిగ, పవిత్రునిగ నుండుట కొక ఉత్తమ మార్గమును చూపెను. క్రియల విశ్వాసము, భగవంతుని కంకిత మగుట ఎట్లో యూదు, ఇస్లాము మతములు చూపెను. హిందూ మతము అధికమును, గాఢమును నగు ఆధ్యాత్మికావకాశములకు ప్రవేశమిచ్చెను. ఈ మతములన్నియు దేవుని గూర్చిన యూహలే కావున మిళితమై ఏకోన్ముఖమగుచో ఎంతయో మేలు కల్గును. కాని దీనికి హేతువాద సిద్ధాంతములు, మతాహంకారము ప్రతిబంధకములుగా నున్నవి.

"అన్ని మతములును కొన్ని జీవులను రక్షించెను. కాని, ఏ యొక్క మతమును మానవ జాతిని ఆధ్యాత్మిక పరులుగ చేయజాలకపోయెను. ఇందుకు కావలసినది సాంప్రదాయిక సిద్ధాంతములు కావు; సకలమును లోగొనిన సడలని ప్రయత్న మవసరము.

నేడు కాననగు మార్పుల యుద్దేశ్యము, ఆదర్శము బుద్ధిగమ్యము, నైతికము, భౌతికము. ఆధ్యాత్మిక విప్లవము తరుణమునకై వేచియుండి ఇటనట కొన్ని తరంగములను లేపుచున్నది. అది వచ్చువరకును ఈ తరంగముల మూలమర్థము కాబోదు. అది ప్రాపించుదనుక నేడు జరుగుచున్న మహత్తర సంఘటనల అన్వయములు, మనిషి భావిని గూర్చిన జోస్యములు వ్యర్థములు. దాని స్వభావ శక్తులు, సంఘటనములే మానవ జాతి భవితవ్యమును నిర్ణయించునవి."

(తలపులు, తళుకులు— సంపుటి 16, పుట 393 - 94)

మాతా, శ్రీఅరవిందు లిట్లు వ్రాసిరి: "ఈ మతము లన్నియు (దేవుని గూర్చిన యూహలే కావున) మిళితమయి ఏకోన్ముఖమగుచో ఎంతయో మేలు కల్గును, కాని, దీనికి హేతువాద సిద్ధాంతములు, మతాహంకారములు ప్రతిబంధకములుగా నున్నవి."

ఈ దృష్టిభేదము లన్నియు ఒకటిగా మేళవించు టెట్లు ?

ఈ పనిని మనస్సు చేయజాలదు. మనస్సు నధిగమించి దాని వెనుక నున్న భావ మరయవలెను. కావుననే ఒక్కొక్క మతము మానవ ప్రయత్నములో, ఆకాంక్షలో, కృతకృత్యమగుటలో ఏయే మత మెంతవరకు నెగ్గినదో శ్రీఅరవిందు లుదాహరణపూర్వకముగ చెప్పిరి. ఈ మతములు వ్యవహారమున మూఢనమ్మకములుగను, ఊహాకల్పితములుగను మారుచున్నవి. దాని అంతరార్థ భావముల విడదీసి ఏకముగ చేయుటంత కష్టము కాదు. ఒక్కొక్కటియు మానవుని ప్రత్యేకాంశమును వృద్ధిచేసి, అన్నియును కలసి వానిని సంపూర్ణుని చేయును. ఒకదాని కొకటి విరోధులు కాక సహాయకారులగు మిత్రులు. జీవితార్థమును ఎక్కువగ గ్రహింపగల్గి మానవుడు పరమాత్మకు సమీపవర్తి కాగలడు. వస్తువుల వెనుకనున్న జీవశక్తి కరతలామలక మగును. ఈ మేళవింపుకు భావికలల చిత్రములను చేర్చవలెను. అనగా, మనిషి తాను చేరదలచిన గమ్యరూపమును దీనితో జోడించవలెను. అదియే ఆధ్యాత్మిక విప్లవము. అదియే శ్రీఅరవిందులు ప్రస్తావించిన అతిమానస విప్లవము. దాని మూలముననే నవ్యయుగ ప్రారంభము కాగలదు.

అతిమానసపు వెలుకలో ఈ వైరుధ్యములు మార్పుచెంది ఒకదానినొకటి బలపరచి, అన్నియును కలసి పూర్ణమానవత్వ మావహిల్ల జేయును. కక్షలకు దారితీయు మనోరూపములను అతిమానసశక్తి సాయమున సన్నిహితమొనర్చి అన్నిటిని సమశ్రుతిలోనికి తేవలెను. అన్నియు తమ భిన్నత్వమున నిమిడియున్న ఏకత్వము నెఱిగిన వేళ తమతమ యుక్తస్థానముల తమ పాత్రపోషణ మొనర్చి పరిపూర్ణఫలమునకు దోహదమిచ్చును. ఇదియే మానవజాతి నేటి ప్రధాన అక్కఱ. నిజమగు ఆధ్యాత్మిక జీవితమంత సాధ్యమగును.

కొన్ని సిద్ధాంతములు, అవగాహన లేని భావసంచయము కలది మతము. కొందరి ఆధ్యాత్మిక శక్తిచే అది ప్రసిద్ధిలోనికి వచ్చును. కాని, ఆధ్యాత్మిక జీవనము, ముఖ్యముగ అతిమానసానుభవము నిర్దిష్ట బుద్ధిరూపములకు, సకల పరిమిత జీవరూపములకు అతీతముగ నుండిన వీని సహాయము దాని కక్కరయుండదు. అది అన్ని అవకాశములను, వ్యక్తరూపములను తనలో జీర్ణించుకొని సత్యప్రకటనా సాధనములుగ జేసికొనును.

క్రొత్తమతము లాభకారి కాకపోగా ఘోరప్రమాదములు తెచ్చిపెట్టును. నూతనమగు ఎఱుక మూలముననే నవ్యజీవనము ప్రాపించును. ఈ ఎఱుక మనో బుద్ధిసూత్రముల కతీతమై సజీవసత్యమును వెల్లడింపవలెను.

ప్రతిదానియొక్క విశిష్టతయు, సత్యమును దాని అనుభూతిలోనే యున్నవి. ఈ అనుభూతి సమగ్రముగను, విశ్వవ్యాప్తముగను పరమార్థమును (పరమ సత్యమును) వెల్లడింపగలిగినదిగ నుండవలెను. ఇదియే మానవజాతిని, ప్రపంచ మును రక్షింపగలది. మనము దీనిని పొందవలెననియే ఆయన వాంఛ.

వచ్చే బుధవారము మనము చదువనున్న 'అతిమానస అభివ్యక్తి' గ్రంథ ములో దానినే ఆయన స్థూలముగ వివరించెను.

నేనీనాడు చదివిన మొదటివాక్యమే,— వ్యక్తికేకాక సమష్టికి కూడ,— సమస్యకంతటికిని కీలకము.

"మనిషి ఆధ్యాత్మికముగ మారుట కిచ్ఛగించిన సకలమును మారును. కాని, అన్న, ప్రాణ, మనోమయము లా యున్నత శాసనములకు లొంగక తమ అసంపూర్ణతనే వలచుచున్నవి."

మన ధ్యానవిషయముగ దీనిని తీసికొందము.

(ధ్యా న ము)

* * *

ఏప్రిల్ 10, 1957

"క్రీడల మూలమున లీలామనస్తత్వము పెరుగుట ఇంకొక లాభము. సరదా, సహనము, సమహితత్వము, బొంకులు లేకుండుట, ప్రత్యర్థుల యెడ నిరసన భావము లేకుండుట, నిగ్రహము, నిబంధనలు మన్నించుట, అక్రమ మార్గములను గెలుపుకై అవలంబింపకుండుట, జయాపజయములయెడ మధ్యస్థముగనుండుట, తీర్పరి తీర్పులను శిరసావహించుట క్రీడలు నేర్పగలుగును. ఈ సుగుణములు క్రీడలలోనే కాక జీవితమునకూడ లాభదాయకముగ అనుసరింపదగినవి. ఇవి వ్యక్తులకే కాక జాతికిని, ప్రపంచమునకును (ముఖ్యముగా నేటి ద్వేష పూరిత కల్లోల ప్రపంచమునకు) ప్రశాంతముగ జీవించుటకు కావలెను. పరస్పరావగాహన, అన్యోన్యత నేడెంతేని అవసరము మనస్సు నెంత నెక్కువగ బోధించినను, దేహము అభివృద్ధి చెందకున్న లాభములేదు. ఈ గుణముల నంతరించిన జాతి బలిష్ఠమై సదా విజయిగనుండును, తాను బలపడి తక్కిన జాతుల అభివృద్ధికిని, ప్రపంచ సామరస్యమునకును సహాయకారి కాగలదు. "మన మాశించుచున్న మానవజాతి భావి సౌభాగ్యమునకై, సహకార జీవనమునకై ఇది యెంతయో అవసరము."

(శ్రీఅరవిందుల— 'అతిమానసాభివ్యక్తి'. పుటలు 2-4 *)

---

* 1948 డిసెంబరు 30 నాటి ఈ 'సందేశము' 1949 ఫిబ్రవరిలో ప్రచురితమైన శారీరిక శిక్షణ బులెటిన్ తొలి సంచిక కొనంగబడెను. పిమ్మట నిది శ్రీఅరవిందులు బులెటిన్ కొరికై వ్రాసిన ఎనిమిది అధ్యాయములుగల 'పృథ్విపై అతిమానసాభివ్యక్తి' అను పొత్తమునకు పీఠికలో చేర్చి ప్రచురింపబడినది.

ప్రేమమయీ, మాతా. మన ఆటల పోటీలలో పెక్కురు అక్రమ పద్ధతు లవలంబించుచున్నారు— పిల్లలు కూడ గెలుపాసించి వీరి ననుకరించుచున్నారు. దీని నెట్లు నివారించుట ?

దుష్టమార్గదర్శకత్వము పిల్లలకు హాని చేయును. అధిపతులు తమ వారిని సమావేశపఱచి శ్రీఅరవిందు లీసందర్భమున నన్నది వారికి బోధి మంచిది. "క్రీడాచట్టము- ఆదర్శబాలుడు" గ్రంథమున వారు ఈ విషయ చక్కగ వివరించిరి. ఒక పర్యాయము కాక, పలుసార్లు పిల్లలకు చె చెప్పుచుండవలెను— దుష్టసహవాసము, దుష్టస్నేహితుల గూర్చి (నే నిది చెప్పినట్లు) వారికి తగిన హెచ్చరిక నీయవలెను.

అంతకంటె ముఖ్యమయినది నీ నడవడి— వా రెట్లుండ వాంఛిం నీవట్లు వారి యెదుట ప్రవర్తింపుము. నిస్స్వార్థత, ఓరిమి, నిగ్రహము, ప్రియత్వము, సద్భావము, ఇతరుల బాధల అవగాహన, చిన్నచిన్న అయి విస్మరింత— వీని దృష్టాంతముల వారికి నీ నడవడిలో చూపుము, భ్రాంతులనుండి వారిని రక్షింపగల సౌమ్యత నలవర్చుకొమ్ము. దండనభీతియే లను మోసకారులుగను, అనృతవాదులుగను, దుష్టులుగనుచేయును. నిన్ను వచ్చునని వారు విశ్వసించినచో నీనుండి వారేమియు దాచరు. అంత వారిని వి పాత్రులుగను, ఋజువర్తనులుగను దిద్దనగును, వారి యెదుట సత్ప్రవ ప్రదర్శించుట చాల ముఖ్యము. శ్రీఅరవిందులు దీనిగూర్చి చెప్పిరి. పరిస్థితులలోను సమభావము వీడకుము. నీ బాధల కితరుల బాధ్యులచేయకు తత్తరపా టెందునను వలదు. నీ కెంత బాధగ నున్నను ఇతరులపై చి పడకుము. దీని కెంతో నిగ్రహము వలయును. ఆత్మదర్శన పథమున ని ముందడుగు. నాయకు డగువాడీ నిబంధనల తృప్తిపఱచినచో (చిన్నపా సంఘ నాయకత్వమయినను), ఆతడు యోగసిద్ధి మార్గమున చాల ముం పోయినట్లే. నీ వ్యక్తిగతస్థితి సంఘకార్యముల మీదను, సాముదాయిక కా ముల మీదను ప్రభావము చూపరాదు. సమస్యను ఆత్మనిగ్రహము, చిత్తశ దము, క్షమాదృష్టితో చూడవలెను. ఆత్మవిస్మరణము నాయకునికి కావల

ముఖ్యగుణము. దీనికి లక్షణములు ఆవశ్యకము : ప్రత్యేకాభిమానములు లేకుం డుటయు, స్వలాభాపేక్షారాహిత్యమును, సంఘశ్రేయమే ప్రధానముగ గుర్తించుటయు, సంఘశ్రేయస్సు తనపై ఆధారపడినట్లు భావించి ఏ లాభాపేక్షయును లేక దానికై శ్రమించుటయు.

ఒక చిన్ననాయకుడా విధముగా పెద్ద నాయకుడై ఒక జాతికికూడ మహా నాయకుడు కాగలడు. సాముదాయిక కార్యముల నిర్వహించ గలందులకు సిద్ధము కాగలడు. ఈ నాయకత్వ శిక్షణ అత్యంత ప్రధానమయినది. దీనినే మన మిచట సాధించుచున్నాము. మీలో ప్రతియొక్కనికి ఒక బాధ్యత నప్పగించుట (చిన్నదో, పెద్దదో) ద్వారా మిమ్ములను నాయకులుగా తయారుచేయుట దీని ఉద్దేశ్యము.

నాయకుడు స్వార్థరహితుడు కావలెను. స్వార్థము పూర్తిగ విడువవలెను. అహమును వదలవలెను. యోగాభ్యాసమున నిది ప్రథమ ఘట్టము. ఇది క్రీడలను ఆత్మదర్శనమునకు సహాయకారులుగ చేయును.

దీని నెల్లరు గ్రహింపలేరు. క్రీడావిముఖులు ఇంద్రియ విజేతలు కాలేరు. శ్రీఅరవిందుల పూర్ణయోగమున మొదటిమెట్టు దేహవశీకరణము. దీనిని కాదను వారు పూర్ణయోగమున కనర్హులు. దేహమును దాని అన్నిరూపముల వశమొనర్చు కొనుట ప్రప్రథమముగ చేయదగిన దీయోగమున. నిన్నాడించు దేహము నీ శత్రువు. అదొక రుగ్మత— దాని నంగీకరింపజనదు. నీ శిక్షితబుద్ధి దేహ మును నడుపవలెను. దేహము బుద్ధిని నియమింపజనదు. చెడ్డ దానిని చేయ కుండుట, మంచిది ఎన్ని అవరోధములున్నను చేసితీరుట విధిగా నుండవలెను. దీనికి క్రమపద్ధతితో కూడిన దేహవ్యాయామ మవసరము. నీ యింటికి నీవు యజమానివి కావలెను.

ధ్యానమున నుండి, ఆ మహనీయపదమునుండి భౌతికముల గమనించుట చాల మంచిదే కాని, గృహయజమాని కానివాడు దాని బానిసయే.

(మౌ న ము)

ఆ మూలవారికి ప్రశ్నలు లేవా?

మాతా, క్రీడలలో ప్రావీణ్యత కేయొక్క ఆట పైననో, క్రీడపైననో కేంద్రీకరింపవలెను,

అది శుద్ధ తప్పు. నేను విడుదలచేసిన కరపత్రము (ప్రథమ సంచిక) లో సవివరముగ పమీక్షించితిని. తన్నుతాను విగ్రహించుకొనగలవాడు, కేంద్రీకరించుట నేర్చినవాడు, రెండు విరుద్ధముగ నున్నవానిని, లేక ఏ సంబంధమును లేనివానిని, చేయగలడు. ఒకటి మఱొకదానికి హానిచేయకుండ చూడగలడు.

ఇక మిగిలినది కాలము గూర్చినది. ఇది రెండు భాగములుగ విడదీయ వచ్చును. జీవితమును తెలివితోకూడిన పద్ధతి ప్రకారము రూపొందించుకొనుట. వ్యర్థక్రియాకలాపముల మానుట— వీనిచే ప్రపంచ మెంతయో బాగుపడును. వ్యర్థ క్రియాకలాపములలో బాతాకానీ కగ్రస్థానమిత్తును. స్నేహితులమధ్య, సహచరుల మధ్య- అనేకసమయములలో జరుగు వృథా ప్రసంగములు — మాటలలో వ్యయించు కాలమెంతో! ఒక్కమాటలో నగుదానికై ఏబది మాటలు! అబ్బా!

అదొక్కటే కాలయాపనకాదు. సమయము లేదనువానికి జీవితము రూపొందించుకొనుట తెలియదన్నమాట. కొందరత్యధికముగ శ్రమింతురు. అదికూడ జీవితమును రూపొందించుకొనుటలోని లోపమునే సూచించును. క్రమమగు ఏర్పాటు దేనికి కావలసిన కాలమును దాని కేర్పాటుచేయును. పొంతనగల సాధనములతో పదిపదునేను నిమిషములలో దేహమునకు సమగ్రవ్యాయామ మీయ వగును. అది మీకిచట నేర్పబడినది; నిరూపింపబడినది కూడ. దేహమారోగ్యముగ నుండుటకిది చాలును, ఆటలమూలమున నింక ననేక లాభము లున్నవి. అయినను మీరొక గంటకు మించి ఆడరు (ప్రతిరోజును). ఒక రోజులో అది ఎంతో హెచ్చుకాలము కాదు,

కాలము చాలదనుట యొక సాకుమాత్రమే. నీ జీవితమును ఆదిలో రూపొందించుకొమ్ము: అన్నికార్యములకును చోటు కలదని నీ కంత తెలియ గలదు.—మంచి విద్యార్థి వగుటకు కూడ.

* * *

ఏప్రిల్ 17, 1957

"అన్ని సాధనల గమ్యము సంపూర్ణతయే. ఆధ్యాత్మిక, చైత్యాత్మిక, మానస, ప్రాణ సాధనల గమ్యమిదియే. దైహిక సాధనల గమ్యముకూడ నిదియే యైయుండవలెను. జీవి సంపూర్ణతకే మన అన్వేషణ యగుచో, ఈ భౌతిక (దైహిక) భాగమును విస్మరించరాదు. దేహాధారము లేక మనము సంపూర్ణత నందజాలము. ధర్మాచరణకు ముఖ్యసాధనము దేహమే. 'శరీరం ఖలు ధర్మసాధనం'.— అనుచున్నది పురాణ సంస్కృతోక్తి. ధర్మ మనగా మనము మనకై ప్రతిపాదించుకొను ప్రతి ఆదర్శము, దాని అనుష్ఠాన సిద్ధాంతము, ఆచరణ విధానమును. మన అంతిమ గమ్యము పరిపూర్ణత. మనము భూమిపై నిర్మింపదలచుకొనిన దివ్యజీవనము భౌతిక జగత్తు యొక్క నిబంధనలకు లోబడియే, ఆధ్యాత్మిక శక్తుల ఇహలోక జీవనము, ఇహలోక జీవనపు ఆధ్యాత్మిక

పరివర్తనమును ఇట కొనసాగవలసి యున్నది. దేహము పరివర్తనము చెందకుండ అది అసాధ్యము. దాని ప్రవృత్తియు, వ్యవహార సరళియు పరమ పరిపూర్ణస్థాయిని చేరకుండ అది దుర్లభము. అట్టి స్థాయి చేరశక్యమైనదే,"

'అతిమానసాభివ్యక్తి'— సంపుటి 16, పుట 5

మాతా, దేహప్రవృత్తి పరమస్థాయిని చేరుకొనుటెట్లు ?

సంపూర్ణ పరివర్తనముచే నియ్యది సాధ్యము. శ్రీఅరవిందులు దీనిని గురించి ముందు చెప్పబోవుచున్నారు. ప్రస్తుతము మన కాయము పశుకాయమునకు భిన్నముకాదు. ఒక దిశలో లాభము తోచినను వేరొక దిశలో నష్టపడితిమి. దేహసామర్థ్యములో మృగములే మనకంటె ఉన్నతస్థాయిలో నున్నవి. సింహము, పులి,— వీని కండశక్తి మనదానికంటె ఎన్నోరెట్లు అధికము. (ప్రత్యేకసాధనల నవలంబించిననే తప్ప) చురుకుదనములో కోతి మనలను మించును. పక్షి ఆకసమున విహరించుటకు ఏ యంత్రసాయమును కోరదు. మన మింకను ఆ పని చేయలేము. పాశవిక అవసరములకు లోగి మన అవయవములు పని చేయుచున్నవి. ఎంతవరకు భౌతికాహారముపై ఆధారపడియుందుమో, వాని స్థూలరూపముల నభిమానింతుమో, అంతవరకు మనము పశువులకంటె హీనమే.

ముందు చదువబోవుదాని వివరణములోనికి నే నిపుడు దిగను. మన యీ దేహపు పశుప్రవర్తనము పశుజీవనమునకు తుల్యము. జీవితము రక్తప్రసారముపై, రక్తము తిండిపై.— ఇట్లే అన్నియు పరస్పరాధారములై యున్నవి. ఇవి ఘోరమైన అవరోధములు, బంధనములు. భౌతిక జీవనము వీటిపై ఆధారపడియున్నంతకాలము దివ్యజీవనము లభ్యము కానేరదు.

కావున, మన జీవితవిధానమును మార్చుటయెట్లో యోచింపవలసియున్నది. అది ఊహాతీతము గాదు— ఊహింప జాలినదే, కొంత సాధ్యపడగలదే. ఈ గమ్యమును మన యెదుట నుంచుకొనవలెను. అప్పుడే దివ్యజీవనమున కవకాశము కల్గును.

వేద, చాల్డియన్ సంప్రదాయములకు చాల పూర్వ మొక సంప్రదాయ ముండెను. అదియే ఈ రెండిటికిని మాతృక కానోపు. అందులో అత్యంత తేజోవంతమగు దేహము గూర్చిన ప్రస్తావన కలదు. దానికి స్థిరరూపము లేదు. ఒక్కొక్క భావప్రకటన కొక్కొక్క రూపము దాల్చగలదు. తేజస్సు హెచ్చుటకు తగ్గుటకు అవకాశమున్నది. ఏదో సిద్ధి చెప్పబడెను. దానిని పురస్కరించుకొని గాలిలో ఇచ్ఛననుసరించి పోనగును. ఆ శక్తిపాటవమున నెన్నో అద్భుత కార్యములు చేయవచ్చును.

ఈ శక్తులు పాక్షికముగ నైన కలవారు భూమిపై జీవించి యుండిరేమో చెప్పజాలను. కాని అది సాధ్యమనుటకు కొన్ని చిన్న దృష్టాంతములున్నవి— వీని ననుసరించి, నేడు వ్యవహరించుచున్న భౌతికావయవముల స్థానమున కొన్ని శక్తిచైతన్య కేంద్రముల స్థాపించి, వానిద్వారా ఉన్నతశక్తుల నొకమాదిరి రసాయన ప్రక్రియచే వానిలోనికి వచ్చునట్లుచేసి దేహప్రాణావసరములకు వాడుకొనవచ్చునన్న విషయము ఊహాతీతము కాదు. అట్టి కేంద్రముల (చక్రముల) గూర్చి మాట్లాడుచునే యుంటిమి. యోగాభ్యాసకుల కిది బాగుగ తెలిసినదే. కాని, ఈ చక్రములు ఆయా అవయవముల తొలగించి వాటి స్థానమాక్రమించు పక్వస్థితికి వచ్చుటకు అతిమానస శక్తితరంగములచే స్థూలపదార్థము ప్రభావితము కావలెను. రహస్యజ్ఞానవేత్తలు సూక్ష్మశక్తులను స్థూలముగ చేయగలరు. వాటికి భౌతిక తరంగముల సంపర్కమీయగలరు— దానికి దృష్టాంతము లున్నవి. ఈ రహస్య జ్ఞానశాస్త్ర మింకను సమగ్రము చేయవలసియున్నది. అంత భౌతిక ప్రపంచమున అతిమానస జీవనమును వెల్లడింపగల కాయములను సృష్టింపనగును.

కాని, శ్రీఅరవిందులు చెప్పినట్లు ముందుగా ఈ దేహముయొక్క శక్తులను, అవకాశములను పూర్తిగా ఉపయోగింపనేర్చుట ముఖ్యము. వైజ్ఞానిక

శాస్త్రోక్తముగ దేహవ్యాయామము చేయువారు దేహము నదుపులో నుంచగల్గుట నిజమే. రష్యను వ్యాయామదక్షులిటకు వచ్చినపుడు సామాన్యుల కలవికాని ఎన్ని కసరత్తులు ప్రదర్శించలేదు? వారవి సామాన్యవిషయములవలె అతి లాఘవముగ ప్రదర్శించిరి. దేహపరిణతిలో అది గొప్ప ముందడుగు. వీరు భౌతిక వాదులు. ఆధ్యాత్మిక పద్ధతులకు వారి శిక్షణలో స్థానము లేదు. భౌతిక పద్ధతుల చేతను, వివేకవంతమగు సంకల్పమునను వారీ అద్భుతముల సాధించిరి. ఆధ్యాత్మికమును వానితో జోడించిన ఇంక నెంతయో అద్భుతమగు ఫలితముల నంది యుండెడివారు. ప్రపంచమున వ్యాప్తమయియున్న అసత్యభావనలచే రెండిటివి జోడింపకున్నాము, ఒకటి యున్నచోట రెండవది లేకయున్నది. మనము చేయబూనిన దీ సమన్వయమే. శ్రీఅరవిందు లనినట్లు ఈ రెండును సహకరించిన, సామాన్య లూహింపరాని పరమ ఫలితములు లభింపగలవు. దీనికే మన ప్రయత్నము.

ఆయన చెప్పినట్లు (రాబోవు వారము చదువగలము), మొదటగా తెలివి మాలిన దురభిప్రాయముల ప్రతిఘటింపవలెను. భౌతికాధ్యాత్మిక జీవితములమధ్య నివి స్పర్ధల కల్గించుచున్నవి. ఈ దురభిప్రాయము లెంతో గాఢముగ నాటుకొని యున్నందున, వీని నిర్మూలనమునకు మానవుని ఎఱుక చాలదు. విజ్ఞుల మను కొన్న వారికిని దుస్సాధ్యమే యగును. నేను ప్రత్యేక హేతువున ధ్యాన మారంభించగనే కొంద రిట్లనిరి; "అమ్మయ్య! చివరకు మన మాధ్యాత్మిక జీవనమునకు తిరిగివచ్చితిమి" అని. ఈ దురభిప్రాయశైథిల్యమునకే, నే నిన్నిరోజులు ధ్యానము మానితిని. ఇతరకారణములు దాని ననివార్యము చేయుటచే మఱల ప్రారంభించితిని. ఈ దురభిప్రాయము మనసునుండి తొలగువరకు అతిమానసశక్తిని అర్థము చేసికొనజాలనిమానవుని అగమ్యగోచరభావముల మునగక తప్పదు. మంచిది. అయినను మనము సంబాళించుకొందము.

శాశ్వత సత్యావగాహన ఏమాత్రము లేని విభజన నెదిరించుటకై అత్యంత తీవ్రరూపమున ప్రతిపాదితమైన పరమసత్యముతో మీకు సాంగత్యముకల్పించు అవకాశమునకై నే నీ 'అతిమానసాభివ్యక్తి, గ్రంథము నెంచితిని. దీనిని పూర్తిచేసిన

పిదప మన మేల ధ్యానము మఱల ప్రారంభించితిమో చెప్పగలను. ఆధ్యాత్మిక జీవనమునకు తిరిగివచ్చుటకు కాదని నమ్ముడు.

ఈ దురభిప్రాయ మెంత లోతున నాటుకొన్నదో! తెలివిగలవార మను కొనువారు సహితము ఆధ్యాత్మిక జీవనమనగానే ధ్యానము నూహింతురు.

మంచిది. మనము ధ్యానింతము— కాని, కారణ మదికాదు.

(ధ్యానము)

* * *

ఏప్రిల్ 24, 1957

ఈ భౌతిక ప్రపంచములో దివ్యజీవన మనునది జీవితము యొక్క రెండు కొనలైయున్న ఆధ్యాత్మిక శిఖరము, భౌతికమూలము, అనువాని కల యికతో రూపొందవలసియున్నది. భౌతిక పదార్థ మున నెలకొన్న జీవితముగల అంతరాత్మ చైత న్యము పరాత్మ చైతన్యశిఖరములను క్రమముగా చేరుకొనినను, తన నెలవైన భౌతికమూలమును త్రోసివేయక, ఆ పరాత్మశిఖరముల నీ మూలస్థాన ముతో కలుపును. అంతట, ఆ పరాత్మచైతన్యము

భౌతికమున నవతరించి, మహిమాన్వితములగు తన తేజశ్శక్తులతో అద్దానిని నింపి, భౌతిక జీవితమును క్రమాధికముగ దివ్యపరిణతి నొందించును. ఇదేదియో కేవలము సూక్ష్మము, ఆధ్యాత్మికమునై, భౌతికమును ఆత్మకు బంధకముగను, విరోధిగను పరిగణించునట్టి పరిణామము కాదు. ఈ పరిణతియందు, భౌతిక పదార్థము ఆత్మయొక్క రూపవిశేషముగా చేకొనబడి, దానిని వ్యక్తమొనర్చు నుపకరణముగా మలచబడుట సంభవించును. ప్రస్తుతమా రూపవిశేష మాత్మను మరుగుపరచునదై యున్నది. భౌతిక పదార్థపు శక్తి సామర్థ్యములను, విధానములను ఈ పరిణామము త్రోసిపుచ్చదు. మీదుమిక్కిలి, వానికి ఉన్నతి కల్పించి, మరుగువడియున్న దివ్యత్వము వెల్లడియగు నట్లొనర్చును. దివ్యత్వము పొందింపదగినదేదియు దివ్య జీవనమున త్రోసిపుచ్చబడదు. సకలము సముద్ధరించ బడి, పూర్ణత్వమున శోభిల్లునట్లొనర్పబడును.

ఈ పూర్ణత్వసాధనను మనము మన జీవసత్త యొక్క ఏ కొననుండియైనను ప్రారంభించవచ్చును. కాని, ఎక్కడ నుండి ప్రారంభింతుమో దాని కను గుణమైన విధానములనే కనీస మారంభదశలో మన మవలంబించవలసి యుండును. యోగము నందలి ప్రక్రియ ఆధ్యాత్మికము, చైత్యాత్మికమునై విలసిల్లు నట్టిది. అందలి ప్రాణిక, దైహిక ప్రక్రియలు సైతము తదనుగుణముగనే మలచబడి, ఉన్నతస్థాయి కెత్త

బడును. హఠయోగ, రాజయోగములలో ఆసన, ప్రాణయామ ప్రక్రియల అవలంబన మిట్టిదే.... అట్లు గాక, క్రిందిస్థాయిలలో ఎక్కడ నుంచి మనము ప్రారంభించినను, ప్రాణిక, దైహిక విధానములనే మన మవలంబించి, అవ్వాని నిబంధనలకు లోనై ప్రవర్తింపవలసి యుండును. ఈ విధానమునందు మనము, మన కర్మక్షేత్రమును, అందు సాధింపనైన పూర్ణత్వమును ఎంతగా విస్తరింపజేయ గల్గినను, ఎచట ప్రారంభించితిమో ఆ ఆధారభూమిని మాత్రము వదలిపెట్టరాదు. సంపూర్ణత కొరకైయిట్లు రెండు కొనల నుండియు కొనసాగు కృషి మేళనము చెంది, ఉన్నతస్థాయి సంపూర్ణత్వము నిమ్నస్థాయి సంపూర్ణత్వమును తనలోనికి గైకొని సముద్ధరించు నవకాశము లేకపోలేదు. కాని, ఇది యొనగూడవలె ననిన, నిమ్నస్థాయినుండి మన దృక్పథము, ఆకాంక్ష, ఆశయము ఉన్నతస్థాయికి మార్పు చెందవలెను. మానవ జీవనము దివ్యజీవనముగ పరివర్తనము చెందవలెనన్నదే మన లక్ష్యమేని, ఈ పని అవశ్యము జరిగితీరవలెను. ఈ సన్నివేశములోనే, మానవ జీవన ప్రవృత్తులకు ఆత్మచైతన్య శక్తిచే సమున్నతి కల్పించవలసిన ఆవశ్యకత యేర్పడుచున్నది. ఇందుమూలమున నిమ్నస్థాయి సంపూర్ణత అదృశ్యము గాబోదు ఆత్మశక్తివలన మాత్రమే చేకూరగల ఉన్నతస్థాయి సంపూర్ణతచే రూపాంత

రము చెందింపబడి, విస్తృతరీతిలో నయ్యది విలసిల్లుచునే యుండును.

('అతిమానసాభివ్యక్తి'— సంపుటి 16, పుట 5-8)

కరుణామయీ, మాతా, శ్రీఅరవిందులిచట 'నిమ్నస్థాయి సంపూర్ణత,' 'ఉన్నతస్థాయి సంపూర్ణత' ల గురించి ప్రస్తావించుచున్నారు.

ఉన్నతస్థాయి సంపూర్ణత ఆధ్యాత్మికము; బ్రహ్మముతో ఐక్యమగుట; తాను కేవలము బ్రహ్మ మగుట; అపరప్రపంచ పరిమితుల నధిగమించుట. ఇది యోగసాధ్యము. దేహముతోడను, ప్రపంచము తోడను ఏ మాత్రపు సంబంధమును లేకయుండుట. పూర్వకాలమున బ్రహ్మమును చేరుటకై దేహమును, భౌతికజీవనమును వేరుచేయవలసియుండెను. పరప్రపంచము తోడనే సంపర్కముంచుకొనవలసియుండెను.

నిమ్నస్థాయి సంపూర్ణత ఈ మానవకాయమున భూలోక వస్తువుల వీలగునంత ఉపయోగించుటలోనే కలదు. ప్రఖ్యాతిగాంచిన మేధావు లందరిలోన నిది చూడగలము. కళాకారులు, కవులు, నిర్మాణదక్షులు, రాజ్యపాలకులు, నాగాయుత బలులు- వీరందరిలో చూడగలము. యుద్ధమున వైమానికులు చూపిన అసమాన ధైర్యసాహసములు, అద్భుతకార్యములు వీనికి దృష్టాంతము, సహనము, అమానుష బలము వీరి కబ్బినది. ధైర్యము, నిస్స్వార్థము, సాధుత్వము, దయాదాక్షిణ్యములు మొదలగు మానవ లక్షణములు గరిష్ఠస్థాయిలో పొందుట నిమ్నస్థాయి సంపూర్ణత యగును.

నిమ్న సంపూర్ణత గరిష్ఠస్థాయి నందినవేళ మానవ సంపూర్ణత చేకూరును. దీనికి ఆధ్యాత్మికతతో సంబంధము లేకయుండవచ్చును. ఆధ్యాత్మికాపేక్ష లేకయే

ఒకడు మహామేధావి కానోపును. అది లేకుండనే అధిక నిర్మాణాత్మక శక్తులు గలవారు తృప్తిపొందెదరు. వీరు స్వయంసంపూర్ణులుగ తమ్ము భావించుకొందురు. తమ ఘనకార్యముల సార్థకతా సంతోషములు తమలోనివే యనుకొందురు. వారి కార్యములకు వారు కర్తలు కారని నచ్చజెప్పుట అసాధ్యము. వారితో, "ఇది నీ ప్రతాపము కాదు. ఏదియో మహత్తరశక్తి నీచే యీ పని చేయించినది," అనిన, ఏ కొందరోతప్ప అధికసంఖ్యాకులు చిరాకుతో నిన్ను తరిమివేతురు. ఉన్నత నిమ్న సంపూర్ణతలు వేర్వేరు దారులలో సాగును—యోగశాస్త్రమున నిట్లున్నది; "యోగాచరణకు మొదటి మెట్టు ఈ జీవితముపై విరక్తి చెందుటయే." కాని, మహాపురుషులగు దేశోద్ధారకులు జీవితముపై విరక్తి గొనినట్లు చూడము— వారి జీవితములలో ఏదైన అఖాత మేర్పడిన తప్ప, తమ్ము నెవ్వరును గణింపకున్న తప్ప. వారి చేయి పైగా ఉన్నంతదనుక, వారి కేచింతయు నుండదు.

వారిం కేమియు కాంక్షింప నవసరముండదు— ఇది వాస్తవము కాకున్నను అట్లే ఎన్నబడుచుండును— వా డెఱుంగకయే వారిచే ఈ మహాకార్యముల చేయించునది వారిలో అంతర్గతముగనున్న ఆత్మ,— ఈశ్వరుడు.

వాడు పుట్టిపెరిగి మరణింపవచ్చును. భూలోక జీవితమేతప్ప ఇంకేదియు తెలియకుండవచ్చును. ఆత్మావగాహన లేకనే ఈ తృప్తి. ఏమాత్రము తన్ను తా నెఱింగినను, తాను ఘనకార్యము లనుకొనునవి, గర్వకారణములుగా భావించునవి, సారహీనములని ఎఱుంగును. సమగ్రములు కావని, దోషభూయిష్ఠములని భీతిలును. ఇది భగవాను డెన్నికచేసినవారికే పరిమితమైయుండును. ఇతరులకు కాదు.

పూర్ణత్వమును పొందగలవా రీ రెంటిని (నిమ్న, ఉన్నత) మేళవింపగలవారే, ఆ పనికై ఎన్నుకొనబడినవారే. ఇది సర్వసామాన్యము కాదు. ఆధ్యాత్మికదక్షు లీ భువిలో చేసిన ఘనకార్యము లతి అల్పసంఖ్యాకము. అవతారపురుషులు, తాము వచ్చిన దెందులకో ఎఱిగినవారు ఈ రెంటిని సహజముగానే పొంది యుందురు. కాని, వీరు ఘనకార్యములను భువిపై చేయుట అరుదు, వారి కార్యములకు భౌతికవాదుల సమగ్రత లేకపోయినది. అవి సామాన్యప్రజల

కవగాహన గాకయుండెను. అందుచేత నిమ్న సమగ్రత గలవారికే లోకము అగ్రస్థాన మొసగి వారి ననుసరించెను.

నే నెందరినో చూచితిని. ఆధ్యాత్మిక శక్తులు భౌతిక సామర్థ్య మెంతగా పెంచునో చూపదలచినవా రెందరో సంగీతసాహిత్యాదుల ప్రదర్శించిరి. కాని, వారి చేత లంతంతగానే యుండి భౌతికవాదుల అపహాస్యమునకు గురియయ్యెను. దాని హేతువు వారి సామాన్యజీవితమే. భౌతిక శక్తుల నధీనము చేసుకొనక యుంటయే. శక్తి ఆధ్యాత్మికమయ్యును పరికరము శుద్ధిచేయని భౌతికముదే యగుటయే.

శ్రీఅరవిందు లిద్దానిని కూడ బోధింపదలచిరి. భౌతికమును దానికి వీలుగలంత సమగ్ర మొనరింపుము. అంత నది ఆత్మ కుత్తమ పరికరము కాగలదు. మూడు పంక్తుల వరుసగా వ్రాయలేనివారి నెఱుంగుదును, వర్ణక్ర మమో, వ్యాకరణమో, దెబ్బతినును. వారు తన్మయతలో ఎంతో అద్భుతముగ వ్రాసెడివారు, మహాకవి రచనలకు ఈడుకావు కాని వారి సామాన్యస్థితిలో వ్రాయు వాటితో పోల్చిన గొప్పవే యనవచ్చును. వారి ప్రాగల్భ్య మెన్నదగినదే. గాయ కునిలో, కవిలో, అతని పరికరములపై అత్యంతమగు అదుపుగలవాడై యున్న అద్భుతఫలితములను సాధింపగలడు, దానికితోడు ఆధ్యాత్మికత యున్న చెప్పెడిదేమి ! అమృతమే స్రవించు నాతని గానమున, కవిత్వమున.

ఇదియే శ్రీఅరవిందులు మనలను చేయమన్నదానిలోని పరమార్థము.

మీ కాయము, దానిలోనున్న అవకాశములు వెలువరించుటకైన శాస్త్ర సమ్మతమగు శిక్షణ నిచ్చిన, సమగ్ర పరికరముగ మార్చిన, అతిమానసశక్తి దాని లోన ప్రవేశించును. (శతాబ్దముల తరిఫీదు అవసరము.) అంత నది ఆత్మను ప్రకాశింపజేయు యుక్తపరికరమగును.

రెండువైపులనుండియు ప్రారంభింపుడని శ్రీఅరవిందులు సర్వదా హెచ్చ రించుచుండిరి. ఒకదానిలో మునిగి రెండవది విస్మరించవలదు. దివ్యత్వసిద్ధికి

భౌతికముతో ఆధ్యాత్మికతను జోడింపుము. పరిపూర్ణదివ్యడవు కాగోరిన దేహమును విస్మరించకుము—సున్నితపు పనిముట్లు లేక ఎంతటి మేధావియు నేర్పరియు నయినను సమగ్రత సాధింపలేడు.

సంశయము మానవబుద్ధిజాడ్యము. ఇదా, అదా, కాదు ఇదే అనుట, లేక అదేనేమో అనుట. ఏదో ఒకటే చేకొందువు-రెంటిని గొన నుత్సహింపవు. భేదబుద్ధి దీని హేతువు.

దైన్యము రెండవది. అన్నియు నెట్లు తీసికొనుట? ఆ నేర్పు మనిషికి కావలెను. అప్పుడే సంపూర్ణత. ఏకత్వమున సంపూర్ణత, అనేకత్వమున అసంపూర్ణత పొసగును. (శిష్యుల నుద్దేశించి) మీ రేదైన చెప్పెదరా? చెప్పుటకంటె చేయుట మేలు— నే నిపుడు మీ కుత్సాహమిచ్చితిని.



మే 1, 1957

"దేహమునకు సంబంధించిన సకల సమగ్రతలును (సంపూర్ణతలును) మొట్టమొదట సంపాదించిననే ఆధ్యాత్మిక సమగ్రత కవకాశముంటచే, మన ఆశ్రమమున క్రీడలును, వ్యాయామశిక్షణయు ప్రారంభింపబడినవి. ఇది ఆశ్రమమున నివసించు పిల్లలకు అత్యంతముఖ్యము. వీరు ఆధ్యాత్మికగమ్యమునకు కాని, సాధనకుగాని చాలనివారు. మానవపరిధిలో పొందగల దెంతయో కలదు. 'ఉపజ్ఞ' అనునది మానవ పరిధియందలి అభివృద్ధిలో భాగమే. ముఖ్యముగా, మనస్సుకు, ఇచ్ఛాశక్తికి సంబంధించి అది సాధించిన కార్యములు, పరమమునకు సగము దూరము కొనిపోగలవు. భౌతికక్షేత్రమున సహనము, అద్భుత బలప్రదర్శనములు, అలసట ఎఱుగక కార్యము లొనర్చుట, దేహనాశన మొనర్చు జాలు మితిలేని చిత్రవధల లక్ష్యింపకుంట, మొదలగున వెన్నో ఘనవిజయములు చూచుచున్నాము. వీనిని మన ముద్దేశించిన సంపూర్ణ సమగ్రతలో ఒక భాగముగ భావింపవచ్చును.

దేహమును సృష్టించినది జడప్రకృతి యనియు, దేహము జడమనియు చెప్పియుంటిమి. అయిన నది పైకిమాత్రమే జడముగా తోచును. అది ఎఱుకకు గుప్తస్థలము. విశ్వనిర్మాత సృజించిన అద్భుత విశ్వమునకు సాధనము. ఈ అద్భుతసృష్టి అజ్ఞానజనిత మన లేము. అజ్ఞానమున నిహితమైయున్న విశ్వాత్మ దానిని సాధన

ముగా గాని ఆ పని చేసినదనుట తథ్యము. ఈ సత్యము ఊహించుటకు కూడ సాధ్యము కాదు.

('అతిమానసాభివ్యక్తి' సంపుటి 16, పుట 9-11)

మాతా, క్రీడల పోటీలు మన అభివృద్ధికి ముఖ్యమా ?

నైతిక శిక్షణ కోణమునుండి చూచిన అవి ముఖ్యమే. యుక్తభావనతో వానిలో పాల్గొనిన, అహమును నిర్జించుట కవి చక్కని అవకాశమిచ్చును. బల హీనతలు వదలకుండ (రాగద్వేషాదులు) వానిలో ప్రవేశించిన లాభముండదు; కాని, యుక్తభావనతో, ఆటలధ్యానతో, ఫలప్రమేయమేలేక, జయాపజయముల ప్రసక్తియేలేక, యావచ్ఛక్తి ఉపయోగించినను విఫలుడ నైతినను చింతలేక వానిలో పాల్గొనిననే వాస్తవిక లాభము పొందగలము. అసామాన్య శీలనిర్మాణమున కిది దోహదకారి. ఈ ప్రవృత్తి అన్నిపనులకును వర్తించును. పందెములను, పోటీలను పాల్గొనువారు యుక్తభావన కల్గియున్న, వారికి చక్కని శిక్షణ లభించును. నిన్ను తేజపరచిన స్థాయిని పెంచును. నీలోగల అనేక ప్రతిభలు ప్రయత్న రహితములై నిద్రాణములై యుండిపోవుచున్నవి.

క్రీడలొక అవకాశమనియు, పురోభివృద్ధి సాధకములనియు మఱువరాదు. ఆటలలోనే కాక నీ సకలకార్యములందును కాలము వృధా చేయుట కవకాశ మున్నది. విద్యలో కూడ కాలము వృథచేయగలవు. నీ పనిచేయు మనస్తత్వముపై సకల మాధారపడియున్నది, పని ముఖ్యము కాదు,— అది చేయు రీతి ముఖ్యము.

మీ రందరును యోగులై, సాధ్యమగు శ్రద్ధాప్రయత్నములతో చేయగలంత నేర్పుతో, అంతకంత కెక్కుడు ప్రావీణ్యము సంపాదింపవలెనను సంకల్పముతో మీ మీ పను లొనర్చుచున్నచో, పోటీలకూ, బహుమతులకూ, స్తోత్రములకూ, అవసరముండదు. కాని, శ్రీఅరవిందులనినట్లు, పిల్లలు యోగులు కాలేరు.

యోగమునకు సిద్ధపడు కాలమున ఉత్తేజన మవసరము. దాని పరోక్షమున భ్రాంతి కాభివృద్ధి కుంటుపడి అనేకసంవత్సరములు బాల్యమున గడుపవలసివచ్చును. బాల్యాదులు వయసునుబట్టి కాక బుద్ధి వికసమునుబట్టి నిర్ణయించనగును.

గత కరపత్రమున నేను వ్రాసినది చక్కని ఆదర్శమగును. మీరు దానిని చూచితిరో లేదో నాకు తెలియదు. దానిలో నేనిట్లు వ్రాసితిని.

అత్యాశవలదు
ముఖ్యముగ దేనిని నటించకుము
కాని ప్రతి నిమేషము
నీవు కాగలిగినంత కమ్ము (ఏప్రిల్, '57)

పూర్ణజీవితమున కిది జీవగఱ్ఱ. దీనిని గ్రహించువాడే మార్గమున అగ్రగామి. మనోవాక్కాయముల సరళతకై కొంత అంతర్గతపక్వ మవసరము. దీనిని మన కార్యక్రమపట్టికగా ఉంచుకొనవచ్చును.

మీ కంగీకారమగుచో దీనిని నేటి మన ధ్యానవిషయముగా తీసికొందము.

(ధ్యా న ము)

* * *

మే 8, 1957

మాతా, ప్రాణికముగ నాటలలో ఆసక్తి కలవారిని మనలో పెక్కుమందిని చూచుచున్నాము, ఉద్రేకము కల్గించు ఇతర కార్యములలో కూడ పెక్కుర చూచుచున్నాము. కాని, ముఖ్య కార్యములలో, సాధనలలో అట్టివారి సంఖ్య అల్పము. దీని కారణము ?

అసంఖ్యాకులకు ఆసక్తి యిచ్చునది తృప్తి, నిన్ను తీర్చిదిద్దు క్రియలలో క్రీడలందు గల ఉత్తేజనము లేదు. మనిషి కారణవశుడు. సామాన్యులలో బుద్ధియే వారి ఎఱుకకు పరమావధి. బుద్ధియే వారి కార్యకలాపములకు నేత. దీనికి క్రమపద్ధతి, యోచనానుసారముగ పనులు చేయుట స్వాభావికము; మంచి, ప్రయోజనము, జనామోదము లక్ష్యములు. ప్రాణభాగమన్ననో, ఉద్వేగము కలది, క్రొత్తదారుల త్రొక్కుట కుత్సహించునది, దీనికి స్థానముండుటచే క్రీడలు ఆకర్షణీయములు. ముఖ్యముగా పోటీలు, విజయకాంక్షాతురత, ప్రత్యర్థిని ఓడించుట ప్రాణశక్తి చెయిదములు. ఆ ఆకర్షణలు లేనిచో, వానిపై దృష్టి లేకుండును. బుద్ధికి వశుడై నడచుకొనువాడే వీనిని తప్పించుకొనగలడు. కావున జీవితమును హేతుబద్ధ మొనరించుకొనుట వాంఛనీయము. కాని, ఇది సామాన్యముగ అరుదు. క్షణికోద్రేకములను వశపఱచుకొనిన కాని ఏపనియు సమగ్రముగ చేయజాలము. నిగ్రహము లేకున్న, ఎంతటి విశిష్టశిక్షణయు, ఎంత క్రమముగ పొందినను కోరిన ఫల మీయజాలదు, అదుపులో లేని దేహము ఎందుకును కొఱగాదు, మొదటగా దెబ్బతినునది ఆరోగ్యము. దుర్బలు డే యాదర్శమును ఆచరింపజాలడు. దుర్బల కాయమును నిర్బంధించి చేయగల దేదియు లేదు, దానిని మరింత దుర్బల మొనర్చుటయే తప్ప.

జీవితపు ప్రాథమిక సూత్రముల నెఱుంగని వా రెందరో కలరు. ఎదుగుచున్న కొలది, నిప్పు కాల్చుననియు, నీరు ముంచుననియు తప్పక తెలిసికొందురు, ఒకరి సాయము లేకయే. అయినను జీవితమును హేతుబద్ధము, క్రమబద్ధము చేయుట ముఖ్యమనునది అంగీకరింపరు. వారి క్రియాకలాపములు క్షణికోద్రేకములచే ప్రోత్సహింపబడుచుండును. చాలకాలముక్రిత మొక డిచ్చటికి వచ్చెను.

సర్కారు ఉద్యోగమున కొక అభ్యర్థిగ. నా అభిప్రాయ మాశించి ఆతని నా వద్దకు తెచ్చిరి. ఆతడు న న్నాశ్రమసంబంధమగు ప్రశ్న లడిగెను; ఇచ్చటి జీవితవిధాన మడిగెను. సక్రమ జీవితమునకు వలయు శిక్షణగూర్చి ప్రశ్నించెను. అతడు దినమంత నదేపనిగ సిగరెట్లు కాల్చుచుండును, విరామ మేమాత్ర మును లేక. దాని మూలమున అలయుచుండుననియు, ఇంద్రియముల నరికట్ట లేకుంటిననియు కించనొందును.

నే నతనితో నిట్లంటిని : "నీవు మొదట సిగరెట్లు మానుము,— త్రాగుడు కూడ". అత డు నన్ను నమ్మశక్యముతోగాని విభ్రమముతో చూచుచు ఇట్లనెను : "ఈ రెండును వదలిన జీవింప నవసరమే లేదు." నా జబాబు : "నీ వింకను ఆ మజిలీవద్దనే ఉన్నచో. మన సంభాషణ వ్యర్థము".

ఇది సర్వసామాన్యము. వీనికంటె ఎక్కుడు ఆసక్తికరములగున వున్నవి కనుక మన కిది అసంగతముగ తోచును. సామాన్యులకు మాత్ర మిది స్వేచ్ఛా ప్రకటనగ తోచును. వాంఛల దీర్చుకొనుటయే వారి ఏకైక ధ్యేయము; జన్మ సాఫల్యమును వారి కిదియే, ఇది స్వభావమును తిరస్కరించుటయే యగును; వక్రత, వైకల్యము నగును; భౌతికజీవనమున మనఃప్రాణములు కల్పించుకొనుట యగును. అది అనారోగ్యకరమగు ఉత్తేజము— పశువులలోనైన నట్టిది కానము. మానవుని సహజగుణము కంటె పశువులది ఎక్కువ హేతుబద్ధము. నే డది మానవులలో నశించి దాని స్థానము నొక కొఱగాని ఉత్తేజము (వక్రత) ఆక్రమించినది.

వక్రత యొక మానవ వ్యాధి. ఇది పశువులలో చాల అరుదు. మానవ సంపర్కమున కలుషితమయినవి మినహాయించి. ఈ సందర్భమున ఆల్జీరియా అధికారులను గూర్చిన గాథ కలదు. వారికొక పెంపుడు కోతి యుండెను. అది వారితో కలసి భుజించెడిది. ఒకనాటి భోజనసమయమున వారికొక విచిత్ర భావన తోచి కోతికి మద్యమిచ్చిరి. వారు త్రాగుట చూచుచున్నది కావున ఆ కోతి ఆసక్తితో ఓ గ్లాసు త్రాగెను. పిమ్మట అది ఎంతోబాధతో మేజాక్రింద దొర్ల సాగెను. మద్యఫలము దృష్టాంతముగ వారికి చూపినది. చాలా రోజులు

జబ్బుపడెను. కోలుకొనిన కొన్ని రోజులకు వారు దానిని తమతో భుజింపనిచ్చి, దాని ముందర ఒక గ్లాసు మద్యము నుంచిరి. అది కుపితయై తన కిచ్చినవాని నెత్తిపై మద్యముతో నిండిన గ్లాసు విసరెను. అట్లు చేయుటలో తన ఉత్తమ బుద్ధిని నిరూపించుకొనెను.

పటిష్ఠ జీవనమునకును, దేహమీయగలదాని నంతయు రాబట్టుటకును బుద్ధి దేహాధినేతగా నుండుట ముఖ్యమని బాల్యమునుండియు తెలుసుకొనుట శ్రేయస్కరము. ఇదొక యోగక్రియ కాదు, ఏ యున్నతానుభూతియు కాదు. ఇది ఇంటిలో, బడిలో సర్వత్ర నేర్వవలసినది. మనిషి మనిషిగా నుండుటకే ఇది అవసరము. ఉత్తేజమునకు లోనుగాక బుద్ధిగమ్యుడై యుండుట బాల్యము నుండియు నేర్వదగినది. ఇది నేర్వనివాడు పశువు, అంతేకాదు, పశువుకంటె హీనుడు. పశువులకు మనోబుద్ధు లంతగా లేవు. అవి స్వాభావికమగు జాతి ధర్మముల క్రమము తప్పక పాలించును. ఎఱుగకుండనే అవి తమకు శ్రేయోదాయకమగు వానిని చేయును. జాతికి జాతికి ఇది వేరైనను, ఏ జాతి ఆ జాతి ధర్మమును విధిగ పాలించును. మనిషి సంపర్కమున చెడినవాని గూర్చి చెప్పియుంటిని, జాతుల మధ్య కలహములు సంభవమైనను ఎట్టి అత్యాచారములకును దిగబోవు. మనోబుద్ధులుగల మానవుడే అత్యాచారములకు దిగును, — ఏ అవసరము, నిర్బంధము లేకయే. ప్రకృతిపురోగమనమున నిదియొక వైకల్యము, కాబట్టి యుక్తవయస్సునందే ప్రతి మనిషి మొదటగా నేర్వవలసినది బుద్ధికి వశుడై యుండుట. ఇది సహజధర్మముకంటె ఉత్తమము — సహజధర్మమును బుద్ధికి అధీనము చేయుట వలయును. నేనిట యోగమును గాని, ఆధ్యాత్మికతనుగాని చెప్పుట లేదు. ఇది మానవుని సక్రమ జీవితమునకు సంబంధించినది. బుద్ధిని కాలదన్నువాడు పశువు; కాదు— అంతకంటెను నికృష్టుడు. కావున, పిల్లలకీయవలసిన ప్రాథమిక శిక్షణ వారిని బుద్ధిజీవుల నొనర్చుటకే. అంత దివ్యేచ్ఛ అవతరించి మానవజీవితమును ప్రభావిత మొనర్చగలదు.

• • •

మే 15, 1957

మాతా, సృష్ట్యాదినుండి మగ ఆడ భేదమేల ?

ఏ సృష్ట్యాదినుండి ? వత్సా, ఏ సృష్టినిగూర్చి మాట్లాడుచుంటివి ? ఈ భూమిని గూర్చియా ?

అవును.

ఇది పూర్తినిజము కాదు. ఈ భేదములేని జాతులున్నవి— ఆదిలో ఈ భేదము లేదు. ఇక భూలోకసృష్టి భౌతికము విశ్వసృష్టియొక్క వికారము, ఈ భేదము సృష్టికి ప్రాతిపదిక కానేకాదు. నీ ప్రశ్న నిలువదు, అది తప్పు.

అయినచో నిది ఈ భౌతికసృష్టిలో ఎందుకు ?

ఆదినుండియు నిట్లులేదని చెప్పితిని కదా. జంతుశాస్త్రజ్ఞు లీ భేదములేని జాతులున్నట్లు చెప్పుదురు. ఈ విధాన మారంభించినది ప్రకృతి. అది అనేక ప్రయోగముల జేసిచూపినది. చేయగల విభిన్నజాతుల జేసినది. చేసినవానిలో ఎన్నో మార్పులను, మేళవింపులను జేసినది. ఈ భేదము ప్రయోజనకారియని తలచి కల్పించినదేమో. దీనినిగూర్చి స్పష్టముగా నేనేమియు చెప్పలేను.

కాని. ఇతర భూమికలలో, ఈ భూలోకమున సైతము. సూక్ష్మతర అన్న, ప్రాణ, మనోమయ భూమికలందు గూడ, ఈ ద్వివిధమును (ఆడ, మగ) జీవులున్నారు. ఇట్టి విభజన లేని జీవములుగూడ నున్నవి. ప్రాణమయ ప్రపంచమున నీ విభజన మిక్కిలి యలిది. దేవతా ప్రపంచమున మనుజులచే చెప్పబడిన విధానము మానవభావనాప్రాదుర్భావమని నా అనుమానము. అయినను ఈ భేద మెఱుంగని దేవత లెందరో కలరు. పురాణగాథ లన్నియు (ఏ దేశము నకు చెందిన వైనను) మానవభావనచే ప్రాభావితమైనవే. ప్రకృతియొక్క ఉద్దేశ్య నిర్వహణకు సంబంధించిన భేదమే ఇది. అట్లు భావించుటయే సబబు. ఈ

భేదము శాశ్వతము కాదు. ముమ్మాటికిని కాదు. ఇది తాత్కాలికము; ఉద్దేశ్యము నెరవేరినంతనే నశించునది.

ఈ అల్పవిషయమును కొండంత చేయువారెందరో కలరు. వారికి ప్రియమగుటను దానిని విశ్వసింతురు. కాని అది తాత్కాలికము; సౌధనిర్మాణ సమయమున నెలకొల్పు పరంజావంటిది మాత్రమే. ఒక ప్రయోజనమునకై తేబడినది.- ప్రయోజనము తీరగనే పోవునది. అది ప్రాజ్ఞుని (అధిమానసుని) ప్రక్రియయేమో! —కానోపు. దీని నంగీకరించువారి నట్లు వదలుడు. ప్రతిదానికిని ఏదో కొంత గుణముండనేయుండును.

మాతా, ప్రాణప్రపంచశక్తు లీస్థితి నేల తప్పించుకొన్నవి ?

ఏమిటీ!

ప్రాణప్రపంచమున నీ భేద ముండదంటిరిగా—

ఉండదనలేదు. అది సర్వసామాన్యము కాదనియు, లింగభేద మెఱుంగని ప్రాణుల చూడగలమనియు అంటిని. భూలోక ప్రభావముచేతనే ఈ భేదము ప్రాణప్రపంచమున కల్గనోపు.

ఈ ప్రశ్నలకు కారణమును తెలియగోరుచున్నాను. అడుగుటలో మీ యుద్దేశ్యము ? సృష్ట్యాదినుండియు ఈ భేదమున్నదని మీ కెవరు చెప్పిరి?

ఇట్లుండుట సబబని నమ్మువారా? నే నింకొకసారి హెచ్చరించుచున్నాను. అట్టివారి జోలి పోకుడు. వారి గాలిమేడలలో వారి నుండనిండు. వారి హాయిని కదపకుడు.

"మనస్సులో మన మూహించు వానికంటె ఉన్నత భూమిక లున్నవి. ఎప్పటికైన మనము వాని నందుకొన వలెను; అంతేకాదు, వానిని దాటి పరమమగు ఆధ్యాత్మిక శిఖరము లందుకొనవలెను మనము పైకిపోవుచు అపర భాగమున వానికి ప్రవేశమీయవలెను. మేలుతరమైన తేజశ్శక్తులతో దానిని నింపవలెను. ఈ దేహమును అంత కంత కెక్కుడు ఎఱుకగల కోశముగను, పరికరముగను, ఆత్మదగు పరిజ్ఞాన శక్తిగ మార్చవలెను. క్రమాభివృద్ధి పూర్వకముగ ఆత్మయొక్క క్రియాశీలత్వమును, ఆధి పత్యమును పెంచవలెను. జీవి పరివర్తనము వీని ముఖమున గుప్తముగ సాగుచున్నది. ఈ పరివర్త నము పొసగనిదే ఇహమున నిండు దివ్యజీవనము సంభ వము కాదు ఈ పరివర్తన కార్యమున దేహ మొక భాగ స్వామి. దేహసహకారము నామమాత్రమే యయినను ఆత్మ అభివ్యక్తిని సాధింపగలదు. కాని, అది సమ గ్రము కాబోదు. దేహమున ఎఱుక పెరుగు కొలదియు ఈ అభివ్యక్తి అంతకంత కెక్కుడు సంపూర్ణము కాగలదు. దీనికై ఆత్మయొక్క పరమ తేజశ్శక్తులును, సృజనాత్మకానందమును జీవచైతన్య శిఖరమున నభి వ్యక్తమై వాని ఆజ్ఞలు దేహమున కందింపబడుటయు, దేహము వానిని శిరసావహించుటయు జరుగవలెను.

('అతిమానసాభివ్యక్తి' సంపుటి 16, పుట 15-16)

మాతా, మనఃప్రాణపరివర్తనము తదుపరి దేహపరివర్తనమూ, లేక అది తనకుతానై (యథోచితముగ) పొనగునా ?

సామాన్యముగ నిది అవరోహణక్రమముననే జరుగును. ఆరోహణక్రమమున కాదు.

నీవు భౌతికవాది వగుచో, నవ్యశక్తు లారోహణక్రమముననే యనగలవు. ఇది పూర్తిగ నవ్యము కాదు. ఈ పద్ధతి నవి తు-చ-తప్పక జరుగవు. మనస్సు పరివర్తన చెందకముందు దేహము పరివర్తన జెందనేరదు. పణమొడ్డెదను దీనిపై. ఏదీ. చూచెదను. ప్రయత్నింపుము.

నీ వొక వేలు కదపలేవు; ఒక మాట పల్కలేవు; ఒక అడుగు వేయలేవు- మనస్సు సహకరించనిదే. మనస్సు మారనిదే ఏ సాధనములును దేహమును పరివర్తన మొనర్పజాలవు. నీ మనస్సజ్ఞానమున నున్నది. దేహపరివర్తన నెట్లాశించెదవు ?

ఒకప్పుడు దేహమున హెచ్చుగు అవరోధము కల్గును. దీనికి మనస్సు కారణము కాదు. ఇది భౌతికావరోధము, అత్యధికావరోధము భౌతికముననే కలుగుచున్నది. ఈ అత్యధికావరోధము ఎచట నున్నది ?

నీ తలకాయలో। (నవ్వు) ఇది దైహిక మనస్సుకు సంబంధించినది. తన శక్తిలో దాని కత్యంత విశ్వాసముండుటవలనను, తన క్రియా విధానముతే శ్రేష్ఠమని భావించుటవలనను, ఇంకే అన్యనేతృత్వమునది సహించదు. అజ్ఞానములో మునిగి తాను సుజ్ఞానినని భావించుకొనును.

మంచిది. ఇంక నధికమేమియును చెప్పను.

దానికి మందు ?

ఓ: ఓ: (దీర్ఘమౌనము) అదుగో, అదియే మందు.

* * *

మే 29, 1957

"మేము ప్రతిపాదించునది దివ్యదేహమున దివ్యజీవనము. భువిపై ఈ పరిణామక్రియ మందకొడిగాను, అలసత్వముతోను సాగుచున్నది. దేని ప్రవేశమున నిది శీఘ్రగతిని సాగును ?

"మన పరిణామఫలితముగనే ఇది సాధ్యము. ప్రకృతి భౌతిక పదార్థమును దాటి ప్రాణమును వెలయించినది. ప్రాణమును దాటి మనస్సును వెలయించినది. అది మనస్సును దాటి మానవుని వాస్తవికస్థితిని వెలయించు అతిమానస చేతనను వెలయింపవలసి యున్నది. ఆత్మ యొక్క శక్తియు, సమగ్రతయు పెఱుగవలెను, దీనిలో మందకొడి, అలసత్వము పనికిరావు. అయినను మనస్సు

నధిగమించి సత్యమును చేరిన, అదియే, దాని ఆధ్యాత్మిక శక్తియే పురోగతి క్రమమును నిర్ణయింపగలదు.

"అంచీలలో పరిణతి సంభవమే కావచ్చును. మానసిక క్షేత్రమునకు ప్రకృతిశక్తులు కొన్ని యున్నవి. వానికి దినదినాభివృద్ధి నొందుచున్న విజ్ఞాన శక్తిసామర్థ్యము లున్నవి. అవి దివ్యతేజశ్శక్తుల పాల్గొనగలవి. ఈ భూమికల ననుసరించి పై కెక్కుట, మనః కోశములోని కవిటగుట సహజపరిణామముగ తోపవచ్చును, అయినను ఈ మధ్య భూమికలు సంపూర్ణపరిణామము సాధింపజాలవు. అవి మనస్సునుండి ప్రాదుర్భవించుట నవి పూర్తిగ అతిమానసికము కావు. మనస్సున కవి పాక్షిక దివ్యత్వమే ఆపాదింపగలవు; లేక, మనస్సు నా వైపు మరలింపగలవు మాత్రమే. కాని పూర్తిగ ఆనందమానసమున (అతిమానస విజ్ఞానమున) చేర్చనేరవు. ఏమైన నవి మజిలీలు. వానిలో కొన్ని ఎక్కి అట ఆగిపోవుట తటస్థించును. అతిమానసస్థాయికి ప్రజాసమూహము ఉమ్మడిగ చేరుదురన్న అడియాసకు తావులేదు. అది ఒక్కొక్కరే ఎవరికివారు సాధింపవలెను.

(అతిమానసాభివ్యక్తి. సం 16-పు. 20-22)

నేటి సాయంత్ర మీ క్రమాభివృద్ధి (మజిలీలలో) గురించియే ప్రసంగించెదను. నన్నీప్రశ్న తఱచుగా అడుగుచుందురు: "మన నిజస్వరూపమును, విశ్వపు నిజస్థితిని గ్రహించుటకు ఫలవంతమగు పరికరముగా దేహమును గుర్తింపవలెనను నొక ఆదేశసూత్రము నిచ్చి, పొందవలసిన దదియే యని బోధించిచూపి, ఏ కారణమున ఆశ్రమవ్యవస్థలో వైద్యులు, ఔషధాలయములు, ఆధునిక పద్ధతులలో వ్యాయామ శిక్షణాగారములు ఇంకను ఉండునట్లుచేసినారు ? వనసంతర్పణల కేగిన

వేళ ఏ పీటినైనను (అచ్చట లభించునది) త్రాగనీయరేల? కాచి వడబోసి చల్లార్చిన నీటినేల వెంటగొనిపొమ్మందురు?"

ఇదంతయు నెంతో విపరీతముగ తోచును. దీనిని తొలగించుటకై (తొల గింపగలనని ఆశించుచున్నాను) నా ప్రసంగ మీ సాయంత్రము వినియోగించుచు న్నాను. ఈ విషయ మెన్నో పర్యాయములు వివరించియుంటిని. రెండు వ్యవ హార సూత్రము లొకదానికొకటి విరుద్ధముగ తోచినచో, గాఢముగ యోచించి వానిని సమన్వయము చేయుట అవసరమని నేను మీకు పదేపదే చెప్పియుంటిని. ఇది విజ్ఞతాలక్షణము.

మన మిట నొకటి గుర్తించుట భావ్యమనుకొందును. మన దేహారోగ్యము నకును, దాని సంరక్షణకును దానిని గూర్చిన మన విజ్ఞానము ముఖ్యము. ఈ విజ్ఞానము దానిని స్వస్థతగనుంచి దానినుండి రాగలదంతయు రాబట్టగలదు.

నీ దృష్టి భౌతిక పరిధుల దాటకున్న, నీ తలపులు ప్రాకృతికము లయి యున్న, నీ దేహవ్యవహారములకు నీవు భౌతికవిధానములనే వాడవలసియున్నది. మానవజాతి తన యుగముల మనికిలో వీనినే వాడుచు వచ్చినది. ఈ శాస్త్రి విధాన మతిజటిలము; క్రియావిధానము లసంఖ్యాకములు, సంశయాత్మకములు, పరస్పర విరుద్ధములు. అభివృద్ధిదోహదములే కాని సాపేక్షములు. అయినప్పటికిని నిర్దిష్ట ఫలితములే యొసగినవి. భౌతిక శాస్త్రజ్ఞానము పెరిగినకొలదియు, ఆహార పద్ధతులు, శ్రామికవిధానములు....జీవితము యొక్క సమస్త బాహ్య సంస్థాపన లన్నియు పునర్వ్యవస్థీకరింపబడినవి. ఈ పరిశోధనా ఫలితముల క్రమము తప్పక పాటించువారు బలారోగ్యములు కల్గి, తమ సామాన్య స్థితిని మెరుగుపఱచుకొని, ఒకొక్కప్పుడు అద్భుతఫలితములు సాధించుట కనువైన విసులుబాటు సంపాదింప గల్గిరి.

ఇంకను, ఈ బుద్ధిగతశాస్త్రము లీ శ్రద్ధాయుత ప్రయత్నములద్వారా, అంతకంత కాశ్చర్యకరమగు ఆత్మతత్త్వ సత్యమునకు దగ్గరవుచున్నది. క్రమ ముగా మున్ముందు బ్రహ్మము నర్థము చేసుకొను సమయము రాగలదు. ఇట్టి

సందర్భములో అన్నమయకోశజీవులకు, భౌతికపు టెఱుకలో నున్నవారికి దేహ సంబంధములగు భౌతికవిధానములను వాడవలసి యుండును. బహుళ సంఖ్యాకులు (ఆశ్రమమున నున్నవారు సహితము) పూర్తిగా దైహికము కాకున్నను, అధిక శాతము దైహిక జీవులు కనుక, దేహరక్షణకై భౌతికశాస్త్రమార్గముల వలంబించుట సహజమే.

ఇక శ్రీఅరవిందుల బోధప్రకార మిది అంతిమానుభూతి కాదు, మనము చేరదలచిన ఆదర్శమును కాదు. దీనికంటె శ్రేష్ఠమగునదున్నది. అందు ఎఱుక పూర్తిగనో, పాక్షికముగనో, మానసికముగ వ్యవహరించుచుండియు, సర్వదా ఆధ్యాత్మికపు గాలులచే ఊర్ధ్వపథముల కెగయుచు అతిమానస శక్తుల ప్రాబల్యమునకు వశమగుటకు సిద్ధపడును.

అంత సాధకుడు భౌతిక సంబంధులగు ప్రాణ మనో బుద్ధి జీవనము నధిగమించి, పైకి సామాన్యమానవునివలె తోచుచున్నను వాస్తవమునకు అతిమానస శక్తుల కున్ముఖుడై యొక మధ్యంతర స్థలము చేరును. ఇచట అతిమానస, అధిమానసశక్తులు మేళవించును. ఇచటి ఎఱుక కింకను బుద్ధివాసన పూర్తిగ తొలగియుండదు. కాని, అది యుక్తబలము పొందినదగుట బ్రహ్మము నెఱుంగు సాధనము కాగలదు.

నేడీ అతిమానస స్థితి ప్రపంచమున పొడచూపుచున్నది. అందులకు సిద్ధముగ నున్నవారు దానిని పొందగలరు. దానిమూలమున దేహమున కపూర్వశక్తి లాభము కల్గును. ఆత్మస్వరూప దర్శనము కాగలదు. మనిషి యోగక్షేమములా శక్తియే చూచుకొనగలదు. దానిని కోరి, దానికై శ్రమించువారీ స్థాయిని తప్పక పొందెదరు.

దీనికంటె ఉన్నతస్థితి యున్నది—— దివ్యదేహమున దివ్యజీవనము చేయు స్థితి. అది బహుకాలప్రయత్న సాధ్యము—— క్షణములో సాధింపరానిది. ఈ పూర్ణపరిణతి సిద్ధించినచో యోచన కవసరముండదు; కార్యములన్నియు తమకు తామై జరిగిపోవును. కేవలము బ్రహ్మానుభూతిస్థితి యిది. మనము ముందుం

చుకొనదగు ఆదర్శమిదియే. దానిని పొందుటకే మన శక్తిసామర్థ్యముల నన్నిటి నుపయోగించుకొనవలెను. కాని అది తేలికగ, శ్రమలేక, శీఘ్రముగ లభించునని ఆశించుట శుద్ధ వెఱ్ఱితనమే యగును.

ఏమైనను ఈ స్థితి చేకూరుట నిశ్చయము. ఎన్నడో సుదూర భవిష్యత్తున ఘటిల్లుట కాదు, ప్రస్తుత మది నిర్మాణదశలోనే యున్నది. దాని చిన్నె లనుభూత మగుచున్నవి కూడ. పరమసత్యమును మనలోని అంతరాత్మ అనుభూత మొనర్చుకొన్న రీతిగనే దేహము సైతము సమగ్రముగ అనుభూత మొనర్చుకొని, స్వీయ చేతనతోనే తత్సమక్షమున నిలిచి, అణువణువునను పరిపూర్ణ ఆత్మ సమర్పణభావముతో, అంతశ్శుద్ధితో, అఖండముగా, నిత్యముగా, అతి సరళముగా, అదియే తానై పోగలుగునట్టి స్థితి అది.

* * *

"మీ కేమైన ప్రశ్నలున్నవా? లేవా?"

కరుణామయీ, మాతా, ధారాళముగ రాని ప్రశ్నలు అడుగవచ్చునా?

ధారాళముగ రాని ప్రశ్న యన?

పఠన సమయమున మే మడుగనిదే మీ రేమియు చెప్పరని, మా తలంపు, కావున విధిగ ప్రశ్నలకొరకు తడవుకొందుము ఏవో ప్రశ్న లడుగవలెకదా?

నా జబాబు నీ ప్రశ్నపై ఆధారపడియుండును. ప్రశ్న మంచిదయిన .... ప్రయత్నఫలితమగు ప్రశ్న పెద్దప్రశ్న కానక్కరలేదు. ఇట్టి ప్రశ్న ఏదైన కలదా ?

లేదు.

అయిన—

(దీర్ఘ మౌనము)

నిజముగా శ్రీఅరవిందుల రచనలు శ్రద్ధగా పఠించిన, వారి రచన లన్నిటిని చదివిన, అన్ని ప్రశ్నలకును జబాబు లందు లభించును. కాని, కొన్ని సమయములు, భాషాపద్ధతులు కలవు. అప్పుడా భావములు మనస్సున గాఢముగ నాటుకొని ఆధ్యాత్మికాభివృద్ధి కెంతయు దోహదమగును. చెప్పునది ఫలప్రదము కావలెననిన నది హృదయాంతరాళముననుండి ఉబికివచ్చు సద్యోనుభూతి అయి యుండవలెను. ఇదివరలో చెప్పినవే ప్రాతపద్ధతినే మరల చెప్పిన నది యొక బోధ యగును— నీతి బోధక వాచాలత్వ మనదగును, అది మెదడులోని కొన్ని అరలను కదిలించును; అంత లాభదాయకము కాదు.

నాకు మౌనక్రియ సదా ఎక్కువ ప్రాముఖ్యము కలది. కార్యకారకత్వము మాటలకే పరిమితము కాబోదు. మౌన మెంతో మెలకువతో ఎరుక కనుకూల మగు రీతిని ప్రవేశించును. కావున దాని ఫలిత మత్యంత ప్రబలము. మౌనమున స్పందన జనించును. ఇది ఉద్దేశ్యము, లేక కోరిన ఫలితము ననుసరించి యుండును. ఎరుకలో వాని కత్యంతోపయోగ కరమగు రూపముగ మారును. మాటలలో భావప్రకటన అంత నిర్దుష్టమగు స్పందనముల కల్గించి సంపూర్ణముగ వినువా డర్థము చేసికొనుట అతికష్టము. అందులకే ఒకే భాషణ పల్వురలో పలు భావముల కల్గించి భిన్నార్థములకు తావొసగును. సర్వులును 'వాగ్విదాంవరులు' కాలేరు. తలంపుల అర్థము మాటలలో తబ్బిబ్బవుట, లేక అసంపూర్ణము.

సందిగ్ధము అగుట సంభవించును. వ్యక్తుల అవగాహనశక్తిలో తారతమ్యము ఉండుటయు దీని కొక కారణము. మాటల కొఱతయు నొక హేతువే.

కావున. అనుభూతి లేకున్నచో, ప్రశ్న ప్రశ్నకొఱకు అడుగుటకంటె మౌనము వహించుట యుక్తము అని నేను భావింతును. ప్రశ్న సజీవమయిననే సజీవబోధ కవకాశముండును. అది అనుభవైకవేద్య మగును. సజీవమగుట కది నీ అభివృద్ధికి అవసరమయి యుండవలెను. అత్యంతమును వాంఛనీయమై, నీవు సాధింప ప్రయత్నించు సమస్య కుపయోగించునదైనచో నీ ప్రశ్న ఆసక్తి కరమై, నీ అంతరంగవు వెలుక నుజ్జ్వలమొనరించునదై, నీ క్రియావిధానము ప్రభావితమగుట కుపకరించును.

అది లేకున్న కొంతకాలము ధ్యానములో నున్న ఎక్కువ శ్రేయమని తలంచెదను. మన పఠనధ్యేయము తలంపుల వ్యవస్థీకరించి, పఠించినది ఎక్కువ అవగాహనమగుట కావున ధ్యానమున కదియే (పఠించిన భాగమే) విషయముగ నెన్నబడినది.

మాట్లాడుట మాట్లాడుటకొఱకైన అది వృథా కాలయాపనమగును. దానికి బడులున్నవి. ఈ స్థలమందుకుకాదు.

మాతా, మీ ప్రసంగమట్టిది కాదు——

(మౌనము)

(మఱొక ఛాత్రుడు) మాతా, మీరు మాట్లాడు వేళ మేము మీ భాషణములను మనస్సుతో గ్రహించుటకు ప్రయత్నింతుము. మౌనభాషణ మొనర్చుచో మే మే చక్రమున తలపుల నిల్పవలెను. ?

ధ్యానమున కన్నియు తగినవే. ధ్యానమున తలపుల దొరలించుట కాదు. ఒక చక్రమున కేంద్రీకరించుట శ్రేయము. అది నీవు ఆకాంక్షించు చక్రము కావగును. ఆకాంక్షాజ్యోతి వెలుగుచోట నీ శక్తులనన్నిటిని చేర్చి-అనాహతచక్రమున —అత్యంతసూక్ష్మనాదము వినగోరునట్లు సంపూర్ణమౌనము పూనుము. అచలుడవును, స్థిరుడవును కమ్ము. స్థాణుడవై ఏభావమును లేకయుండుము. ఏ ఆసయు లేక, దేనిని కాంక్షింపక, ఉదాసీనత వహింపుము. దీనిలో ఏమాత్రము సడలినను నీ ధ్యానము ఫలప్రదము కాబోదు.

దీనిని చేయగల్గిన, చివరకు, నీవు ధ్యానమును ముగించి బయటకు వచ్చిన కొంత సమయమునకు నీలో ఒక నూతనమగు ఎఱుక ప్రవేశించినట్లు, నీ అవగాహన సామర్థ్యము పెరుగును; విషయములను విశిష్టదృక్పథమున చూడగలవు; నీకు నవ్యజీవన మారంభమగును—ఈ మార్పు నీకు తెలియకుండనే నీలో కల్గును. నూతనోత్సాహము నీలో పులకరించును. నీ వద్దాని నిజస్వభావమును తెలుసుకొనలేకపోవచ్చును. అయినను నీ యింద్రియములు నీ అధీనమున నుంటకు ఏ సంకోచమును లేక అంగీకరించును. నీ నడవడి ఉదాత్తమగును. నీ స్వభావము పూర్తిపరివర్తన చెందును.

ఇట్టి మార్పు శీఘ్రముగ వచ్చునది కాదు. ప్రయత్నము దీని కవరోధము. సాయకారి కాదు. అచలుడవుగ, స్థిరుడవుగ, ఉదాసీనుడవుగ, స్థాణువుగ, నిర్లిప్తుడవుగ, కాంక్షారహితుడవుగ, మౌనాకాంక్షయే ప్రాతిపదికగ నుండుము. ఈ ఆకాంక్ష భాషకందనిది, భావమున కందనిది కావలెను. ఊర్ధ్వమున కెగయు జ్వాలవలె ఉండవలెను. రూపొందిన అవగాహనప్రయత్నము కాకూడదు.

ఈ స్థితి సిద్ధించుట కెక్కువ కాలము సన్నాహమందే వ్యయమగును. ధ్యాన మగుసరికి ఈ స్థితిని సెకనులలో పొందగల్గి యుండవలెను. ఇదే తాదాత్మ్యస్థితి—యద్భావం తద్భవతి—దీనిని కలవాడు ధ్యానకాలమంతయు స్వీకరించుటలోనే గడపును. పరమాత్మ ఆదేశములు ప్రత్యక్షముగ వినగలడు. వాడే గీతలలో చెప్పిన నిమిత్తమాత్రుడు.

ఈ స్థితిని మించిన స్థితులున్నవి. అవి తర్వాత రాగలవి.... దీనిని సంపాదించిన ధ్యానలాభము పొందగలవు.

ప్రయత్నించుము.

( ధ్యానము )

* * *

జూన్ 12, 1957

దీర్ఘకాల ముపవసించుచున్నను దేహ, ప్రాణ, మనశ్శక్తులను యథాతథముగ నుంచుట సాధ్యమే. మెలకువగా నుండియు యోగస్థుడై యుండుటయు, రాత్రింబవళ్ళు రచనా నిమగ్నుడై యుండుటయు సాధ్యమే యగును. బలము కోల్పోక, ఆయాస మేమియు లేక, ఏ ఇతర క్షతియు లేక, ఉపవాసానంతరము వైద్యులు విధించెడి ఏ జాగ్రతలు, క్రమములు లేక, మామూలుగనో లేక అంత కధికముగనో తినగల్గుట కూడ సాధ్యమే — ఈ సమార్పు యోగక్రియాశక్తుల కుపకరణముగ మారిన దేహమునకు సాధ్యము. అయినను, దేహము కృశించుట తథ్యము. వ్యవహార యోగ్యమగు పద్ధతి యొకటి లభించిన దీని నధిగమింపనగును. అంత దేహమున నే కృశత్వము

లేక యుండనగును. ఇది ఎట్లు సాధ్యము? దేహము తన కవశ్యమగు శక్తుల ప్రకృతినుండి గ్రహించి, ప్రకృతికి దాని కక్కఱయగు తన శక్తుల నిచ్చుట మూలముననిది సాధ్య పడగలదు. పరిణామ శిఖరమును పునర్వ్యవస్థీకరింప వచ్చును — పరిణామపుటాదిలో పరిసరముల నుండి వలయునది గ్రహించి కానిది త్యజించు విధానము పరిణామపు చివరను కూడ అనుష్ఠింపనగును. తన పుష్టికై, పునరుజ్జీవనమునకై — ఈ మహత్తర శక్తులను ఉన్నత భూమికలనుండి క్రిందికి దప్పించుకొన వచ్చును.

( 'అతిమానసాభివ్యక్తి' — సంపుటి 16, పుట 28, 29 )

శ్రీఅరవిందుల ఈ అభివర్ణన వారి స్వకీయానుభవ వర్ణనయే. ఆయన చేయగలదానిని గాక చేసినదే చెప్పుచున్నారు. అది సుళువుగ అనుష్ఠింపగలనని ఎవరైన భావించిన అది పెట్టితనమే యగును. తన ఇచ్ఛాశక్తి నుపయోగించి చేసినను, ఆధ్యాత్మిక దృష్టినుండి చూచిన నిరుపయోగమే యగును. అనుభవము నకు పూర్వము ఎఱుకలో సంపూర్ణమగు మార్పు కల్గుట అవసరము. అదియే ముక్తికి నాంది.

తిండి మానినంతనే ఆధ్యాత్మికాభివృద్ధి కాబోదు. దానికి సంబంధించిన సకలానుబంధములు, వాంఛలు, రీతులు, వదలి పెట్టుటయేకాక, ఏ అక్కఱయు లేక, వాని ధ్యాసయే లేక, వాని కేరూపమునకూడ స్థానమే లేక యుండు ఒకా నొక స్థితి యది. ఆ స్థితి నందిన క్షణమున తిండిమానుట నీ స్వభావమగును. తిండి స్మృతియే నశించును. సకలచైతన్యములు, సకలశక్తులు అధికవాస్తవి కాంతరానుభూతివైపుగా మళ్ళింపబడియుండును. నిరాకరింపరాని దివ్యశక్తుల స్పందనముతో దేహమందలి అణువణువును నిండి అతిమానస శక్తితో సత్యజీవ నమునకై కలియుట కుద్యుక్తమగును. జీవితధ్యేయము తిరుగులేని సంతోషమే యగును.

అది సిద్ధించినవేళ, తినుట, తినకుంట; నిద్రించుట, నిద్రించకుంట; అప్రధాన మగును. ఇవి విశ్వశక్తుల ఆట కధీనమగు బాహ్యాలయలు; సత్యముతో కలిపి సంతోషమున తేలువానికి ఆకలిదప్పుల ప్రసక్తి కల్గబోదు. దొరకిన తినును, లేకున్న మానును. వానిని గూర్చి యోచింపబోడు. ఆందోళన అంతకంటె పొందడు. అన్నివిషయములను నిర్లిప్తుడుగ నుండును. భగవానుని పెంపుడు బిడ్డవలె సర్వదా హాయి ననుభవించును. సకలము ఆతని కనుకూలించును. పూవు వికసించువిధమున నతని భావనలు క్రియాకలాప సౌరభముల దిశల వ్యాపింప జేసి. ప్రపంచమునకు శ్రేయమాపాదించును. ప్రకృతితో చేతులు కలిపి దాని వైపరీత్యముల నక్రమపఱచుచు ప్రపంచమును పరపదప్రాప్తి దిశగా సహజముగ పరివర్తన చెందించును. తనకే ప్రత్యేక మహత్వమును, గణింపును కోరక, సామాన్యులలో అతి సామాన్యుడుగ నుండుచు, అదే సమయమున వారికి మకుటాయమానుడై శోభించును.

సర్వసంగపరిత్యాగియై, ఏ కొఱతయు లేకయుండు స్థితి కలదు. అందున్న వాని కన్నియు లభ్యమై, సకలమును చేయగలడు. ఆతని సుజ్ఞానము నేదియు కళంక మొనర్పజాలదు. ప్రాపంచిక జీవి వాంఛల దవిలి సుఖదుఃఖాది ద్వంద్వముల దొర్లింపబడుచుండును, ఇది మానసముచే ప్రాభావితమయినది. పశుప్రవృత్తి కంటె కొంత మెఱుగే. అయినను అంతర్గతజీవి యగుచు, బాహ్యప్రపంచము నెడ నిరీహుడై యున్నవాడు ద్వంద్వాతీతుడై భవ్యపదమార్గమున ముందడుగు వేయువాడగును. వానిని మోక్షకాంత తనకుతానై లభించును.

అత్యంతఫలప్రదమగునది అతిమానస శక్తుల స్పందనమున చరించు ఎఱుక. అది కల్గినవానికి అపజయశంక లవంతయు నుండదు. ఏ తీరని అవసరము నుండదు. విభుని క్రీడలలో తానొక క్రీడాకారుడగుటచే నలయునది సకలము సంకల్ప మాత్రమున నగుచుండును. దేనికిని యోచన కాని, దీర్ఘకాలిక సంవిధానము కాని అవసరముండదు. ఎంతటి కష్టకార్యమయినను, ఎంతటి మానవాతీతకార్యమయినను అతిమానసపు శక్తితో అతితేలిక, సామాన్యము అగు కార్యము వలె తృటిలో చేయుచుండును. ఈ స్థితి అవర్ణనీయము, అనూహ్యము, అద్భుతము.

ఇదే ఋజుత్వ స్థితి—— మేలిమి బంగారువన్నె పూర్ణసత్య జీవనస్థితి. దీనిని పొందినవానికి జీవితమొక సుఖాంతనాటకము, పరమాత్మలీల. అందు తానొక పాత్రధారిమాత్రమే——పరమాత్మయే నాట్యాచార్యుడు, దర్శకుడు, సకలమునకును ప్రభువు, ద్రష్ట, దృశ్యము.

* * *

జూన్ 19, 1957

కరుణామయీ, మాతా, రోగము భౌతికఘటనయా,
లేక ఆతని ఆధ్యాత్మిక జీవనమున నొక అరిష్టమా ?

అది వ్యక్తిగతము. యోగాభ్యాసకు డైనచో అది నిశ్చయముగా ఆధ్యాత్మికారిష్టమే. యోగాభ్యాసకుడు కాకున్న, సామాన్యజీవియయిన నది సామాన్యముగ నొక ఆకస్మిక సంఘటన. మనిషికి మనిషికి భిన్నము. బాహ్యమున కొకే మాదిరిగా తోచినను వ్యక్తిగత కారణములు భిన్నములుగనుండవచ్చును. ఒకే రోగముగా తోచినను వ్యక్తిగత భేదముచే అట్లుకాక భిన్నరోగములగుట తప్పదు. మనిషి ఎఱుక, వాని జీవనవిధానము, ఆతని స్థితిని బట్టి ఒకే నామముగల రోగము భిన్నరీతుల వ్యవహరించును.

రోగములు దేహముయొక్క సహజవ్యవస్థ భగ్నమగుటచే కల్గునవి మీకు చెప్పియుంటిని. ఈ భగ్నత వివిధకారణముల ఫలితము కానోవు. దేహాత్మబుద్ధి గలవాని కది దైహిక సమతా భగ్నమే; భిన్నావయవముల సహకార వ్యవహార వికలత. కాని, బాహ్యజీవనము వెనుక నొక అంతర్గతజీవన మేర్పడుచున్న, రోగకారణము వేరగును. అంతర్గతాభివృద్ధికిని, బాహ్యజీవన విధానమునకును మధ్య జనించిన సంఘర్షణ ఫలితముగ రోగము వచ్చును.

బాహ్యదృష్టినుండి కూడ ప్రాణశక్తి నిరోధలోపమే. నైతిక హేతువులచే లోపించిన ప్రాణశక్తినిరోధమే, రోగమూలమని చాలకాలమునుండి గుర్తింపబడినది. సహజ సమతూకమున నుండి దైహికసామరస్యమున జీవించుచున్నచో దేహమునకు రోగనిరోధక సామర్థ్యమున్నది. దాని అత్యంత భౌతికపదార్థము సూక్ష్మస్పందనముల గల్పించును. వీనికి రోగనిరోధకశక్తి కలదు—అంటురోగములను కూడ. వాస్తమున కన్నియు నంటురోగములే అయినను కొన్నింటికే ఆ పేరున్నది. అవయవములు సమశ్రుతిని వ్యవహరించుచున్నచో, చాలిన నైతిక సమతయున్నచో రోగములు దరికి రావు. కాని, ఏదో హేతువున ఈ సమత్వము భగ్నమయిన రోగము వచ్చు అవకాశమున్నది. కాని, యోగాభ్యాసకుని విషయమున నట్లుకాదు. పైన చెప్పినట్లు అంతర్గత, బాహ్యరీతుల సంఘర్షణాఫలితమా రోగము.

కావున, ఎవని రోగకారణములు వాడే కన్గొననగును. సాధారణ దృక్పథమునుండి చాల రోగముల ప్రధానహేతువు భీతి. అది మానసికము కానోపును. భీతియే రోగములకు ప్రవేశమిచ్చును. కొంత ఆత్మనిగ్రహము గల పౌరుషవంతులు భీతి నపనయింపగలరు. ప్రాణిక భయ మింకను సూక్ష్మకారణము. దాని కింక నెక్కుడు నిగ్రహ మవసరము. దైహిక భీతియా? దానిని పోగొట్టుకొనుటకు యోగ మావశ్యకము. దేహమందలి జీవాణువు లేపాటి అసౌకర్యమునకైనను భీతినొందును. కావున దానిని ప్రతిఘటించుటకు తెలివితోకూడిన ఇచ్ఛయొక్క నేతృత్వ మవసరము. సామాన్యముగ నీ భీతియే రోగములదెచ్చునది. దైహికభీతిని జయించుట చాల కష్టము. ఇదియే రోగమును ఎక్కువ చేయును. దీని పరోక్షమున నెట్టి దుష్కట అవరోధములనైన దాటనగును.

కొందరికి భయమే యుండదు—దైహికభయము కూడ. భీతిని భంగించుటకు తగిన ప్రాణసమత్వము వారి కుండును. వారి సహజ జీవితలయ రోగతీవ్రతను తగ్గించును. కాని, ఇతరులలో ఈ రోగమే భయంకరస్థాయి చేరగలదు. ఈ అంతరము లోక నిచ్చెనమెట్ల వంటిది. ఇది ఎల్లరును చూడగలదియే. ఎట్టి గడ్డురోగములనైన నిర్భీతిగ ఖాతరు చేయకుండ తిరుగువారి మొదలుకొని, స్వల్ప

రోగమునకైన నత్యంత రోగగ్రస్తులగువారి వరకు ఎన్నో శ్రేణుల మనుష్యులు కలరు. ఇది మనిషి తత్వముపై ఆధారపడియుండును; నిగ్రహ పటుత్వముపై ఆధారపడియుండును. దేహము దివ్యేచ్ఛకు పరికరమగువరకును, దానినుండి రోగనిరోధకశక్తి పొందువరకును ఈ భీతి తప్పదు.

సంక్రామిక రోగము లనునవి ముప్పాలు భీతి ననుసరించినవే. ఈ భీతి దాని అనేక నికృష్టరూపములలో మానసిక భీతిగ మారినది. వార్తాపత్రికలు దానిని పెంచుచున్నవి. వృథాప్రసంగములుకూడ ఈ భీతిని వృద్ధిపఱచునవే.

మాతా, పూర్తి విస్మృతి లేని దేహమునకు మందు వలన ఉపయోగ మేమి ? దివ్య కృపను స్వీకరించు చునే కొంచె మౌషధము మేలు చేయుట గమనించు చున్నాము. దేహమునకు మందవసరమని దీని భావమా ? లేక మనఃప్రాణములలో దోషమేమైన ఉన్నదనియా ?

అధిక సంఖ్యాక రోగములలో మందుల సక్రమ వాడకము దేహభీతిని తొలగించుటకే (ఎక్కువగా వాడి చావకున్న). దేహము తన రోగము నదియే కుదుర్చుకొనును. నయము కాగోరిన నది నయమగును. ఈ సత్యమిపుడు సమగ్ర గుర్తింపబడినది. ప్రాతపద్ధతి ఛాందస భిషగ్వరులుకూడ దీనిని గుర్తించు చున్నారు; "అవును, మా మందులు సహకరించును. మందులు రోగమును మాన్పవు. రోగనిర్మూలన మొనర్చునది దేహమే" అందురు. మందు దేహముతో, "ఇది తీసికో," అనగనే దేహము, "ఓ, ఇక నేను స్వస్థత చెందెదను" అనుకొనును. ఆ భావనతో నది నిరామయమగును.

ప్రతి రోగనివారణకును ప్రత్యేక సహకారులున్నవి. మితిగావాడిన లాభించును. అతిగా వాడిన ఒక రోగము కుదిరి ఇంకొక రోగము దాపురింపవచ్చును.

దేహనిబ్బరమునకు చాలినంతయే తీసుకొనిన తప్పక ఉపకరించును. స్వస్థత ప్రధానముగ దేహముపై ఆధారపడియున్నది. ఇక్కడ కూడ తరతమభేదము లనేకమున్నవి. విషము త్రాగి చావనివానినుండి చిన్న పొక్కుకే వైద్యునిషద్ద కాతురతతో పరుగిడువానివరకు—బంధనము, స్వేచ్ఛ మధ్య నెన్నో అంతరవ్యవస్థ లున్నవి. అది పెక్కు మీటలుగల పలక,— అతిజటిలము, సమగ్రము. దానిపై, దేహమే వాద్యముగా నీ వెన్నో కృతుల ప్రయోగింపవచ్చును.

మాతా, స్వాభావిక మానస ప్రయత్నమువనా,
రోగము వచ్చినను మందు తీసుకొననను నిశ్చయ
మును దేహమునకు తెల్పుట ?

అంతమాత్రమున కాదు. మానస నిశ్చయము చాలదు, నీలోగల సూక్ష్మ నిరోధకశక్తులు ఈ నిశ్చయమును పాటింపవు. వేరొకటి కూడ అవసరము.

ఈ కోణమునుండి చూచిన, మనస్సున గల దంతయు సంశయాస్పదమే. నీ వేదేనొక నిశ్చయము తీసికొందువు. అయినను దాని విజ్ఞతను ప్రశ్నించు నదేదో తటస్థపడును (ప్రస్ఫుటముగ కాకున్నను) అంత నీ నిశ్చయ మొకింత సడలును. అదే సమయమున నీవు, "నా కిది కావలెను" అంటివా, దాని వెనుక మెల్లగా, "ఫలితమేమి ?" అను భావన యెట్లో కలుగును.

మనస్సు నటన సూక్ష్మాతిసూక్ష్మము. దాని నెన్ని యుపాయములను అదుపులో పెట్ట నసాధ్యము. దృష్టాంతమునకు; (ఇది యోగాభ్యాసకులకు తెలిసి నదే—వారి అనుభవపరిధిలో నున్నదే.) ఏదో యొక దేహ బలహీనతను (వ్యసనమును) ప్రయత్నించి వదలించుకొని, దాని ఫలితము కొంత గ్రహించి, కొన్ని సంవత్సరములు హాయి ననుభవించి, ఒకానొక దినమున, "అమ్మయ్యా, దీని పీడ పూర్తిగ వదలినది." అను తలంపు మనోవీధి దోచిన మరుక్షణమున నది తిరిగివచ్చును. నీవు వదలినదాని స్పందనములతో సంపర్కము కల్గించు కొంటివి. అవి బలీయములు. వానినిగూర్చి తలంచినంతనే అవి నీ నెత్తి కెక్కును,— చాలకాల మెడబాసి కలసిన ప్రాతమిత్రులవలె.

యోగమున నిది ప్రసిద్ధము. పొందిన విజయముల నుచ్చరించుట, లేక తలంచుట ఏళ్ళతరబడి శ్రమించి గడించిన యోగఫలితమును తృటికో వమ్ము చేయును. బాహ్యస్పందనముల లోనికి జొరపడకుండ నాటంకపఱచు బలిష్ఠమగు మానసిక మౌనము వదలరానిది; అత్యంత కష్టసాధ్యము. శ్రీఅరవిందు లనినట్లు, ఆధ్యాత్మిక భూమిక చేరిన వానికే ఈ విపత్తు రాకుండ చూచుకొనుట సాధ్యము.

మనస్సు సకల ప్రలోభములకును వశ్యము కాగలదు. పరస్పర వ్యతిరేక వాంఛలకు కూడ అది అందుబాటులో నుండును. మనస్సంకల్పము లన్నియు వాని వ్యతిరేకసంకల్పములతో సర్వదా కూడుకొని యుండును. అవి అణగద్రొక్క బడినను అచటనే దాగియుండి అవకాశమున కెదురుచూచుచుండును. ఏ క్షణమున కొంత ప్రమత్తత కల్గిన నా క్షణమున నవి పైకుబుకును. కావున, మానసిక క్షేత్రమున జయములకు స్థానములేదు. మనో విజయములు నిష్కర్షములు కావు, అవి కళంకితములు. దాని పై నగల శ్రద్ధాభూమిక చేరి ఎక్కువ ఎఱుక పొందిన వేళ ఈ పతనభీతి మఱియుండదు.

దేహముపై నత్యంతప్రభావము కలది శ్రద్ధ. విద్యాహీనులు, సరళస్వభావులు అగువారి మానసికాభివృద్ధి అంతంతమాత్రము; కాని వారి శ్రద్ధ పరమాత్మ యందు కొండంత. ఈ శ్రద్ధ వారి దేహమును ప్రాభావితము చేయగలదు. అట్టి వారిని జూచి ఒక్కొక్కసారి ఎంతేనియు అచ్చెరు వొందుచుందుము. "ఆహా, గొప్ప ఆధ్యాత్మికానుభూతిగల వ్యక్తి యీతడు; కాని, ప్రతి వ్యసనము నకును దాసుడు, మఱి అతడో! నట్టి అమాయకుడు, అజ్ఞాని, మొరకు, కాని వాని శ్రద్ధ చాలగొప్పది. ఎంతటి కష్ట కార్యమయినను, అతి తేలికగ చేయ గలడు—ఎట్టి అవరోధమయినను ఇట్టే దాటిపోవును,—" అని యనుకొందుము.

ఎక్కువ నాగరీకునకు శ్రద్ధ యుండనేరదని నా అభిప్రాయము కాదు; ఉండుట కడు దుర్ఘటమని మాత్రమే నే ననునది. మనస్సు సర్వదా వ్యతిరేకించును, చర్చించును, సంశయించును, అవగాహనకై యత్నించును. దానిని నమ్మించుట కష్టము. ప్రతిదానికి నిరూపణ కోరును. మనఃపరిధి దాటి ఆధ్యా

త్మిక క్షేత్రమును పొందినచో నచట సహజశ్రద్ధ లభించును. శ్రద్ధాళువునకు దేహము వశములోనుండును. వాని ఆజ్ఞలను దేహము అనుగ్రహములుగా దలంచి అత్యంతామోదముతో ఆచరించును.

మాతా, మిమ్మొక వ్యక్తిగత ప్రశ్న అడిగెదను. ఒక పురాణ రోగము, ఒక దైహికరోగము మీ కృపచే నయమయినది. కాని, కర్మసంబంధమగు సామాన్య రుగ్మత నయమగుటలేదు. దీని హేతువు ? గ్రహణ శక్తి లోపమా, లేక —— ?

నీ ప్రశ్న వ్యక్తిగతము, స్వకీయము. దానికి జబాబు సాధ్యముకాదు. మనిషి మనిషి కది ప్రత్యేకముగ నుండునంటిని కదా. ఎన్ని ప్రశ్నలో అన్ని జబాబు లవసరమగును. అవలంబించు విధానము యొక్క లోతుపాతుల నరయకుండ వీనిని వివరించుట సాధ్యముకాదు.

ప్రతిదానికి, ప్రతిసంఘటనకు చేతనాభూమిక ననుసరించి వివరణలుండును. కావున, ఒకే ప్రశ్నకు వేర్వేరు వ్యక్తులకు వేర్వేరు వివరణ లవసరమైయుండును. భౌతిక, ఆధ్యాత్మిక వివరణలున్నవి. ఇంకను ఇతరములున్నవి—ఒకే దృశ్యమును చూచిన పల్వురు దానిని పలువిధముల వర్ణింతురు. ఏదియు పూర్తి సత్యము కాదు. అన్నిటను కొంత సత్యముండకపోదు. వివరణ నాశ్రయించితివా నీవొక పద్మవ్యూహమున చిక్కుకొనెదవు. వివరణ కింకొక వివరణ కావలసి వచ్చును; అంతు పొంతు ఉండదు.

ఆదినే దీనిని సమగ్రముగచూచిన, దానిమర్మము గ్రహించిన, చెప్పుటకు మిగిలిన దింతకంటె అన్యముండదు. "అదట్లున్నది కాబట్టి అట్లున్నది." పరమ జ్ఞానమిదియే.

* * *

జూన్ 26, 1957

"భూమిపై ప్రజాసృష్టికి ప్రకృతి అవలంబించు సామాన్య స్థూల మార్గములు ఇంకను అవసరమే యగును. రహస్య విజ్ఞాన శాస్త్ర విధానములు మనకు వశమగు వరకు ఈ నిమ్న మార్గములే గతి. రహస్య విజ్ఞాన మార్గమున వస్తువుల కల్పించుట, మాయముచేయుట (ఏ క్రియా కలాపము లేక) చాలామంది చూచియే యుందురు. రహస్య విజ్ఞానసిద్ధాంతములను బట్టియు, యోగ ముటం కించు వివిధ చక్రముల వ్యవస్థితిని బట్టియు, ప్రాణకోశము నకును స్థూలపదార్థమునకును మధ్యనొక సూక్ష్మ భౌతిక శక్తియే కాక, యొక సూక్ష్మ భౌతిక పదార్థము కూడ నున్నది. సూక్ష్మ నిర్మాణములను స్థూలముగ ప్రదర్శించుట సాధ్యమే — భౌతిక పద్ధతుల సాయము లేకయే రహస్య విజ్ఞాననిర్మిత వస్తువులు స్థూల భౌతిక పదార్థములలోనికి మార్పు వీలున్నది. ఒక సూక్ష్మరూపి యగు జీవి సామాన్య మిథున పద్ధతిని గాక సంకల్ప మాత్రమున స్థూలరూపము దాల్చవచ్చును. శిశువై పుట్టి ఎదుగుటలో ఎదుర్కొనగల అరిష్టముల బాధ లేకుండును. పుట్టగనే వ్యవహరించుట కనువగు దివ్యశక్తుల పొందును. ఇచ్చట పరిణామ పద్ధతికి తావులేదు. సకలము సద్యః ఫలితము.

(అతిమానసాభివ్యక్తి — సంపుటి 16, పుట 32 - 33)

మాతా, పుట్టుక లేకయే పరివర్తన చెందుట సాధ్యమా? అతిమానస చేతన భూమిపై నేడున్నది కదా.

సాధ్యమా, అసాధ్యమా అని అడుగుచుంటివా? సకలము సాధ్యమే మీరు తెలియగోరిన దేమి? ఇది ఇదివరకే జరిగియుండినదనా?

అవును.

పూర్తిగ భౌతికక్షేత్రమువరకు కాదు, సూక్ష్మభౌతికము వరకును చూ వచ్చును. ఊపిరి చిరుగాలివలె తోచునట్లు అంతర్గతదృష్టి గలవారు సహజము స్పర్శించగలరు. సూక్ష్మేంద్రియసాధ్యమగునది, స్థూలేంద్రియముల కసాధ్యమ ఎట్లు చెప్పను? ఇది దేహమువలె కాలబద్ధముకాదు. స్థిరత్వములేదు. ఊప మాత్రమే యనవచ్చును. అక్షిగోచరము కాదు. అతీంద్రియగోచరము. నిరు పణ కందదు. క్షణక్షణము రూపము మారుచుండును. ఒకసారి చూచిన రెండవసారి పోల్చలేము. సామాన్య గ్రహణశక్తి దానికి చాలదు.

నాకు భూమిపై జరిగినదంతయు తెలియదు. నే నెఱిగినంతవఱకు ఈ శక్తి భూమిపై స్థిరపడి ఘనీభవింపలేదు. (మూర్తిమంతము కాలేదు)

చూచుట, వినుట, పదార్థసంబంధులే. కాని, వినుట పూర్తిగ భౌ కము కానక్కరలేదు. సూక్ష్మభౌతిక జీవన శబ్దములు, స్పందనములు విననగును శబ్ద గ్రహణము‌లు సూక్ష్మభౌతిక ప్రపంచమున రూపముకంటె అధికకాలము మను యొక విశేషము. ఒకే స్థలమున రెండు ద్రవీభూత మూర్తులుండగల్గుట సాధ్యమై నది. కాని, ఒకటి యున్నచోట వేరొకటి ఉండజాలని నిర్మాణమింకన సాధ్యము కాలేదు.

—ఇదెట్లు సాధ్యపడును ?

పదార్థస్పందనపై ఆధారపడిన రూపము మార్పగలది మానవుని ఎరుకయే. ఈ ఎరుక భగవానుని కృపావిశేషముపై ఆధారపడియున్నది. సృష్టిలో దివ్యేచ్ఛ వినా అన్యము లేదు.

మాతా, మొదటి అతిమానస శరీర మిట్లుండునా ?

ఎట్లు ?

మైథున జననము లేని పరిణామము ?

ఆ క్షమించి విషయములు తారుమారు చేయరాదు, నేరుగా అతిమానస కాయసృష్టి కవకాశమున్నది— స్థూలశరీర క్రమపరివర్తన ద్వారా ఇది కల్పింపబడు నవకాశముకూడ నున్నది. ఈ పరివర్తనాఫలితము బహుకాల సముపార్జితము; అపూర్వ మానవసృష్టి కావచ్చును. కాని, ఈ మనిషి అతిమానస మూర్తి కాబోడు. ఆదిని పశువుల మాదిరి పుట్టినవాడే కదా. అతిమానస సృష్టిచే కల్గిన మానవునకును, పరివర్తనచే ఆ స్థితినిపొందు సామాన్య మానవునకును మధ్యగా నొక విశేష సృష్టి యుండునని శ్రీఅరవిందుల విశ్వాసము. ఈ సృష్టి ఒక జాతియో, లేక కొందరు వ్యక్తులో చెప్పలేము.

ఈ పరివర్తన చెందిన మానవులలో స్త్రీ పురుష భేద ముండునా ?

ఏమది ? ఏమనుచున్నావు ?

అతిమానస మీ దేహమును స్వీకరించినచో ....

స్వీకరించినచో ? 'స్వీకరించిన' అనగా ?

అతిమానసశక్తి ప్రవేశించిన దేహముల నీ భేద
ముండునా ?

అది అట్లు కాబోదే. సీసాలో ద్రవపదార్థము పోయుటా ? అది కాదు.— కానేకాదు.

దేహ మీ స్త్రీపురుషభేదముంచుకొనునా ? అని నీ ప్రశ్న కానోపు అది అందు చేరు పురుషునిపై ఆధారపడియుండును. వాని ఇష్టానిష్టముల ననుసరించి యుండును. ఈ భేదమన నీ కాసక్తి మెండుకదూ— (నవ్వు)

భేదమేమియు నుండదనుచున్నారు కాని, ఇంత
వరకు చాల భేదము మిగిలియే యున్నది.

ఏ దృష్టినుండి ?

లింగభావదృష్టినుండి, స్త్రీ పురుషజాతులు వేరను
భావ మింకను ఉండనే యున్నది.

ఎంత గొప్పభావమో ! ఆ తప్పుభావన అట్లాలోచించువానిది. ఈ సంకుచిత భావరీతులు మారినకాని నీ దేహపరివర్తనము కాబోదు. ఈ అర్థరహిత పశుభావనలో నుంటివా, నీ ఉన్నతి కే యాశయు లేదు. ఎఱుకగల జీవి ఈ భేదభావ మధిగమింపజాలదని నీ తలంపైనచో, నీ వింకను పశుపుట్టుక బురదలో గొంతు వరకు కూరుకుపోయినట్లే.

అంతర్గత భావన యిది. కాని, వాస్తవ భౌతిక
జీవనమున...

ఏమీ , వాస్తవమా ?

భౌతిక జీవనమున దాని నింకను పొందలేము.
అంతర్గతమున —

నీ సమయ మీ ఆలోచనలోనే గడపెదవా?

అయినను ఇరువది నాలుగు గంటలలో ఇరువది నాలుగు గంటలును ఈ ఆలోచనయే లేక ఉండనగును. దీనితో నీవు కనికట్టు కట్టబడితివి. నీతో మాట్లాడునపుడు నీవు మగవాడవనియు, తారతో మాట్లాడునపు డామె ఆడది అనియు నా మెదడులో నుండునని నీయూహ!

అయినను భేదమున్నది కదా ?

ఓహో! కాని, అది అవసరము కాబోదు.

సిద్ధాంతరీత్యా నా కర్థమయినది.

సిద్ధాంతమా, ఏసిద్ధాంతము?

భేదము లేదని. అయినను, నే నొకరిని కలుసు
కొనిన వేళ, నేనొక పురుషునితోడనో, లేక స్త్రీ
తోడనో మాట్లాడుచుండుట లేదా ?

సరే - ఇది చాల దురదృష్టకరము,— నీకును, ఆ వ్యక్తికిని గూడ. నీ వొకరితో మాట్లాడువేళ ఆతని ఆత్మతో మాట్లాడుచుంటినను భావనకలుగవలెను. అంతేకాదు— నీవు పరమాత్మతో భాషించుచుంటివను భావన కలుగవలెను. దేహములు నిమిత్తమాత్రములు—ఎల్లరలో ఒకే పరమాత్మ యున్నాడు. సంభాషణ పరమాత్మ పరమాత్మతో చేయునది.

ఒకనికి మాత్రమే ఆ ఎఱుకయుండి రెండవవాడు పశుప్రాయు డగుచో ?

ఒకనికి మాత్రమే ఎఱుకయున్ననా ? నీ కదెట్లు తెలిసినది ? ఏవిధమున, ఏభూమికనుండి ఆవలివాని కెఱుకలేదని తీర్మానించుచుంటివి ?

ఆతని జబాబును బట్టి --

ఒకవేళ వాడును నిన్నావిధముగ ఎంచుచున్నాడేమో ! ఒకనితో మాట్లాడు వేళ పరమునితో మాట్లాడుచుంటినను భావన నీ కెంతకాలముండదో, అంతకాలము నీ ఎఱుక ఎఱుక కాబోదు. పై వానినిగూర్చి నిర్ణయించుట నీ దాంభికమునకు నిదర్శనము. నీ వాతనిలోనున్న పరము నెఱుగుచున్న వేళ, నీ కాతని ఎఱుకను నిర్ణయించు హక్కెక్కడిది ? నీ నిర్ణయమున కాధారమేది ? నీ క్షుద్రమేధయేనా ? దాని కేదియు తెలియదే ? దానికి విమర్శనాశక్తి లేదే ? నీ దృష్టి సర్వత్ర సర్వదా పరముని దృష్టి యయిననే తప్ప నీ వితరులనుగూర్చిన నిర్ణయములు చేయు హక్కు నీకు లేకుంటయే కాక, నీ కేసామర్థ్యమును కూడ లేదని ఎఱుంగుము. దివ్యభావన లేనివాని కీ గుణము గర్వసూచకము, అహంభావమని శ్రీఅరవిందులు చెప్పుచుండిరి.

దివ్యదృష్టి కలవాడును, ఎఱుక గలవాడును ఈ పరీక్షించుతలంపే లేకుండును. దాని యవసరమే ఆతనికి కల్గదు. తాను చెప్పునది ఎదుటివాని కర్థమగును సర్వదా. ఇతరులను కొలుచు బుద్ధి యున్నంతకాలము నీ వజ్ఞానివే, సుజ్ఞానివి కాబోవు. ఇది నా తుదిసారి హెచ్చరిక.

ఒక్క మాటలో—ఎరుకగలవాడు తీర్పరి కాబోడు. తీర్పరి ఎఱుకగలవాడు కాబోడు.

పరులను విమర్శించుబుద్ధి విడువకున్నంతకాలము నీవు అతిమానస (ఆనంద) మార్గమున నొక అడుగైన ముందుకు పోజాలవు. భౌతికాభివృద్ధికాని

దేహాభివృద్ధికాని కాదు. మానసి సంకల్పాభివృద్ధియును కాదు. నిర్మలి మనస్కునకే ఆ మార్గమున పయనింప వీలున్నది.

నీవొక భీకరవిషయము చెప్పితివి. "పశుపైనవాని ఆత్మతో భాషింప లేను." అంటివి. నీ గుట్టు బయటపడినది నీవొక గుర్తుపత్రము పెట్టుకొంటివి, మంచిది.

ఆత్మదర్శనము పొందినవారు సర్వులును దీనిని ధృవపరచిరి. "అందరును కాదనుచోట, భౌతికవిజ్ఞానము లేదనినచోట, అత్యంత నికృష్టముగా విద్వాధికులు భావించుచోట పరమజ్యోతిని చూడగలము."

ఇవి పొల్లుమాటలు కావు; ప్రత్యక్ష జీవితానుభవములు. మేలు, కీడు; ఉచ్చ, నీచ; ఈభావము లజ్ఞానజనితములు. దివ్యజీవనము కాంక్షించువాడు ఈ ద్వంద్వముల కతీతుడు కావలెను. భేదజ్ఞాన మేపట్టున నుండరాదు. ఈ ప్రతిభ కలవాడు పైపైమెరుగులకు భ్రమియక, అంతర్గత సత్యమును చూడగలడు.

ఇవి పొల్లుమాటలు కావు. వస్తువుల బాహ్యరూపము దాని సత్యరూపమును కప్పిపెట్టు ముసుగు. ప్రాజ్ఞుడీ ముసుగును తొలగించి నిజస్వరూపమును పసికట్ట గలడు. సామాన్య చక్షువులు దీనిని చూడజాలవు. దివ్యచక్షువులకే సాధ్యము. దీనిని చూచినమనిషి జీవితవిధానము పూర్తిగ మారిపోవును.

ఇట మధ్యేమార్గము లేదు; రోగము పోయినవెనుక బలము కోల్కొనుట వంటిది కాదు. పరిపూర్ణమగు ఆకస్మిక పరివర్తన.— నవ్యప్రపంచమును చేరుట ఇది. నీ ఆలోచనావద్దతే సత్యమనుదానికి నీవు పరిమితమయి యుండునంతకాలము నీవట చేరలేవనుట ధృవము. ఆ దివ్యధామమున చేరినవారికే నేను చెప్పునది గ్రాహ్యమగును.

ఆవలిప్రక్కకు పొమ్ము.

కొంచెము కొంచెము తెలుసుకొనుట అవాస్తవికము. ఇది వేరు. ఈ అభివృద్ధి గమ్యమును చేర్చబోదు, నీవొకగోళమున బంధింపబడియున్నావు. లోప లేదో జరుగుచున్నది, గ్రుడ్డులోని కోడిపిల్ల మాదిరి, అది లోపల తయారగు చున్నది, బయటి కేమియు కానరాదు, అంతయు సిద్ధమయిన పిదపనే గోళ మును భేదించి బయటకు వచ్చు శక్తి కల్గుట.

లోపల బంధితుడు. ఏదో నలుప్రక్కలనుండి తన మీద పడుచున్నట్లు తనకు తోచును, ముందుకు సాగిన అడ్డగోడ, బిగించిన ద్వారము, అరచినను, గోడపై బాదినను వినిపించుకొనువారు లేరు. బయటకు వచ్చుటెట్లు ?

అసత్యమున జీవించునంతకాలమును బంధితుడే, భగవత్కృపచే ఏనాడా గోళము (అండము) భేదిల్లి వెలుగు లోన ప్రవేశించునో అనాడాతడు ముక్తుడు.

ఇది అంచీలలో కాక ఆకస్మికముగ సంభవించును. ఆశింపకుండనే. ఎదురు చూడకుండనే రావచ్చును, పేలుడు పదార్థము వలె క్షణములో జరుగ గలది, హఠాత్పరిణామమును నిరోధించు శక్తి ఏదియులేదు, వెలుగులోనికి వచ్చుటే తడవుగ వాడు స్వేచ్ఛాజీవి యగును,

ఇక నెన్నడు వెనుకటిస్థితికి దిగజారబోడు,

ఇది నిజముగా నూతనజన్మ—

* * *

జూలై 3, 1957

"మనము సామూహిక యోగము చేయుచుంటిమా? దాని విధు లేమి?" అని నన్నడిగిరి.

సామూహిక యోగమునకు మొదటివిధి సమష్టిత్వము అని మీకు మొదటలో చెప్పవలసియుండును. తర్వాత, దానికైన వివిధ విధులనుగూర్చియు చెప్ప వలసియుండును. కాని, గతరాత్రి (హసితముతో) మన సమష్టిత్వమునుగూర్చిన కలగంటిని. అది వాస్తవమగు సమష్టికి ప్రతీక.

రాత్రి మొదటి జామున కలగంటిని. నే నంతట మేల్కొంటిని. చిరా కుతో మఱల నిద్రించితిని. అది మఱచితిని. ఇప్పుడు నన్నడిగిన ప్రశ్న జ్ఞప్తికి రాగనే ఆ కలలోని దృశ్యము స్ఫురించినది. అదెంతో ప్రస్ఫుటముగను, అధి కారికముగను వచ్చుటచే నా ప్రసంగ మాగిపోయినది. 'దివ్యజీవనము' నందలి చివరి అధ్యాయమున శ్రీఅరవిందుల ఆదర్శము ననుసరించి ఎట్టి సమష్టిత్వము మనము సాధింప దలచితిమో దానిని చెప్పుచున్నాను. అది అతిమానసిక జ్ఞాన సమష్టిత్వము—శ్రీఅరవిందుల పూర్ణయోగసాధనము; అంతకంత కెక్కుడుగ దివ్యత్వము చెందుచున్న సమష్టిలో సిద్ధింపగలది.

దాని ప్రతీక (Symbol) చాల స్పష్టముగనుండెను. కడు పరిచిత మైనదే కావున, దాని సత్యమును కాదనరాదు. నే నెంత వివరించినను మీకది గ్రాహ్యము కాదేమో! అయిన ప్రయత్నింతును. అదొక పెద్ద హోటేలు. దాని గదులలో ప్రపంచమునగల అన్నిజాతుల, భాషలప్రజ నివసించుచున్నారు (బసచేయుచున్నారు). అది నిత్యమార్పుల కాకరము. సౌధభాగములు చిన్నవో పెద్దవో నిర్మూలింపబడి మరల నవ్యవిధమున నిర్మింపబడుచున్నవి,—ఎక్కడివా రక్కడే యుండగా, ఆ పెద్ద భవంతిలో నెట తారాడుచున్నను ఒకడు తన వసతి గదికి తేలికగా పోవుచున్నాడు. ఒక వ్యవస్థీకరించిన పద్ధతిప్రకారము ఈ పనులు సాఫీగా సాగిపోవుచున్నవి. దానితో పాటు నేను వర్ణించిన అవ్యవస్థకూడ నున్నది. అదొకప్రతీక,—శ్రీఅరవిందులు చెప్పినదాని కనువర్తించునది. దేహపరివర్తనా

వసరమునుగూర్చి వారు వ్రాసియుండిరి. సామాన్యజీవితము దివ్యజీవితముగ మారుట కెట్టి పరివర్తన రాదగ్గదో వారు చెప్పియున్నారు.

(చూ. అతిమానసాభివ్యక్తి—సం. 16, పు 33-36)

ఈ పెద్ద సౌధమున మధ్యభాగమున ఒక ప్రత్యేకింపబడిన గది కలదు. ఒక స్త్రీకి, ఆమె పుత్రికకు ఏర్పాటుచేయబడినట్లు కలలో తోచెను. తల్లి వృద్ధ, దృఢమగు నిశ్చితాభిప్రాయములు కలది; అధికారప్రియ. కుమార్తె ఆ గది వదల కుండనే సర్వత్ర తిరిగిరాగల శక్తికలది. పెక్కు స్థలముల నొకేసమయమున నుండగలది. తల్లితో నిత్యము ఘర్షణ పడుచుండెను. తల్లికా చిన్నచిన్న చేర్పులు, మార్పులు సమ్మతము,- ఎల్లప్పు డేదో జరుగుచున్న భావము కల్గజేయు టయును. కుమార్తెకో- సంపూర్ణముగ నూత్నరీతి నొకేసారి నిర్మాణము ముగించి ఇక శాశ్వతముగ నట్లుంచుట ఆమె కిష్టము. వివాదము తెగక కుమార్తె గదినుండి వెడలెను—సౌధమునందలి నిర్మాణమగుచున్న భాగముల తనిఖీ చేయుటకై, అన్నియు చూచి తన గదికి తిరిగి మరలెను. కాని తన గది ఎచ్చట? ఆ సౌధ మామెకు పరిచయమే, కాని, ఇంతలో తా నెఱిగిన స్థలములు, మెట్లు, నడవలు తారుమారగుచున్నవి కొన్ని. మఱికొన్నిటి జాడయే లేదు. తాను వచ్చిన మార్గ మెటు పోయినదో తెలియకున్నది. విరుగుచున్నవి, నిర్మింపబడుచున్నవి, అదొక మయసభవలె నున్నది! పైకెక్కినది, క్రింది అంతస్తులకు దిగినది, ఇటు పోయినది. అటు నడచినది— అబ్బే! ఏమియు పాలుపోవుటలేదు. నిమి షములలోనే ఇంత మార్పా! తన గది చేరుటిక సాధ్యము కాదు. హోటలు అధి కారుల నాశ్రయించవలెను. వారి కంతయు క్షుణ్ణముగ తెలియును. ఓ మహిళ దాని నిర్వహణాధికారిణి. ఆమె కెల్లరి వసతులును తెలియును, అన్ని గదుల తాళపుచెవులు ఆమె వద్ద నుండును. ఆమెను సమీపించి, "నా గది చూపిం చెదరా?" అని అడిగినది. "ఓ, తప్పకుండ ; అదెంతపని?" అచట నున్నవా రామెను విస్మయులై చూచిరి. ఆమె లేచి తనతో తీసుకుపోయిన దీమెను. ఆ గది చేరులోపల ఆ అధికారిణి మాయమయ్యెను, అదే సమయమున సౌధమే మాయమయ్యెను.

దీని భావము ? తల్లి భౌతికప్రకృతి, నేటి సృష్టి. కుమార్తె నవ్యసృష్టి. కార్యకర్త్రి మానసికపు ఎఱుక, ప్రకృతిచేసిన ప్రపంచమును వ్యక్తీకరించు కార్యకర్త్రి. నవ్యసృష్టికి సామర్థ్యములేక ఆమె తప్పుకొన్నది.

మార్పవసరమని తెలిసినను, దాని విధానము తెలియకపోవచ్చును. అనేక మార్పులకు గురియగుచున్నదా సౌధము— (ప్రపంచము). అర్ధ ఎఱుకతో, అసంగతపు ఎఱుకతో. పరమాత్మ శక్తితో కూడిన మానవుని ఎఱుకయే ఈ నవ్యసృష్టి సాధింపగలదనియు, ఇతరము లన్నియు తాత్కాలికములనియు ఈ కల బోధించు చున్నది.

(మౌ న ము)

ఈ ప్రతీక తెల్పునదిది. అన్ని అవకాశములు నున్నవి. అన్ని క్రియా విధానములు నచటనే కలవు. అవి అస్తవ్యస్తముగ తీరు తెన్ను లేక అయోమయముగ తోపజేయుచున్నవి. ఇవి వర్గీకరింపబడి, కేంద్రీకృతము కాలే దేకైక సత్యమున. దానికి సామూహిక యోగమే శరణ్యము. అది ఎట్లుండవలెను ?

సమష్టిత్వము విధినిషేధరహిత నిర్మాణముకాదు. క్రమరహితముగ, స్థలవిచక్షణ లేక సత్యదూరముగ కల్పింపబడునవి అసత్యము నాశ్రయించుట క్షణక్షణమును పతనోన్ముఖము లగుచుండును. వాని కాస్తిక్య మంతంత, మన కథలోని గోడలట్టివి. ఏ మతనిర్మాణమయిన, కూటమి యయిన ఆ సౌధనిర్మాణ విధానమును. గుర్తుకుతెచ్చును. ఒకే మతస్థు లొకే రకము దుస్తులు దాల్చి ఒకేరకపు టాచారవ్యవహారములు కల్గి యుందురు. ఒకే ప్రార్థన చేతురు. ఉమ్మడి గుర్తింపు చిహ్నము కూడ ఉండును. చిహ్నమన ఒకే విశ్వాసము, దానికి సంబంధించి కొన్ని హేతువాదమున కందని సిద్ధాంతములు. వీరి ఐక్యత వాస్తవికమగు ఐక్యతకాదు; అదొక కృతకైక్యత.

సమష్టిత్వమన సామాన్యముగా ఇట్టిదే. అన్నిట పై మెరుగులే. ఎదుటి వారిని, తమ్మును వంచించునవే. దీనిని నిరాకరించి శ్రీఅరవిందులు అతిమానస సమాజ (సమష్టి) మును వర్ణించిరి. దానికీ నియమములు విధాయకము:

ప్రతి యొక్కడును తా నితరులలో నుంటిననియు, ఇతరులు తనలో నుండిరనియు అనుభూతిరూపమున నెఱుగవలెను. తనువులు వేరుకాని మనసు లొక్కటిగా నుండ నేర్వవలెను, మనసా, వాచా, కర్మణా, ఏకత్వము పొసగినవే సత్యమగు సమష్టిత్వము సిద్ధించును.

(మౌ న ము)

ఎఱుకతో కూడిన సమష్టిసమాజ నిర్మాణమునకు ముందు మనిషి తా నెఱుకగల వ్యక్తిగా మారవలెను. ఇది స్పష్టముగా ఎవరికి వారు ప్రయత్నింపదగినది. దానినంటియే పైది యుండును. ఒకప్పుడీ ప్రయత్నమున అవరోధము కల్గును. పురోగతి కుంటుపడును. ఇది భౌతిక మానసస్థితినుండి విడివడకుంటచే నయినది. ముందుకు సాగనీయక వెనుకకు లాగుటకు ప్రయత్నించుచుండును. వాస్తవపురోగతికి భూమిక సిద్ధమగుటకే శతాబ్దములు పట్టవచ్చును. గమ్యసిద్ధికి?

కావున, వ్యక్తిగత పురోభివృద్ధిప్రయత్నమునకు, సమాజాభివృద్ధి ప్రయత్నమును జోడించిన ఎక్కువ వేగముగా ఫలసిద్ధి పొందగలమని శ్రీఅరవిందులు చెప్పిరి, అందులకే ఈ ఉమ్మడిధ్యానము ప్రయోజనకరమని భావించితిని. దాని మూలమున ఏకవాతావరణమును సృష్టింపవచ్చునని తలంచితిని— నేను చెప్పిన పెద్ద హోటేలుకంటె ఎక్కువ క్రమబద్ధమయినది, ఎక్కువ సజాతీయ మయినది.

ధ్యానముల నెక్కువ తఱచుగా చేయుచున్నాము. దానిని ప్రయోజనకారి యొనర్చుటకు ఆంతరంగికముగ లోతులకు పోయి యొక ఏకీకరణశక్తిని సృజించి దానిమూలమున ప్రతిది దాని స్వస్థానముననుంచి నేటి కల్లోలితప్రపంచమును ఒక సుసంఘటిత ఏకసూత్ర ప్రచలితమగు సుందరప్రపంచముగా మార్చుట మన ధ్యేయము కావలెను.

* * *

జూలై 9, 1957

ధ్యానమునకు పూర్వ మీ ప్రసంగ మొక మంగళవారము చేయబడినది—

సాధనకై క్రమపద్ధతిలో తయారగుచుంటిమని అంటిని, నే నొక విషయమును నొక్కి చెప్పియుంటిని. కాని అది మీయెడ ఫలప్రదము కాలేదు. భావి సాధనకు మిమ్ములను తయారుచేయుట మంచిదని భావించితిని.

నేటి ధ్యానవిషయము: "వాచాలత్వమున కలుగు హాని".

వ్యర్థముగ పల్కిన ప్రతి మాటయు వాచాలత్వమని మీతో పెక్కు పర్యాయములు చెప్పియుంటిని. ఇట నిది ఆఖరుపర్యాయము చెప్పుచున్నాను. మానవుల పరిపూర్ణుల చేయగోరిన వారిట్లే చెప్పినది పదేపదే చెప్పిరి. వారి బోధనలు దురదృష్టవశమున ఫలింప లేదు. అసూయాపూరిత బాతాకానీ,— నిందించుట, ఒకరినిగూర్చి చెడ్డగా చెప్పుటయం దభిరుచి నికృష్టములు. ఈ అతి వాగుడులో దిగినవాడు తన ఎఱుకను పంకిల మొనర్చుకొనును. ఈ వాగుడుతో మోటుమాటల జోడించిన నది ఆత్మహత్యాసదృశమగును. తనలోని ఆధ్యాత్మికత నశించును.

నొక్కినొక్కి చెప్పుచున్నాను. మీరు దీనిని శ్రద్ధగా పాటించమని నిర్బంధించుచున్నాను. దీనికి మీ రత్యంత ప్రాముఖ్యమీయవలెను.

(ధ్యానము)

* * *

జూలై 10, 1957

"పరిణామప్రేరణవలన అవయవముల మార్పుట సంభవించవచ్చును — వాని భౌతిక వ్యవహారములను, ప్రయోజనములను మార్చి, వాని వాడుటను, అవసరమును మిక్కిలి తగ్గింపవచ్చును సూక్ష్మ దేహచక్రములు తమ తమ చైతన్యములను నరములు, కంఠరములు, గ్రంథులలో చేర్చ వీలున్నది. ఈ పార్థివదేహము దివ్య చైతన్యయుతము కావచ్చును. అత్యంత నూతనముగా, మిక్కిలి సౌమ్యమార్గములలో జీవనము సుఖముగా, చింతారహితముగా గడుపవచ్చును. జీవితమున కవయవముల సహకారమవసరము కాబోదు. అవి అవసరము కాకుంటయే కాక, నూతన జీవన విధానమున కవరోధము కానోపు. అవి క్రమముగ నిరుపయోగములు కావచ్చును. అంత నవి వాడుక లేకుంట జీర్ణమై నశింపవచ్చును. అత్యంత సూక్ష్మావయవములు దివ్యశక్తుల కంతటనుండి సాధనములు కావచ్చును. భౌతికమేదైన వలసిన నా సమయమున ప్రత్యేక కృత్రిమ పరికరములు శక్తిమంతమగునవి ఈ అవయవములకు బదులుగా వాడవచ్చును. ఇట్టి పరిణామముల నాశించుట చాలా ముందుచూపే యగును. ఈ ప్రాకృత మనస్సులు వానిని నమ్మలేకపోవచ్చును. పరిణామమెట్లు సాగునో నిర్ణయించలేము-నిర్బంధించలేము కూడను ప్రయోగములలో ఏవి సహకారులో, ఏవి ప్రతిబంధకములో, ఏవి విసర్జనీయములో, ఏవి స్వీకారార్హములో ముందుగా ఊహింపలేము. ఆదినుండి వచ్చిన, వచ్చుచున్న మార్పులు చూచినవే — ఇవి

మానవుడు దివ్యుడగుటకు వేసిన పథకములోని భాగమేల కాకూడదు? భూమిపై దివ్యదేహ నిర్మాణమునకు, దివ్య శక్తుల ఆవిర్భావమునకు పూర్తిగ మార్పుచెందిన దేహము అగత్యము. చిన్న చిన్న మార్పులు, చేర్పులు, పరిమితావకాశములు కల్పించునవి చాలవు.

(అతిమానసాభివ్యక్తి సంపుటి 16, పుట 38, 39)

ప్రాత జీవన పద్ధతుల వదలినవేళ క్రొత్త జీవన మూహించుట సాధ్యము కాదు. అది విజ్ఞానకోశపు టూహకు కొంతవరకు సాధ్యము. విషయముల యెడ మన దృక్పథము పూర్తిగ మారిపోవును. వ్యవహారవిధానములే ప్రాత వానితో ఏ పోలికయుండును. దేహాత్మకబుద్ధి నవ్యప్రపంచమును, లేక శాంతిసౌఖ్యముల నలరారు ప్రపంచమును, ఏమాత్ర మూహింపజాలదు. మొదటగా, కనిపించు విషయముల అవాస్తికత, వింతదనము గ్రాహ్యము కావలెను, వాని వైఫల్య మంతట స్ఫురింపవలెను. గతించిన నిర్జీవప్రపంచమునకు సంబంధించినవనియును, నిర్మింపగల నవ్యప్రపంచమునకు వాని ఉపయోగము లేకుండుటయేగాక, అనర్థదాయకములనియు తెలియవలెను. వానిని పూర్తిగ పాఱవైచి నవ్యపదార్థములతో భవిష్యత్సృష్టి కావలసియున్నదనెడు సత్యము నెఱుంగవలెను. పశువు నుండి మానవుడు కల్గుట పరిశీలించిన నది తెలియకుండనే జరిగినదనుట తెల్లము. అందులకైన ప్రయత్న మావంతయును లేదు. నేను చెప్పున దట్టిమార్పు కాదు, (కొంతఆగి) అది నవ్యము, అపూర్వము, అతి సూక్ష్మము, ఇంకను తగిన స్తోమత లేనిది. బలవంతము చేయుటకు చాలనిది, ఈ విజ్ఞానము నేటి ఎఱుకలో తగినంత చేరలేదు, అది చేరినవేళ ప్రకృతియొక్క కాకతాళీయ మార్గమున గాక ప్రణాళికా ప్రకారము నిర్దిష్టప్రయోజనము సాధించుటకగు క్రమనిర్మాణము సాధ్యమగును.

ఈ నవ్యనిర్మాణవర్ణన సాధ్యముకాదు, అయినను మీకు చెప్పదలచిన దదియే, దాని యనుభూతి గత సాయంత్రము పొందితిని, ఎంతో గాఢమగు

అనుభవమది స్పష్టముగ చూచినట్లుండెను. కావుననే దాని గూర్చి చెప్పుట కాపక్తి జనించెను.

(మౌనము)

విచిత్రము! ఒక చిత్రప్రదర్శనము నవ్యము, అసామాన్యము, ఆశింపనిది జరిగెను. (అదొక వంగ చిత్రము) * కొందరు యోగమునకు కొన్ని విషయములు సహాయకారులనియు, కొన్ని కావనియు తలంతురు. అయిన నిది అట్టి వారి యూహల వమ్ముచేయు సంఘటన. ఎదురుచూడని సంఘటనలే మిక్కిలి ఆసక్తికరములగు అనుభవము విచ్చుట నే నిపుడు గమనించితిని.

గత సాయంత్రము జరిగినదే మీ కిపుడు నాకు చేతనైనంతగా చెప్పుచున్నాను. మీ కర్థమగు ననుకొందును. నా కది క్రొత్త అనుభవము. నేను దాని నేమాత్ర మూహించలేదు. గంగయొడ్డున గల దేవాలయ చలనచిత్రము. వాణ్యత తక్కువ. కాళీవిగ్రహ మందున్నది—దానిని చూచుచుండగా, అందు నిహితమై యున్న సత్యము నాకు గోచరమాయెను. నాలో మతము, ఆరాధన, వాంఛలు, దేవుళ్ళతో మానవుల సంబంధము మొదలగువాని భావములు రేకెత్తెను. అది మానవుని ఆధ్యాత్మిక ప్రయత్న ప్రసూనము. మనిషికంటె దివ్యమగున దొకటి—మహోన్నతమును, పవిత్రమును అగునది—ఆకస్మికముగ నవ్యప్రపంచ మొకటి నాముందు నిలచినది! వాస్తవికము, చైతన్యపూర్వకమగు ప్రాతది, కాలదోషముపట్టి ఆస్తిక్యత కోల్పోయినది. దానిస్థానమున దాని తలదన్నునది లేచినది. అత్యంత సత్యమును, మహోదయమును నగు నవ్యప్రపంచము నాపై

* 'రాణి రాస్మణి' అను బెంగాలీ చిత్రము. ఇందు శ్రీ రామకృష్ణుని యొక్కయు, రాణీ రాస్మణి యొక్కయు జీవితములు చిత్రించబడినవి. ఈమె 1847 లో దక్షిణేశ్వరమున కాళీ దేవాలయమును నిర్మించిన జమీందారిణి. ఈ దేవాలయముననందే శ్రీరామకృష్ణుడు కాళిని పూజించెను.

గాఢముద్రవేసినది. ప్రాతది ఎంతటి భవ్యమయినను దీనిముందు సూర్యునిఎదుట దివిటీ యయ్యెను.

అంత వాస్తవ మెఱింగితిని.—— ఎఱుకతో, దైహికముగనే గ్రహించితిని. (మీ కర్థమగుచున్నదో లేదో) ఒక నవ్యప్రపంచముద్భవించినదనియు నది దినదినా భివృద్ధి యగుచున్నదనియు దేహమునందలి అణువణువున తెలిసికొంటిని.

అదంతయు చూడగా 1926 లో (అనేక సంవత్సరముల క్రితము) జరిగినది గుర్తుకువచ్చెను. మీకును జ్ఞాపకమున్న దనుకొనెదను.

శ్రీఅరవిందులు ఆశ్రమ నిర్వహణ బాధ్యత నాకప్పగించిన మహత్తరదిన మది. తా మంతర్గత ఏకాగ్రతలో నిలచి, అతిమానసపుటెఱుక భూమికి దిగివచ్చు తరుణమును త్వరపరచవలెనను ఉద్దేశ్యముతో ఆనాడు తన ఎదుటనున్న శిష్యబృందముతో, "నాతో సహకరించి మిమ్ములను నడపించు బాధ్యత మాతకు నేటినుండి అప్పగించుచున్నాను. సహజముగ ఆమె నాకు సన్నిహితముగనే ఎల్లప్పుడుండును, నా ఆజ్ఞ ననుసరించియే సకలకార్యముల నిర్వహించును" అనెను. వెంటనే ఆకస్మికముగ నా కన్నియు నవ్యరూపము దాల్చెను. అత్యంతోజ్జ్వలమగు సృష్టి చేయబడుచుండెను. అత్యంత విస్తృతముగ —— అభూతానుభూతులతో అమరపురుషులతో సంపర్కము, అన్నిరకముల అభివ్యక్తులు——సామాన్యముగ అద్భుతము లనబడునవి —— నా కనులయెదుట దోచెను. ఒకదానివెంట నొకటి సాగజొచ్చెను. అవి అవతరించు రీతి అతి తేజోవంతము. అవి తప్పక జరిగితీరును.

నేను ఒకదినమున నాడు చేసినది తెల్పుటకై శ్రీఅరవిందులకడ్డకు పోతిని. నే చూచినది చెప్పుదానిలో ఎక్కువ ఉత్సాహము ప్రకటించుచుంటినేమో? వారు నన్నుద్దేశించి ఇట్లనిరి : "అవును, ఇది అధిమానస (Overmental) సృష్టి. అత్యంతాసక్తిజనకము, నేర్పున చేయబడినది. నీకు ప్రపంచ విఖ్యాతిని దెచ్చు అద్భుత కృత్యముల నీవొనర్పగలవు, నిజము——ముమ్మాటికి నిజము" —— అంత వారు హసితవదనులై మఱల నిట్లనిరి: "ఇది గొప్ప విజయము. కాని

యిది అధిమానస సృష్టి— మన ఆశయము అతిమానసము (Supramental) మును భువికి తెచ్చుట, ఇప్పటి మన విజయ మొక విజయము కాదు. సద్యో విజయవర్జన మెట్లో తెలిసిననే నవప్రపంచనిర్మాణము సాధ్యము.— సంపూర్ణమగు అతిమానస ప్రపంచనిర్మాణము.

నా అంతరంగమున నేను వెంటనే గ్రహించితిని. కొన్ని గంటలలో ఆ సృష్టి మాయమయ్యెను. అప్పటినుండియు మే మితరప్రాతిపదికలపై మరల ప్రారంభించితిమి.

నవ్యప్రపంచ ముదయించెనని మీకు చెప్పి యుంటిని. అది యింకను ప్రాతప్రపంచముచే అత్యంత మాచ్ఛాదితమగుట సర్వులకు దాని అంతర మగ్రాహ్య ముగనున్నది. అయిన నా నిర్మాణము సాగుచునేయున్నది. కొంతవరకు ఫల ప్రద మనవచ్చును. దానియొక్క ప్రదర్శనమే నా అనుభవము. నిన్న చూచి నది అత్యంతనూతనము, దాని ఫలితము నా నిత్యానుభవములలో క్రమముగ చూచుచున్నాను. దానిని దైర్ఘ్యమానమున కొంత తెల్పవచ్చును.

మొదటగా అది అధ్యాత్మికజీవనము గూర్చియు దివ్యసత్యమును గూర్చియు నూతనావగాహన, దీనిని శ్రీఅరవిందు లుద్ఘాటించిరి. నేనుకూడ దాని నెన్నో పర్యాయములు వెల్లడించితిని, దానిని రూపొందించు విధమిది: "ప్రాత అధ్యాత్మికత ఈ ప్రపంచమును యథాతథముగ వదలి దివ్యసత్యము లోనికి నిర్గమించుట. దానికి వ్యతిరేకముగ మన నవ్యదర్శనము జీవితమును దివ్యమొనర్చుకొనుట; పార్థివ ప్రపంచమును దివ్యముగ మార్చుట. దీనినే శ్రీఅరవిందులు అనేక పర్యాయము లుద్ఘాటించిరి, మన ముద్దేశించినదాని మూలభావ మిది. మెరుగులు దిద్దినంతనే ప్రాతది నవ్యము కాబోదు. ప్రాత దాని పరివర్తనా ఫలితము కానేరదు. ప్రాతక్రొత్తల మధ్యను మనమున్నాము. విజయమునకై రెండును పోటీపడుచున్నవి, ప్రాతది ఇంకను ఎక్కువ బలిష్ఠము గానే యున్నది. అయినను క్రొత్తది అతిమెలకువతో ఎవరి కంట బడక, లేశ మాత్ర సంశయమును గొల్పక మెల్లమెల్లగా ముందుకు చొచ్చుకువచ్చుచున్నది—

బలము పుంజుకొనుచున్నది. ఎప్పుడో యొకపుడు అది బాహాటమగును. దీనిని గమనించగలవారి సంఖ్య అల్పము.

సూటిగా చెప్పదలచిన, అధిమానససృష్టియగు ప్రాతప్రపంచము శ్రీఅరవిందుల భావనలో. ప్రధానముగ దేవుళ్ళ ప్రపంచము. కావున నందు మతమున కెక్కుడు ప్రాధాన్యమున్నది. ఉన్నతికి ప్రయత్నించు మానవు డనేకమతముల కాకరమయ్యెను. భౌతికజీవులకును అదృశ్యజీవులకును మతసంబంధము కల్పింపబడెను. ఉచ్చదశలో ఆత్మదర్శనమునకైన ప్రయత్నమేర్పడి, మతైక్యత వాని వెనుకగల పరమసత్యముపై సాధ్యమను భావము కల్గెను. ఇదియే మానవతాకాంక్షయొక్క అవధి యనవచ్చును. ఈ విశ్వాస మంతయు అధిమానసప్రపంచమునకు చెందినదే, దాని నిర్మాణమే. అచ్చటనుండి చూచుచు ఈ నవ్యసృష్టిని గ్రహింపజాలకున్నది, ఇది మారి నవ్యసృష్టి నాహ్వానించు తరుణము సమీపించుచున్నది. ప్రాతవి శిధిలమై సత్యముయొక్క ఆభాసగతోచుట కారంభించినది. నేడు ప్రపంచమున కననగు అవిశ్వాసము, నిరాశానిస్పృహలు దాని నిదర్శనములే.

అతిమానససృష్టిలో మతములకు స్థానము లేదు. సర్వులును దేవతాస్వరూపులుగ మారి దేవుళ్ళకై చూచువారుండరు.

ఈ దివ్యజీవులు నవ్యసృష్టిలో తామే స్వయముగా పాల్గొన వచ్చును. వారంత అతిమానస పదార్థరచిత దుస్తులు ధరింపవలసియుండును. కొందరు పూర్వమువలెనే యుండగోరి, భౌతికమార్పుల కిచ్చగించకున్నచో, వారు నవ్యప్రపంచవాసులతో మైత్రీ సంబంధమున నుండగలరు. సమానులు, సహకారుల మాదిరి. భూమి స్వర్గమగుచో స్వర్గవాసులు భూమిపై నుండుటకు వెనుకాడ నవసరముండదు.

అయినను ఇది ఇప్పటిమాట కాదు. దీని సాఫల్య మెన్నటికో ? మనము దుర్భరమగు మధ్యంతరపరిస్థితిలో నున్నాము. ఇది వెనుక నెన్నడును లేనిది, తెలిసి అలవాటయిన స్థితి జారిపోవుచున్నదనుట స్పష్టము. తెలియనిది క్రొత్తది- అది ఎట్లుండునో యను భీతి—— ఆశానిరాశలమధ్య మానవుడు సతమత మగు

చున్నాడు. నవ్యప్రపంచ మింకను ఊహాగానమే— కలయే. ఎవరు నచట చేర లేదు. కాని ఆశతోనున్నవారున్నారు. అల్పసంఖ్యాకులే యయినను. వీరినే నే నాహ్వానించి "ఈ సాహసోపేత ప్రయత్నమున పాల్గొందురా— నవ్యప్రపంచ నిర్మాణములో" అని అడుగుచున్నాను— ఇది మన పూర్వుల ఆధ్యాత్మికతను పరిపూర్ణమొనర్చుట కాదు, ఇది పూర్తిగ నవ్యము. మధ్యలో ఎన్నో అపాయములు సంభవింప నోపును. అయినను చివరకు విజయము తప్పదు. రాచబాట లేదు. అడుగడుగున మార్గ నిర్మాణ మొనర్చుచు ముందుకు సాగవలెను. అకుంఠిత ధైర్యముతో ముందు కేగవలెను. సాగిపోదము. రేపేమికానున్నదో నాకే తెలియదు.

గతములోని దంతయును వదలుడు— యోచనలు, నిర్మాణములు, సమస్తము— అజ్ఞాతములోనికి చొచ్చుకుపోదము, ఏది వచ్చిననుసరే, అన్నిటికిని సిద్ధమే, మంచిది,

* * *

జూలై 17, 1957

ప్రవచనముపై ఎవరికిని ప్రశ్నలు లేవా? నేడు ప్రత్యేకముగా చెప్పునదేదియు లేదు. దేహముయొక్క నవ్యసమగ్రతల స్వరూపమెట్టిదో తెలుసుకొనుటకు కుతూహలము లేకున్న....

మాతా, మా వ్యాయామ విద్యయొక్క ధ్యేయము దేహము నంతకంత కెక్కుడుగ నిగ్రహించుటయే కదా? వెనుకటి సమావేశమున, "శ్రీఅరవిందులు హఠ యోగ తాంత్రిక పద్ధతులు దేహము నెక్కుడుగ వశపర్చుకొనుట కనిరి" అని చదివితిమి— ఈ పద్ధతులను మన ప్రణాళికలో నేల ప్రవేశపెట్టలేదు ?

అవి రహస్యజ్ఞాన ప్రక్రియలు. దేహముపై పనిచేయునవి. ఆధునిక పద్ధతులు నేటి స్థితిలో అవకాశమున్నంత సమగ్రత దేహమున కిచ్చునవి. భౌతిక ములు. ఇంతకును నీ వడుగునదేమి? ఆ రెండు విధానములును పూర్తిగ భిన్నములు.

ఈ పద్ధతులకు సంకల్పశక్తిచే పదార్థములు ప్రభావితమగుటయే మూలము. భౌతికసాధనముల సాయములేక వస్తువులను కదల్చుట, రూపముల మార్చుట, మాయము చేయుట మొదలగు పనులు అన్ని దేశములందును విభిన్న పద్ధతులలో రహస్యజ్ఞానదక్షులచే చేయబడెను. క్రమబద్ధము చేయబడిన మానసికశక్తియే వాని కన్నిటికిని వెనుకనున్నది. శక్తి అధికము, లేక అల్పము కానోవు. అయినను అన్నిపద్ధతులను వాడిన దా శక్తియే. భౌతికప్రయోగములలోకూడ భిన్నవ్యక్తు లుత్పాదించు శక్తిలో తారతమ్యమున్నది కదా. పద్ధతి ఒకటే అయినను దానిని వ్యవహరించువానిపై దాని ఫలిత మాధారపడియుండును.

నీ ప్రశ్నను అధునాధునిక బాహ్యరూపమున అన్వయించిన, మనము చేయునవి, లేక విధిగచేయు భౌతికకార్యములు మన కండరములను పెంచుటలేదు; దేహ మారోగ్యముగ నుండుటలేదు. అయినను వివేకముతో కూడిన కార్యములచే ఒక నిర్దిష్టప్రయోజన మాశించి చేసిన క్రియచే, కండరములు పెరిగి దేహము సౌష్ఠత పొందుచున్నది. ఇదెట్లు సంభవ మగుచున్నది? కొన్ని వృత్తులున్నవి. అందు పెద్దపెద్ద బరువులు మోయవలసియుండును—సిమెంటుబస్తాలు, ధాన్యపు బస్తాలు, బొగ్గుల బస్తాలు. వీరెంతో శ్రమింతురు; కొంత అలవడిన లాఘవముతో మోసెదరు. అయినను వారికి దేహసౌష్ఠవ మలవడదు, కారణము? వారు కండరముల పెంచు ఉద్దేశ్యముతో ఆ పని చేయుటలేదు—భుక్తికి మాత్రము, భుక్తి లభించును. వాడు కోరినది వానికి సిద్ధించినది. దేహపాటవమును, కండరములను, పెంచు నుద్దేశ్యముతో శ్రమించువాని కవి తప్పక సిద్ధించును. కావున ఎఱుకతో చేయు కార్యమున సాయపడున దేదియో కలదనుట కాదనలేము. నేటి వ్యాయామము ఎఱుకతో చేయుచున్నారు. మెట్లు ఎఱుకతో దిగుచున్నారు, ఎక్కుచున్నారు. యంత్రమువలె చేయుటలేదు, జ్ఞానముతో కూడిన సంక

ల్పమే యిష్టావాప్తి కారకము, పను లొకటిగా తోచినను ఫలితములు వేరగుట కీ జ్ఞానభేదమే కారణము.

యోగికి కాని, యోగి కాదలచినవానికి కాని ఒక ప్రత్యేక ఉద్దేశ్య ముండు టచే వాడా ఫలము పొందును. అన్యోద్దేశ్యములతో అదేపనిని చేయువారి నెఱుంగుదును, అయినను ఫలము శూన్యము. కనీస మారోగ్యముకూడ వారికి లభింపదు, వారితో నే నంటి నిట్లు; "ఇంత శ్రమించియు రోగిష్ఠులయి రేల?" "అయ్యో, నే నేమియు ఆలోచించలేదు, నే నందుకొఱకై చేయుటలేదు. ఆ ధ్యాసయే నాకు లేకుండెను" తేలినదిది: ఎఱుక పదార్థముపై తప్పక ప్రభావము చూపును. పదార్థమున కా శక్తి లేదు.

అయినను నీవు చేయదగ్గది ప్రయత్నమే. గ్రహింప యత్నింపుడు. దుస్తులు ధరించుటకాని, స్నానము చేయుటకాని, గది శుభ్రపరచుటకాని ఎఱుకతో చేయుడు, దేనినైనను. దాని ఫలితము నీవే చూడగలవు.

మెట్లెక్కి దిగుట దేహపరిశ్రమ కెంత ప్రయోజనకారియో నీ ఊహ కంద రానిది. దాని విధాన మెఱుంగుట ముఖ్యము, నీ వెక్కి దిగునపుడు ఎక్కు చుంటిని, దిగుచుంటి ననుకొనుటయేకాక, ఏయే కండరములు పనిచేయుచున్నవో వాని ఎఱుకతో, సమతతో వానిని పనిచేయించు ధ్యాసతో ఎక్కుము, దిగుము. నీకే తెలియగలదు—నీ దేహమున యుక్తమార్పుల రాక.

ఏదో తీయుటకు వంగితివి. విటారుగ కాలివ్రేళ్ళపై నిలబడితి వేదో బీరు వాపై నున్నదానికై. ఇట్టి పనులెన్నో నిత్యము చేయుచుందువు. వాటి నన్ని టిని దేహవ్యాయామమునకై వాడనగును, ఎఱుకమాత్ర మవసరము. యథాలాప ముగ చేసినదానికంటె ఎఱుకతోచేసిన ఎన్నోరెట్లధిక ఫలము కల్గును. నీకు నచ్చిన రీతిని నీ దినచర్యనంతయు ఈవైఖరితో జరుపుము. మొరకుగా కాక సున్నితముగ పను లొనర్చుము. మన ప్రతి కదలికలో చక్కని లాలిత్యము పొరభించును,

(దీనిపై ధ్యానింతము)

జూలై 24, 1957

"వాస్తవమున, అతిమానస మిపుడిచట ఉండనే యున్నది. కాని, అది యీ మనఃప్రాణ శరీర జీవితమున అంతర్లీనమై, ద్యోతకము కాకయున్నది. ఇంకను అది కార్యకారి యగుటలేదు; మారిన యీ భూలోక శక్తుల నుపయోగించుకొన బయటకు రాలేదు. అవతరించనున్న అతిమానస శక్తివలననే అయ్యది విడుదలై మన యీ దేహ ప్రాణమనఃశక్తులలో ద్యోతకము కాగలదు. అంతట నీ అల్ప(భౌతిక)శక్తులు మన దివ్య కార్యకలాపములోని అంశములయితీరును. జడపదార్థమున అంతర్లీనమై యుండిన ప్రాణము, మనస్సు ఈ తీరుననే ఇచట బహిర్గతములై విలసిల్లుట జరిగినది. అంతర్లీనమై యుండినది మాత్రమే బహిర్గతమగుట సంభవించును. లేనియెడల అట్టి బహిఃప్రకటనము సాధ్యము కానేరదు.

( అతిమానసచేతనాభివ్యక్తి— సంపుటి 16, పుట 43 )

కరుణామయీ, మాతా, అంతర్లీనమై యుండిన అతిమానసమన నెట్టిది ?

అంతర్లీనమైయుండినది, అంతర్లీనమైయుండనిది, రెండును ఒకటే.

"అన్నిటను బ్రహ్మ ముండిననే సర్వత్ర వెల్లడియగుట కాస్కారమున్నది"- అనిరి శ్రీఅరవిందులు. అందుననే గభీరమగు ఈ సృష్టి దివ్యమయినది, ఇదియే ప్రపంచము దివ్యమనుటలో ఆయన తాత్పర్యము. ఈ దివ్యత్వమొకనాడు వెల్లడికాక తప్పదు. చక్షుర్గోచరముకాక మానదు, మనకు వెల్ల

డింపబడిన మనః ప్రపంచమునకు మనిషి మకుటాయమానమై వెలసినాడు. దీని తరువాత అభివ్యక్తము కావలసినది అతిమానస (ఆనంద) ప్రపంచము. అది అవతరించిననాడు భూమి పరంధామమే యగును; ఇంతదనుక జరిగిన సృష్టి అపరార్ధగోళసంబంధి, దీని నేత అవిద్య అధిష్ఠానముగాగల అజ్ఞానము. రానున్నది సత్య మధిష్ఠానముగాగల జ్ఞానము. అందులకే అది నవ్యప్రపంచమనుట, కాని ఈ నవ్య ప్రపంచము బీజప్రాయముగ మన మెఱింగిన ప్రపంచమున లేనిచో నవ్య ప్రపంచావిర్భావమున కవకాశమే యుండదు, అంత రెండు భిన్న ప్రపంచములు సంభవమగును, రెండింటికి సంబంధమే యుండదు. ఈ ప్రపంచములోనుండి వెల్వడి సత్య, జ్ఞాన, జ్యోతిర్లోకముగ రూపొందిన ఆ ప్రపంచము అజ్ఞాన భూయిష్ఠమైన యీ ప్రపంచమునకు అదృశ్య ప్రాయమై పోవును.

అట్లుగాక, మార్పువచ్చిన యనంతరము, రెండు ప్రపంచములకు సంబంధముండి క్రొత్తది ప్రాతదానిపై ఆధిపత్యము వహించుననుటకు హేతువేది? ఇదివరలో చెప్పినట్లు నవ్యము బీజప్రాయముగ ప్రాతదానిలో గుప్తముగ నుండుటయే. అయినను అతిమానస శక్తి పైనుండి క్రిందికి దిగిననే ఇది బహిర్గతము కాగలదు.

ఇదే ఇప్పుడు జరుగుచున్నది, రెండువారముల క్రితము మీతో చెప్పినట్లు, ఇప్పటి భౌతికప్రపంచము చాల శక్తిమంతమును, సామాన్యపు ఎఱుకకు పూర్తిగ వాస్తవమును, పైశక్తుల నది తనలో నిముడ్చుకొనినది, అది గ్రహించుటకు చాలకాలము పట్టును, దీనిని సఫలీకృతమొనర్చు ప్రయత్నమే ఇపుడు కొనసాగుచున్నది.

ఎంతకాలము పట్టునో చెప్పలేము, మనుష్యుల సద్భావ, స్వీకార శక్తులపై అది ఆధారపడియుండును, మూకకంటె వ్యక్తి శీఘ్రముగ పురోగమింపగలడు. ఇతరజాతులకంటె మనిషికిది ఎక్కువతేలిక.

మనిషి చేయగల సహకారము మార్పున కిష్టముచూపుటే. ఈ యిష్ట మనేక విధముల చూపవచ్చును. సత్ఫలిత మిచ్చునవన్నియును మంచివే. ఉన్నది ఏవగించి క్రొత్తది గాఢముగ వాంఛింపవలెను. తనకేదో రమ్యమును సత్యమును నగునది లభించుచున్నట్లు అనుభూతిపొంది, స్వేచ్ఛగా మిగిలినవన్నిటిని త్యజించి. ఆ నవ్యసుందర సత్యస్థితికి చేరుకొనవలెను.

ప్రాథమికముగ కావలసినది దృఢసంకల్పము; పురోభివృద్ధికైన గాఢేచ్ఛ; అచంచలవిశ్వాసముతో ఈ అజ్ఞాత ప్రదేశమునకు సర్వసంగపరిత్యాగము చేసి పయనించుట. అది అమోఘము—తప్పకవచ్చు నొకనాడే నవ్యప్రపంచము. ఈ మార్పు నెఱిగిన వారికి ప్రాత యలవాట్లను వదలించుకొనుట తేలిక.

జనులు నిదురింతురు, మఱతురు, జీవితమును చులకనగ చూతురు. సర్వదావిస్మరింతురు. మన మొక అపూర్వ శుభసమయమున నున్నాము. ఈ యుగ సంధిలో నుండుట మన యదృష్టము. ప్రాతది తొలగి నవ్యతకు చోటిచ్చుచున్నది. అభివృద్ధి కేమాత్రమును ఆటంకపెట్టకుడు.

ఇది మఱువరాదు. స్పష్టమగు అనుభూతి లేకున్నను ధైర్యము, విశ్వాసము కలిగియుండుడు. అహర్నిశలీ రాబోవు నవ్యప్రపంచమునే భావించుచుండుడు. నవ్యప్రపంచోద్భవ శుభసమయమున మన మున్నామను పరమసత్యమును మఱువజనదు. మన మీ నిర్మాణములో పాల్గొన నగును. దానిలో ప్రవేశింపనగును; సర్వమును పరిత్యజించి ఈ పవవకాశమునకై సిద్ధపడనగును.

* * *

జూలై 31, 1957

కరుణామయీ, మాతా, శుక్రవారము: దీనిని ధ్యాన విషయముగా నిచ్చియుంటిరి: "దేహమున దివ్యత్వము నకై ఉత్కంఠ."

అవును.

దాని విధానము ?

అనేకమార్గములున్నవి. వాస్తవమున కెవరి మార్గమును వా రెన్నుకొన వలెను. ఆరంభము వివిధముగా నుండవచ్చును, పరస్పర విరుద్ధముగ తోచ వచ్చును.

పూర్వము యోగము జీవితమునుండి పలాయనమయి యున్నవేళ, ఏ కొందరో తప్ప సామాన్యప్రజ యోగమునుగూర్చి ఏ తలపును లేకుండిరి—జీవిత మిచ్చు సంతోషము, దుఃఖము, దైన్యములు, కష్టనిష్ఠురములు, వాంఛాసాఫల్యము, నిరాశానిస్పృహలు అనుభవించి వృద్ధులై దేహాటంకము తగ్గగా జీవితము కలగా తోచి వారు యోగమును గూర్చిన తలంపులోపడువారు. ఆధ్యాత్మికపు వైపునుండి మనిషి సమగ్రతకై పూనుట తేలిక. జీవితముతో అతని కేప్రయోజనమును లేదు. ముసలిదై దేహము జీర్ణమగుదనుక వేచియుండపనిలేదు. కాని, అతడీ దేహము తన పరివర్తనలో పాల్గొన కోరుచో, పిన్నవయస్సుననే అంతర్గత ప్రేరేపణపై ఆధారపడి యోగసాధనకు పూనుట శ్రేయము. బాల్యమునుండియు అదృష్టవశ మున క్షణికానందములకును దివ్యజీవనానందములకును గల అత్యంతభేదమును సద్గురు సాన్నిధ్యమున నెఱింగి అతని నేతృత్వము లభించినచో తన పరిమితజీవిత మును సత్యమున ప్రతిష్ఠించి అనంతము అమరము నొనర్చును.

దివ్యఎఱుకతో జన్మించినవానికి బాల్యమునుండియు ఈ ప్రేరణయుండును, బాల్యముననే తన మహత్తర భావిజీవనమును గూర్చిన అద్భుతకలల గనుచు,

సామాన్యుల కొక జడునివలె భాసించును. స్వర్గమునే భూమిగా చేసి మానవాళి సుఖశాంతులతో నింపుదునన్న భగీరథప్రయత్నమున కున్ముఖుడై యుండును. అద్భుత శక్తుల నూహించును; చేయరాని దేదియు ఆతనికి దృష్టిగోచరము కాదు. తాను ముట్టినదెల్ల బంగారము చేయగలనను పూర్తి విశ్వాస మాతని కెన్నడును వదలదు. ఇట్టివాడు ఉపాధ్యాయుల, బంధువుల, సహచరుల అపహాస్యమునకు గుఱియగుచుండును. అయినను అధైర్య మాతని దరికిరాదు; తాను కించ నొందడు; తన్ను గేలిచేయువారి నాగ్రహింపడు. వాని నన్నిటిని తనకొక అగ్ని పరీక్షగా స్వీకరించి అందు విజయి యగుట ధ్యేయముగా కల్గియుండును. తల్లి దండ్రులు తమ పిల్లల ఈ కలలను నిరుత్సాహపరుపక వారితో, "మంచిది ప్రయ త్నించు. నీలోనున్న మహత్తరశక్తితో నీ ప్రయత్నము జోడించిన, నీ కలలు తప్పక ఫలించును. ప్రపంచము భ్రాంతి యని త్రోసివేయుదానిని నీవు చేకొని దాని సూచనల ప్రకారము నడచిన నీవు పరమసత్యమువైపు తప్పక సాగెదవు." అని ఉత్సహింపజేయుట యెంతయు అవసరము.

బాలుని ఆశలను వృద్ధిపఱచు బోధలతో ఆతని కలలను వాస్తవమొనర్చు టకు సాయపడు విషయముల నాతనికి చెప్పవలెను. అంతేకాని, హేమాహేమీలు చేయలేక వదలినదానిని నీవెక్కడ చేతువను నిరాశావాక్యముల నాతని చెవిని వేయరాదు.

ఒక పాప ఉత్సాహముతో నున్న, వాని ఉత్సాహమును నీఱుకార్చకుము. వానితో నెన్నడును, "జీవిత మట్టిది కాదని నీకు తెలియును" అనకుము. "అవును ప్రస్తుతమట్లులేదు. వికృతముగనున్నది. దీని వెనుక బయటికి రాప్రయత్నించు ఒక అంద మున్నది. దానిని ప్రేమించుము, ఆకర్షించుము, "అనుము.

బాల్యముననే ఇట్లు బోధించబడిన, "జీవితము నిస్సారము, దుఃఖసాగ రము ఒకింతయు మంచిలేనిది," అను చౌకబారు తెలివిని విస్మరించు కష్టముం డదు. ఆ గ్రుడ్డి తెలివి జీవితమును పేలవ మొనర్చును; దుస్సహమొనర్చును. తాను కనిన సుందర స్వప్నము లన్నియు కృశించిపోవును. "నాలోనున్నది పరమసత్యము. జనులు దానిని భ్రమయని విఫలులగుచున్నారు. నేను దానిని

పొందుటకై కృషిచేయవలెను, దానిని పొందిననే పరిమితుడనగు నేను అపరిమితుడనగుట, అనంతుడనగుట. నాలో దుష్టేచ్ఛలు లేకెత్తకుండుగాత,'' అను భావన నీలో స్థిరపడినవేళ, నీవు విజయివి కాకతప్పదు—ఎప్పటికైనను.

అంత నీలోని ప్రతి జీవకణమును జాగరితమగును. నీ దేహమే నీతో సహకరించును. సంకల్పబలమున సర్వము సాధ్యమే అను దృఢ నిశ్చయము కలుగును.

కావున (అతిబాల్యముననే కానోపు) నీకీ అంతర్గత సంతోషము, సౌందర్యము, ఎఱుక— వీని అనుభూతి కలిగినచో, ''ఓహో, ఇదే నేను వాంఛించునది.'' అను భావము పొడకట్టినచో, దాని సిద్ధికొఱకు కృషిచేయుము. ఒకపర్యాయము పొందినది మఱల పొందగలనను విశ్వాసముతో పరిశ్రమించుము. దానిని గాఢముగ వాంఛించిన తప్పక వచ్చును, ముమ్మాటికిని వచ్చును.

అవకాశము చిక్కినపుడెల్ల దీని నభ్యసింపుము. నీలోనికి నీవు పొమ్ము, నీతో నీవు భాషింపుము, నిన్ను నీవు చూచుకొనుము.

నిరాశానిస్పృహలు లేక, అపశ్రుతులు లేని సత్యయుగమున దేహము వేరు సాయ మపేక్షింపక తన రోగముల తానే కుదుర్చుకొనెడిది. దేహమున కా శక్తి కలదను విశ్వాసము ప్రజకుండెడిది. నేడు అట్లుకాక తప్పుభావనల ప్రాబల్యమున దేహము తన సహజ విశ్వాసమును కోల్పోయి సహాయ మర్థించును. అధైర్యమునకు ఆకరమగును. దానివలన సామాన్య రోగములకు కూడ అది భీతి చెందును. ఉన్నబలముకూడ పోగొట్టుకొనును.

దేహమును వక్రగతి పట్టించకున్న అది దాని దుస్థితిని తానే చక్కబఱచుకొనును. ఈ చెడు ప్రాబల్యమునకు లోబడనిచో అది ఉన్నతాశయములవైపు తిరుగనోపును. ప్రయత్నము లేకయే దివ్యత్వప్రసూన సౌరభములు నలుదెసల వ్యాపించును. విజయము నీ అరచేత నున్నట్లే.

దేహమునకు తన దివ్యత్వభావన తెలియును. ఆ భావన నశించుచో దానిని తిరిగి పొంద ప్రయత్నించుటవసరము. ఎన్నో శక్తులు, ఎన్నోచక్కని వస్తువులు తనకున్నట్లు కలలు కను బాలునితో, "ఓ, జీవిత మట్టిది కాదు," అని ఎన్నడును అనకుము, అదొక గొప్ప అపరాధమునుమీ— జాగ్రత్త. అట్లుగాక, నీవు వానితో, "జీవితమట్లుండవలెను, తప్పక అది అట్లుండును—" అని ఉత్సాహముతో పల్కుము.

* * *

ఆగస్టు 7, 1957

శ్రీఅరవిందు లిట్లు వ్రాసినారు : "అతిమానసావరోహణ, దానిని స్వీకరించు వారి కందరకు సత్యపు టెఱుకలో దివ్యజీవనపు టవకాశము లన్నియు నిచ్చును. మన మాధ్యాత్మిక లక్షణములుగా వేనిని భావించుచుంటిమో, వేనిని కాదని త్రోసి వేయుచున్నామో, ఆ రెంటిని కూడ అది ఉపయోగించును."

(అతిమానసచేతనాభివ్యక్తి; సంపుటి 16, పుట 47)

మీరు తెలుసుకొనవ గోరువదేది? కాదమనదేది? దేనిని కాదందుము? — అది వ్యక్తుల ననుసరించి యుండును. మీరడుగునదేది?

మనసము కాదనుచున్నదేదియో మాకు తెలయుట లేదు.

ఆ: అది యుక్తమే. ఇచట మన మేదియు కాదనుటలేదు. తెలియక పోవుట కడియేకారణము. ఇచట మానవులు చేయగల సకలకర్మలు చేపట్టితిమి. ఆధ్యాత్మికములు కావనుకొనువాటినికూడ అంగీకరించితిమి. వాని స్వభావమును మార్చుట ఎంతయో కష్టమైనను దానికి ప్రయత్నించుచుంటిమి. దానిలోనుంచ గల శుభేచ్ఛనంతను ఉంచుచుంటిమి

"అవరోహణ మార్పును సులభముచేయు" ననిరి శ్రీఅరవిందులు.

ఇట రెండు విషయములున్నవి, వాని, ప్రతిఘటన చాల అధికము.— రాచకీయసంబంధమైనవి, ధనసంబంధమైనవి. ఈ రెంటిని గూర్చిన మానవ దృక్పథము మార్చుట కడుంగడు కష్టము,

స్థూలముగ మనకు రాచకీయములతో సంబంధము లేదంటిమి. నిజమే, నేటి రాచకీయములతో మన కెట్టి సంబంధమును లేదు. కాని రాచకీయములను వాని నిజధర్మమున నర్థము చేసికొనిన, వాని యుద్దేశ్యమిది; దొరతనముయొక్క వివి ధాంగములను సామాజిక జీవనము సక్రమ పద్ధతిని నడిపించి, జనసామాన్య జీవి తమును వ్యవస్థీకరించుట; ఇతర దేశముల ప్రభుత్వములతో సత్సంబంధము నేర్ప అచుకొనుట. ఈ విధమైన క్రియాకలాపము తప్పక అతిమానసముచే అభివ్యక్త ముకావలెను, జాతీయజీవితము, అంతర్జాతీయ సంబంధములు నేడున్నటులనే ఉన్నంతకాలము, అతిమానస (ఆనంద) జీవితము భువిపై అసాధ్యము. ఈ మార్పు మిక్కిలి అవసరము. దీనికై విడువని కృషికావలెను.

ఇక ధనము సంగతి ఇచ్చిపుచ్చుకొనుట. ఉత్పత్తిపద్ధతుల రూపొందించుట, ఇవి అతిసరళముగా నుండవలెను. అనాగరికజాతుల వరకు మార్పిడి పద్ధతికంటె ఎక్కువతేలికయినదిగ, ప్రపంచమంతయును అమలుజరుపదగినదిగ నుండవలెను.

దీనిని నే డతిక్లిష్టము, అయోమయమొనర్చితిమి. ఎంతయో సహజముగ, శ్రేయోదాయకముగ నుండవలసినది నే డనేక వ్యథలకును కలహములకును ప్రపంచము దిగజారుట దీని అస్తవ్యస్తముననే; అన్యోన్యత ఆకాశకుసుమమగుట దీననే. ఇదిట్లే సాగిన కొంతకాలమునకు మనమొక వెలువడరాని వలలో బంధితులము కాక తప్పదు. ఆ వల మనల దాని చిక్కులలోని కీడ్చుట ప్రారంభించినది. ఇతరదేశమునుండి యే చిన్న వస్తువు కావలసినను అనేక విస్మయకర సాధనల విపిగి, ఫలములేక, చివరకు తనకున్న తన పొలమున పండిన దుంపలతోనే తృప్తిపొందవలసిన స్థితి దాపురించినది.—దేశములమధ్య ఇనుపతెరలు ఏర్పాటుచేయుట కారణముగ.

పై రెంటను సులభముగ వదలించుకొనరానివై మానవుని అజ్ఞానశక్తుల కధీనమయినవి, ద్వేషముల కారకమయినవి, సత్యమును దూరముచేయునవి, వాస్తవికాభివృద్ధిని నిరోధించునవి యైనవి. దీనికి అలవాటుపడి ఇదియే శ్రేష్ఠమయినదని విశ్వసించి మనిషి శ్రేయోమార్గాన్వేషణ కుత్సహించుటలేదు. ఈ స్థితిని ధిక్కరించి నవ్యమార్గ మనుసరించుట కెంతయో ధైర్యసాహసము అవసరము. దీని నిట మనము ప్రయత్నించుచున్నాము,—అత్యంతవసరమగుట అతిమానస జీవితావిర్భావతికి,

ఆర్థిక సాంఘిక పరిస్థితులు మార్చుట ఎక్కువ తేలిక. సోదరభావము; సంఘవికాసము, ధనికుల, దీనులమధ్యగల అంతరము తగ్గించుట మొదలగు సంఘశ్రేయస్కర మార్పులు మనిషి ఎఱుకకు అందుబాటులోనున్నవి, అవి న్యాయసమ్మతములను నమ్మికకూడ కొంత కలదు. రాజకీయములు తలెత్తగానే ఇవికూడ అసంభవములుగ, గాలిమేడలుగ తోచును.

ప్రక్రియ లెన్నియో శ్రేయఃప్రాప్తికరము లగునవున్నవి. వానిని సద్బుద్ధితో క్రమపద్ధతిలో వాడిన మానవశ్రేయము తేలికగ చేకూర్పనగును, శాంతిసౌభాగ్యముల కనువగు సరళమార్గము లనేకములుండ, మనుజులు శుష్కమును, జటిలమును, హానికరములగు మార్గముల చేపట్టిరి.

నేడు విమానములు మనుష్యులను భూమి ఒక చివరనుండి మఱొక చివరకు ఎనుబది రోజులలో గాక అతి తక్కువరోజులలో తీసుకపోవుచున్నవి. అయినను విదేశీ మారకసమస్య లతిక్లిష్టములగుట బహుళసంఖ్యాకులు విదేశయాత్రల జేయలేకున్నారు. నీవు పోవు దేశనాణెము లర్థింప నిన్నడుగు ప్రశ్నలివి: "నీ ప్రయాణ మంత అవసరమా ? కొంతకాల మాగలేవా ? మేమిపుడు చిక్కులలో నున్నాము." నే ననునవి వేళాకోళపు మాటలు కావు. బాధ్యతతో కూడినవి—: దీనిభావము: తాను జన్మించిన దేశమున మనిషి అంతకంతకు బందీ అగుచున్నాడు. విజ్ఞానము పెరుగుచున్నది. మనిషి విశ్వపౌరు డగుటకు సమస్తావకాశములు లభింపుచున్న సమయమున ఈ దుస్థితి శోచనీయము. మంచిది. ఇదీ పరిస్థితి. గతసంగ్రామమునుండి ఇది మరింత దిగజారినది. గమ్యము చాల స్పష్టముగ ఎదుట కానవచ్చుచున్నది. కాని, దాని చేరుటకు త్రోవ తెన్ను లేకున్నది. ప్రపంచము మనుగడకే ముప్పు వాటిల్ల నున్నది. దానిని గ్రహించిన మనిషి దానిని నివారించు ఉపాయముల కానలేకున్నాడు. ఒక ప్రళయము వచ్చిన నంతయు చక్కబడునన్న భావము పెరుగుచున్నది. నిషేధములు, అసంభావ్యములు, ఖాయిదాలు, చట్టములు. వీటిమధ్య చిక్కుకొని మనిషి ఊపిరి కూడ పీల్చుకొనలేకున్నాడు. ప్రభుత్వమా ! తాను రచించిన ఉక్కుపంజరముల చిక్కుకొని, సర్వము నాశము చేయక ముక్తిలేదను భావమును పెంచుకొనుచున్నది. (ఆగి) ఇది దురదృష్టము. జీవిత మింకను దుస్సహమగుచో, మనిషి పూర్తిగా నిస్సహాయుడగును. అయిన నొక వెలుగు దూరమున మినుకుమిను కనుచున్నది, జీవితము శాంతిసౌభాగ్యముల సర్వులకు నీయగలదను ఆశ అచ్చటచట రేకెత్తుచున్నది, ఈ విధముగా దేవాసుర సంగ్రామమున కివి రెండును (ఆశా నిరాశలు) సిద్ధమగుచున్నవి. ఏదో ప్రేలుడు, వీని సంఘర్షణ తప్పనిచో కల్గకపోదు.

(మౌ న ము)

ఇది నేటి ప్రపంచస్థితి. ఇదేమంత ఉజ్వలముగా లేదు. అయినను మనము చేయగలది మిగిలియున్నది. అతిమానసశక్తిలో నమ్మకమున్న మనకు, దానిని పొందుట కాసక్తియున్న మనకు, పుదుచ్చేరిలోనే కాక ప్రపంచమంతను గల శ్రీఅరవిందుల శిష్యవర్గమునకు ప్రత్యేకవిధాయక మున్నది. రానున్నవిపత్తు తప్పక

పోవచ్చుగాక, దానిని లక్షింపక, తమ ఇచ్ఛాశక్తిని ప్రకోపింపజేసి, సుఖశాంతుల ప్రపంచమున కల్గింపగల అతిమానసశక్తి నిటకు తెచ్చు సకల ప్రయత్నముల చేయ వలసి యున్నది. ఇక కాలవిలంబము మృత్యుతుల్యము. భయపడు ప్రళయమే వచ్చినను దాని బీభత్సమును పరిమితముచేసి ప్రపంచమును పూర్తి నాశనము నుండి కాపాడవచ్చును.

చీమకుట్టినట్లు నిదురింపబోక, జరుగువానిని వాని యిష్టమునకు వదలక, బృహత్తరప్రయత్న మొనరించి వెలుగులోనికి చేరిన, మనిషి మానవుడుగా తలెత్తుకు తిరుగవచ్చును. సకల బీభత్సములను చికాకులను దాటి, ఉన్నతమగు ఎఱుకలో హాయిగ ఏ ఒడుదుడుకులు లేక బ్రతుకవచ్చును; ఇది సాధ్యము, సుగమము. గతసంగ్రామ సమయమున శ్రీఅరవిందులు ప్రయత్నించిరి, అతి పరిమితక్షేత్రమున. పూర్తి యిచ్ఛతో ఎవని కర్తవ్యమును వాడు సక్రమముగ నిర్వహించిన ఫలితము రాకపోదు.

* * *

ఆగస్టు 14, 1957

నేటి సాయంకాలము ప్రశ్నలు-జబాబులు కాక శ్రీఅరవిందుల స్మృతిపై ధ్యానము కోరుచున్నాను. వారి స్మృతిని మనలో నెట్లు సజీవముగ నుంచగలమో, ఆయనపట్ల మన కృతజ్ఞత నెట్లు తెలుపగలమో, ఆ విషయముపై మన ధ్యానము. ఆయనచేసిన మహత్తరకార్యములు, ఆయన దేనికై జన్మించెనో, చేతనోజ్వల జీవనసిద్ధి నెట్లు పొందెనో దానిపై నేటి మన ధ్యానము. ఆయన తన దివ్యదేహమున నిప్పుడును ప్రపంచమున దివ్యజీవనము సిద్ధింపజేయుటకే నిత్యము శ్రమించుచున్నారు.

రేపాయన జన్మదినము. విశ్వేతిహాసమున నది యొక శాశ్వత జన్మదినము.

* * *

ఆగష్టు 21. 1957

మాతా, కొంత కాలమునుండి ఒక అభిప్రాయము ప్రబలుచున్నది. ఘన క్రియాకలాపములలో ఎఱుక దిగజారినదని అనుకొనుచున్నారు. ఆశ్రమ విస్తరణయే దాని హేతువను భావము వినబడుచున్నది. అది నిజమా ? సరిదిద్దుకొనుట ఎట్లు ?

మీ ప్రశ్న ఆశ్రమమున జరుగుచున్నవాటి కన్నిటికిని వర్తించునా? లేక ఆటలకే పరిమితమా?

మాతా, నాకెన్నో తెలియవు. నేను చూచిన వాటిలో....... ....

(కొంత ఆగి) ఇది చాలా జటిలము. విస్పష్టపఱుప యత్నింతును.

బహుకాలము ఆశ్రమ మొక వ్యక్తుల కూటమిగ నుండెను. ఒక్కొక్క-డొక విభాగపు ప్రతినిధిగ నుండెను. సామూహికవ్యవస్థ లేని వ్యక్తిగానే యుండుచు వచ్చెను. చదరంగపు బల్లపై పావులవలె వారుండిరి. చూచుటకే ఏకత్వము—ఒకే స్థలము, కొన్ని ఉమ్మడి అలవాట్లు. అవికూడ తక్కువే, ఎక్కువ కావు. ప్రతివాడును పురోగమించుచుండెను—లేదా పురోగమింపకుండెను. వ్యక్తుల సామర్థ్యమునుబట్టి విలువ, సమాజమునుబట్టి కాకుండెను. ఇట్లు చాల కాలముండెను. ఈ మధ్యనే వాస్తవికమగు ఐక్యతయొక్క ఆవశ్యకత పొడసూప దొడగెను. ఆశ్రమవాసులలోవనే కాక శ్రీఅరవిందుల అతిమానసశక్తి జాగరితమయిన పర్వ్వలలో ఈ అక్కఱతోచెను. ఈ సంఘటనను శ్రీఅరవిందులు అతిమానసపు ఎఱుకలో జీవించుట కారంభించు సమాజోద్భవమనిరి. వ్యక్తిగత పరిపూర్ణత లేకున్నను—చాల దూరముగ నున్నను— ఏకకుటుంబ జీవనావశ్యకత వీరిలో రేకెత్తినది. అంతర్గతముగ దాని సిద్ధికై ప్రయత్నము సాగుచున్నది.

ఇది కొన్ని ఇక్కట్టుల కాకరమయ్యెను. ఇదివరలో వ్యక్తివైపు ఎక్కువగా మొగ్గుట ఇప్పటి కొన్ని అలవాట్ల కాటంకమయ్యెను. బాహ్యవ్యవహారములు పైకి వెనుకటివలెనే యుండెను. కాని అంతర్గతపు లోతుల వైవిధ్యములు గోచరించెను. వ్యక్తిగత పురోభివృద్ధి వెనుకపడెను. తాముత్కంఠతో ప్రారంభించిన ఐక్యతాసిద్ధిలో విశ్వాసముతగ్గెను. ఇతరుల బరువులు మనపై వేసుకొనుట భయహేతువుకాదా? ఇది తాత్కాలికము మాత్రమే. క్రమముగ విశ్వాసము పుంజుకొని ఐక్యతాభివృద్ధి యగుట నిశ్చయము.

ప్రతివ్యక్తియు ఎఱుక కల్గి, దిగజారక, మార్పు కనుకూలమగు శక్తుల, ప్రాబల్యముల కనురక్తుడగుచో, ఐక్యతాసిద్ధిలో (సంఘ మొక్కవ్యక్తిగా వ్యవహరించుట) ముందంజవేయగలడు,

ఈ ఐక్యతాభివృద్ధినిగూర్చియే మీకు తెల్పుట కుద్దేశించుచున్నాను. వ్యక్తిగతాభివృద్ధి ఐక్యతాభివృద్ధికి దారితీయవలెను. ఈ అభివృద్ధి స్పిరల్ (Spiral) మార్గమున సాగునది. ఒక విజయమునుండి మఱొక ఉన్నతవిజయమునకు చేరుట వంటిది. ప్రతిసాధకుడును ఎక్కువ ఎఱుకతో ముందుకు నడచిన సంఘాభివృద్ధి శీఘ్రముగ సాగును.

ఆశ్రమము చిరస్థాయిగ నుండుటకు, ప్రతి ఆశ్రమవాసియు ఈ అక్కఱను గాఢముగ పొంది, జీవితసార్థకత అప్పుడే యను దృఢవిశ్వాసము కల్గియుండి, ఈ ధ్యేయముతో నిరంతరము శ్రమించుట అవసరము. మంచిది. మన మీ సర్పిలలో కొంత అడుగున నున్నాము (పూర్వముకంటె). కాని, దానిని తప్పక అధిగమించి ఇంకను ఉన్నతస్థాయిని చేరగలము.

కావున, ఇదిగో జబాబు.

నేను చెప్పినదానికి వ్యతిరేకములగున వెన్నో యుండవచ్చును. ఏ నూతన ప్రయత్నమునైనను, పూర్వము నిద్రాణములై యుండిన శక్తులు ప్రతిఘటించుట

సహజము. అభివృద్ధినిరోధకశక్తు లెప్పుడును ఉండునవే. కాని, విడువని పట్టుదలతో. స్థిరమగుధైర్యముతో వాని నెదుర్కొనిన గెలుపు తథ్యము.

* * *

ఆగస్టు 28. 1957

మాతా, శ్రీఅరవిందులిట్లు వ్రాయుచున్నారు: "అతిమానస శక్తులు మానవాళినంతను ప్రాభావితము చేయునో, లేక మార్పుకు సిద్ధమగు ఏదేని ఒక భాగమునే ప్రాభావిత మొనర్చునో అనునది విశ్వస్థితి కేది సాధ్యమో, ఏది నిర్దేశింపబడియున్నదో దీనిపై ఆధారపడియున్నది"—

(అతిమానసాభివ్యక్తి— సంపుటి 16, పుట 56)

దీని అర్థము? "సాధ్యమో, నిర్దేశింపబడియున్నదో ?" ఈ రెండును భిన్నములు. ఇంతవరకు మీరన్నదిది: "మానవాళి మారిన, అది నూతన జన్మలో పాల్గొనదలచిన—"

భిన్నము కావు, రెండును ఒకటే. పైనుండిచూచిన వస్తువు అడ్డముగా కనిపించును. మరొకస్థానమునుండిచూచిన అదియే నిలువుగా కనిపించును.

(మాత తన చేతిలోని పుస్తకము అట్టవెనుకభాగము చూపుచు). కావున, పైనుండి చూచునపుడు, "ఉద్దిష్టము" అందుము—క్రిందినుండి చూచుచో, "సాధ్యము" అందుము.... ఒకటే భిన్నదృక్పథములనుండి రెండుగా తోచుచున్నది.

అట్లయినచో మన అసమర్థత వలనను, అయిష్టత వలనను కలుగు నష్టమేదియు లేదనా ?

ఈ విషయ మెన్నో పర్యాయములు చెప్పియుంటిని. నీవు మానసికపు తెలుకనే వ్యవహరించుచో, అది ఎంత గాఢ మయినను, కార్యకారణములు పూర్వమే నిర్దేశింపబడినవను భావమున నుందువు; "అవి అట్లున్నవి కాబట్టి అట్లున్నవి. మఱొక విధమున నుండ వీలులేదు."

మానసికపు తెలుక నధికరించిననే, వస్తువుల నిజస్వరూపస్వభావము లాని ననే, నీ వకస్మాత్తుగ సర్వస్వతంత్రుడవయ్యెదవు. ఈ భావన ఆధ్యాత్మికమ నుము, లేక దివ్యమనుము— అప్పుడు నీకు సాధ్యముకాని దేదియు లేదు; అన్నియు సాధ్యమే—

(మౌనము)

ఆ స్థితి ననుభవించినవారును, దానిలో ఒక క్షణమైన జీవించినవారును ఒక నిరంకుశ శక్తి సర్వమును నడిపించుచున్నదను భావన పొందెదరు— అది కార్య కారణరహితముగకూడ వారికి తోచును. దానినుండి యొక దేవుడు, ఎదిరింప రాని శక్తిసామర్థ్యములు కలవాడు ప్రపంచాధినేత యను సాంప్రదాయిక విశ్వాసము కల్గినది. ఈ తప్పు వర్ణనయే ప్రతి విద్యాధికుడు ఇట్టి దేవుని నిరాకరించుటకు హేతువయినది. సంకల్ప శబ్దమువలన వచ్చిన బాధ ఇది. భగవత్సంకల్పము నిర్దిష్టముకాదు, ఎన్నికకాదు. అదొక దర్శనము, అననగునేమో ! వస్తువుల యునికి మన చూచుటవలన కల్గుచున్నది. కాని అది మన ఈ కళ్ళతో (మాత తన కండ్లను తాకుచు) చూచువిధముగాలేవు. అయినను మన కివియే అందుబాటులో నున్నవి. అదొక దర్శనము, క్రమముగా ఉన్మీలనమగుచున్న దర్శనమీవిశ్వము.

కావుననే శ్రీఅరవిందులు, "ఉద్దేశింపబడిన"—"సాధ్యమయిన" అనిరి, విశ్వమిదియు కాదు, అదియు కాదు— వర్ణన దాని అపభ్రంశమే, అది క్రమముగ విస్తరించునది, మీ చక్షువులయెదుట.

(మౌ న ము)

అదొక చలనచిత్ర మీ విశ్వము. కాలావకాశముల తెరపై విస్తరించు కొలది వస్తురూపము దాల్చునది,— ధ్యానమున గననగునది. పరమాత్మప్రతి బింబమే యది—ఆయన తన ప్రతిరూపమును భావించుకొనుచున్నాడు.

* * *

సెప్టెంబరు 4, 1957

శ్రీఅరవిందుల జన్మదినమునకు వెనుక రోజు ఆగస్టు 14 సాయంత్రమున నేను వాడిన వాక్యమునకు సంబంధించిన యొక ప్రశ్న నేడు నా కందినది. ఈ ప్రశ్న నాలో కుతూహలము కలిగించెను. ఆ వాక్యమట్లు గుప్తార్థయుతముగ బుద్ధిపూర్వకముగనే వాడబడినది. ఎవరి ఎఱుక ననుసరించి వారు దాని నన్వయము చేసుకొనుటకు వీలు కల్పింపబడినది. నే ననేకపర్యాయము లీ బహుళార్థవాక్యముల గూర్చి చెప్పియుంటిని. మాటలు తేలికవి—సామాన్యార్థము సులభముగ ఎల్లరును గ్రహించగలరు, గుప్తార్థములు మనిషి ఎఱుక ననుసరించి యుండును.

ఈ బహుళార్థము లొకదాని నొకటి పూరించును. విరుద్ధములు కావు, ఏ స్థాయి కది సమగ్రము, సకలార్థములు ఒకేసారి గ్రహించువా రుందురు,

వివరించి యీ విషయమును నేడు మీకు చెప్పెదను. మాటలుచాలక ఒకేమాట పెక్కు అర్థములలో వాడబడుచున్నది.

శ్రీఅరవిందుల జన్మదినమునుగూర్చి చెప్పినదానికి సంబంధించిన దీప్రశ్న. ఆయన జన్మదినమును నేను "శాశ్వతజన్మదినము"గ అభివర్ణించితిని. ప్రశ్న: "శాశ్వతము" అన్న పదమున కర్థమేమి?

ఆ పదమును దాని వ్యుత్పత్త్యర్థమున తీసికొనిన ఏమంత స్ఫురణీయము కాబోదు. "శాశ్వతజన్మదినము" దాని అర్థము భౌతికముగ, మానసికముగ. చైత్యాత్మికముగ, ఆధ్యాత్మికముగ వివిధగతుల సమర్థింపవచ్చును.

భౌతికముగ— ఈ జన్మఫలము భూమి ఉన్నంతకాలముండును. ఆయన చేసిన మహత్తరకార్యములు భూమిపై మనుష్యు లున్నంతకాలము స్మరింపబడుచునేయుండునని అర్థము. స్వల్పముగ ఉత్ప్రేక్షించి 'శాశ్వత' మంటిని.

మానసికముగ—వారి ఘనకార్యములు మనుజులలో తెచ్చిన అద్భుత మార్పులను అశేషజనము యుగములతరబడి తమ జన్మసాఫల్యతకొఱకు అనుసరించుచుందురు. స్మృతిపథమున నాత డెన్నడును నిలిచియుండును.

చైత్యాత్మికముగ—శ్రీఅరవిందు లవతారపురుషుడు. ప్రతి యుగమునను జన్మించువాడే, మానవోద్ధరణమతితో. పేరులు వేరగుగాక, భౌతిక దేహంబున పూతాత్ముడు అరవిందుడు మానవుల నుద్ధరించుటకై మఱల మఱల జన్మించును.

ఆధ్యాత్మికము— పరమాత్మయే యీ రూపమున భువిపై అవతరించెను. రూపధారియై నామరూపముల దాల్చెను. కాని, ఆయనకు రూపమేమి? జన్మ ఎక్కడ? శ్రీఅరవిందులా పరబ్రహ్మమే.

"శాశ్వతజన్మము" లో నింత అర్థ మిమిడియున్నది. మీ కొక సలహా: ఇకముం దెప్పుడును, "నా కర్థముకాలేదు" అని అనుకొనక, "నా మేధ కది అతీతమేమో ! మాటల అర్థముతో సంతృప్తిపడక, వాని వెనుకనున్న భావమును గ్రహింప యత్నించెదను" అని అనుకొనుడు. మంచిది.

మన ధ్యానమునకిది చక్కని విషయము

(ధ్యానము)

* * *

సెప్టెంబరు 11, 1957

కరుణామయీ, మాతా, మొదటిసారిగా చూచిన వారిలో కొందరియెడ సద్భావ మేల కల్గును ? కొందరిపై వైముఖ్యభావ మేల ?

దీని కాధారము ప్రాణశక్తిస్పందనము, అన్యము కాదు. ఈ స్పందనము లిర్వురిలో పరస్పరానుకూలముగనున్న సద్భావము, లేకున్న వైముఖ్యము. ఇది ప్రాణరసాయనిక శాస్త్రమునకు సంబంధించినది. మరేమియు కాదు. చైత్యాత్మజ్ఞానదృష్టి గల అవగాహనతో మనము తుల్యాశయములుగల వారిని స్పృశింప వచ్చును. ఒకే గమ్యమువైపు పోవువారు సన్నిహితులగుదురు, తద్వ్యతిరేకులు అయిష్టులగుదురు. ఆధ్యాత్మికాభివృద్ధి పథముననున్న సాధకునికే యీ విచక్షణ సాధ్యము. ఈ అంతర్గత విచక్షణాశక్తి ఆకర్షణ వికర్షణలుగా మారక విషయ పరిజ్ఞానముగ నిలుచును. అది నీ కే యొడుదుడుకులును లేని సిద్ధమార్గమున సాగి పోవుటకు సాయపడును.

తేలునదిది—నిశ్చితమైన ఇష్టానిష్టములు గలవారు ప్రాణకోశజీవులు, వానితో మనఃకోశానురాగములు కలియనోపును. మేధావంతులు ఉమ్మడికార్యములలో సామాన్యులతో కలసినను వారి ఔన్నత్యము నచటకూడ ప్రదర్శింపకపోరు. తామితరులకంటె స్థిమితముగాను ఉదాసీనముగాను ఉండగలరు. కొందరితో మాట్లాడుట సంతోషకరము; ఇక కొందరితో, బాధాకరము, దానికి తగిన కారణము కనిపింపదు. నే నిదివరలో చెప్పిన రసాయనిక మార్పువలన కానోపు. ఆకర్షించుకొనునవి కలవు, వికర్షించుకొనునవి కలవు. కొన్ని ఒకదానితో నొకటి కలియునవి కలవు, అట్లు కలియగనే ప్రేలెడునవియు కలవు. అట్లే ప్రాణస్పందనములును— అత్యంత సమానస్పందనలనే ప్రేమ యని అందురు. "ఓ, ఈ అమ్మాయినే అన్వేషించుచుంటిని," "అమ్మయ్య, ఈతడే నే వేచియుండునది"- (నవ్వుచు) వా రొకరి కొఅకొకరు పర్వెత్తెదరు, చివర కంతయు మాయగా తెలిసికొందురు. ఈ ప్రేమానురాగములు చిరకాలము నిలుచునవి కావని గ్రహింతురు. అదీ సంగతి. యోగసాధకులకు నేనిచ్చు మొదటి సలహా— రాగవిరాగముల కతీతులుగ నుండుడు. ఈ ప్రేమ అవాస్తవికము, క్షణభంగురము. కష్టపరంపరలకు నాంది కానోపు. జీవితమునే నాశము చేయగలదు. దానిని లక్షింపకుంట శ్రేయము. గాఢముగ యోచించిన ఈ రాగవిరాగములలో ప్రత్యేకత ఏదియు లేదని తెలియగలవు.

సాధనలోనే మునిగి యుండెడి సందర్భములలో (తగ్గించిన స్వరమున) ఒక సంపర్కమనుకూలముగను, మరొకటి అననుకూలము, హానికరముగను తోచవచ్చును. కాని అది విశేషముగ అనాసక్తితో కూడినదై యుండును. కొన్ని ఆకర్షణావికర్షణల సంబంధమే యుండదు.

కావున, సకల సంపర్కములను దూరము నుండియే గమనించుచు, వాని నిరర్థకతనుగూర్చిన వివేకము పొందుట ఉత్తమము.

చెడుస్వభావము లున్నవి; అకారణముగ హానిచేయుటయే పనిగాగల ప్రవృతు లున్నవి. అట్టి వారిని పశువుల కంటె నీచు లననగును. వారి బుద్ధులు వక్రించినవి. ఇట్టి స్వభావుల సంఖ్య అల్పము. పెక్కురు మిశ్రమ స్వభావులు. మీ

స్వభావముకూడ దానికి భిన్నము కాదుగదా ( నవ్వు ). కావున, నైరాశ్యమున కాస్కారములేదు. ఒకే జాతిపక్షులొకచో చేరును. సదృశములే సన్నిహిత మగును.

కొందరు రక్తాశను లుందురట, వారు ఎదురగువారి ప్రాణములను పీల్చి వేయుదురు. ఇది ఉత్ప్రేక్ష - నూటికి నూరుపాళ్ళు కిరాతక స్వభావులరుదు. కావున ఆధ్యాత్మికాభివృద్ధిని కోరువారు మొదటగా రాగద్వేషముల (ఆకర్షణ, వికర్షణల) నధిగమించవలెను. సకలము ప్రశాంతముగ తిలకించవలెను.

(మౌనము)

"భువిపై నవ్యమానవాళి మానసిక జీవులగుదురు- వారీ భౌతిక దేహముననే యుండియు విశ్వీయమగు అజ్ఞానమునుండి బయటపడ్డవారుగ నుందురు. వీరు సత్యమునకు దగ్గరగా జీవించుచు పాక్షిక దివ్యజీవులుగ నెన్న నర్హులుగ నుందురు. వీరు సమగ్రవుటున్నత జీవులగుదురో లేక కొంత అజ్ఞానముననుందురో చెప్ప వలను పడదు. ఇది విశ్వపరిణామపు టుద్దేశ్యముపై ఆధారపడియున్నది - ఇది సర్వులకును అందుబాటులో నుండునో, లేక అగ్రగాములగు కొందరికేనో చెప్పజాలము."

(అతిమానసాభివ్యక్తి— సంపుటి 16, పుట 20)

ఈ ఉద్దేశ్యము ఎఱుంగరానిదా ?

నీకు తెలియునా? ....నీకు....నీకు..?

పరిణామమున కొక గమ్యమున్నదనుట నిశ్చ
యము. మధ్యలో ఆగుట సాధ్యము కాదు.

శ్రీఅరవిందుల రచనల చదివియుంట మీకిది తెలియును. ఓ బజారున పోవువాని నడుగుడు.—"విశ్వపరిణామపు టుద్దేశ్యమేమి" ? యని. "నాకు తెలియదు— చదువుకున్న వారి నడిగిన చెప్పెదరు", అనును. శ్రీఅరవిందులు దీనిని యోగముచేయని వారిని, తన గ్రంథములను చదువని వారిని ఉద్దేశించి వ్రాసిరి. దేహవ్యాయామమే సమస్తమును అనుకొనువారి నుద్దేశించి వ్రాసిరి. వారి దృక్పథమునుండి, వారి యూహల నాధారముగ చేపికొని ప్రారంభించి వారిని కొంత ముందుకు నడుపయత్నించిరి.

అయినను, ఆయన గ్రంథములు చదివినవారి నొక్కొక్కరినే ప్రత్యేకముగా పిల్చి, వారు చదివినది కాక వారి అనుభూతిని చెప్పుమనిన, విశ్వపరిణామోద్దేశ్యమేమని ప్రశ్నించిన, దానినిగూర్చి వారి యూహల జెప్పుమనిన, వాస్తవమున కే యుద్దేశ్యమయిన ఉన్నదా ? యని అడిగిన,—నమ్మికతో జబాబిచ్చువారు చాల తక్కువమంది యుందురు. శ్రీఅరవిందుల గ్రంథములనుండి ఉటంకించువారే యుందురు.

నీ మట్టుకు నీ వాలోచించకున్న, చదివిన దానిని మననమొనర్చకున్న నీకు నిశ్చితాభిప్రాయము లెట్లు కల్గును ?

నేను నీవు చదివినదాని ఫలితము, నేర్చినదాని ఫలితముగూర్చి మాట్లాడుట లేదు. నీ స్వంత అభిప్రాయమును గూర్చి మాట్లాడుచున్నాను. నీకు చక్కగా గ్రాహ్యమయినదాని గూర్చి అడుగుచున్నాను. నీవు నీ అనుభవమును వర్ణింప గలవా ?

కలను—

"కలను" . నిన్ను నే నభినందించుచున్నాను.

నా ప్రమేయమే లేక అది అట్లగుచున్నది.

మంచిది. నీ యట్టివా రనేకులున్నారని ఆశించెదను. అంతే.

నాలో నెన్నియో పరస్పర విరుద్ధములగు భావము
లున్నవి. అయిన నేదో ప్రత్యేకమయినది కూడ కలదు.

మంచిది, చాల మంచిది. అట్లగుచో నీ విచట వృథాకాలయాపనము చేయ లేదని చెప్పగలను. (నవ్వు) మంచిది. మనమిపుడు మనలో నున్నదానిని చూచెదముగాక.

(ధ్యానము)

* * *

సెప్టెంబరు 18, 1957

మాతా, అతిమానస జీవితమున రహస్యజ్ఞాన
స్థానమేమి ? (గుహ్యవిద్య)

రహస్యజ్ఞానమునే ఏల తడవెదవు ?

సకలము తెలియును కోషన; తెలియదా ?

రహస్యజ్ఞానమే ఏల ? అతిమానసజీవితమున ప్రతియొక్క దానికిని స్థానమున్నది.

ఇది నీకు ప్రత్యేకముగ ఆసక్తిదాయకమా?

నాకు తెలిసినంతవరకు, కనరానివానిని కనిపింపజేయు శాస్త్రమది. కనిపించని ప్రపంచమును, కనిపించని శక్తులను— కాని, అతిమానస ప్రపంచమున సకలమును గోచరించును గదా.

రహస్యజ్ఞాన (గుహ్యవిద్య) మనగా నీ భావమేమి?

కనరాని ప్రపంచమును కనుట, గుహ్యశక్తుల జ్ఞానము.

నాకు స్పష్టముగ గ్రాహ్యమగుటలేదు. అతిమానసమున నే జ్ఞానము ఉండదనా లేక—

జ్ఞానము ఒనగూడియే యుండును. కావున-

ఒనగూడియే యుండునా! అయిన నది రహస్యజ్ఞానమే యగును!— నాకు గ్రాహ్యమగుటలేదు.

"దివ్యజీవనము" లో దీనిని శ్రీఅరవిందులు వివరముగ దెల్పియున్నారు. జ్ఞానమునకు, క్రియకు, అదొక ప్రత్యేక నిగమనము, అది మాయమగుటకు కారణము లేదు.

అది స్వాభావికపు టెఱుక యగును. అంత, బహుశః, రహస్యజ్ఞానాపేక్ష యుండదు.

ఓహో! పియానో నేర్చుకొనునట్లు గుహ్యవిద్య నేర్చుకొనెద వన్నమాట. (నవ్వు) కాని అది అట్లు కాదు. ప్రత్యేకాభినివేశము లేనివా రన్ని 'గుహ్యవిద్య' గ్రంథములను జదువవచ్చును. కాని, దాని ప్రయోగవిధానము వా రెఱుంగక పోవచ్చును. జ్ఞానము క్రియారూపమున పెట్టుటకు ప్రత్యేక సామర్థ్యము కావలెను.

పియానో వాయించు విధానము గ్రంథములలో చదువ వచ్చును. అయి నను దానిని వాయించకుండ దాని వాయించు విధాన మెఱుంగజాలవు. కాని, కొందరు సహజగాయకులు, సహజ కళాకారులు ఉన్నారు, కొందరు జీవితమంతయు నభ్యసించియు విఫలులగువా రున్నారు. గుహ్యవిద్యలో కూడ ఇంతే, అతిమానస జ్ఞానులేదయినను చేయగలరనిన అది యుక్తమే. కాని, ఆ శక్తి వారికి దానంత టదియే వచ్చునని యర్థము కాదు. ఒక దేదైన చేయగల్గియుండవచ్చును. కాని ఆత డన్నియు చేయవలసిన అవసరముండదు. అంతరములు, వర్గీకరణములు ఉండనేయుండును. ఎవని లక్షణములు వాని కుండును; అభిరుచులును భిన్నముగ నుండును. అతిమానసప్రపంచమున గుప్తవిద్యనే ఏల నిషేధించెదవు?

అతిమానస జీవితమున నీ యూహ ఏమి? ప్రతివాడును, ప్రతిపనియు ఒకే సామర్థ్యముతో చేయగల్గు స్వర్గమనియా? ప్రతివాడును వీణ వాయించు ప్రదేశ మను ప్రాతభావనయా? అట్లు కానేకాదు. అన్ని తారతమ్యములు ఉండును. విభిన్న విచక్షణాయుత కార్యకలాపము లుండనేయుండును. ఇట మానవు లజ్ఞాన మున వర్తింతురు. అట పూర్ణజ్ఞానమున వ్యవహరింతురు. అంతే, ఇదే అచట కును ఇచటికిని భేదము.

## సామర్థ్యములు కూడ పెరుగును; పెరగవా ?

సామర్థ్యములా? మీరు గుహ్యవిద్యను గారడిగా చూచుచున్నారు. అది గారడి కాదు.

అది ఎఱుకయొక్క ప్రత్యేకవ్యవహారము. అనగా, నేడు మనుష్యులు బాహ్యరూపముల ననుసరించి వ్యవహరించుచున్నారు. వాని వెనుకగల మూల

శక్తుల గ్రహించుట లేదు. కావుననే విపరీతఫలములు కల్గుచున్నవి, ఫలము వారి అధీనము కాకయున్నది. కాని ఆ ఎఱుకగలవారు తాము వాంఛించినదానిని నిశ్చయముగ పొందగలరు. ప్రతిదాని క్రియావిధానమును పూర్తిగ నేర్చియుందురు.

అతిమానస ప్రపంచమున మనిషి కీ శక్తులు నైజముగ నుండును. వానిని పొందు ప్రయత్నమవసరము కాదు —

అప్రయత్నముగనా? ప్రతివాడును తనకు తెలియకుండనే గుహ్యవిద్య నభ్యసించుచుండును. నీ ప్రతివానికినీ ఈశక్తి స్వతహాగ నుండును. అత్యంత స్వల్పమే యగుగాక. అదే నీ జీవనమును సాధ్యము చేయుచున్నది. ఆవిషయము నీకు తెలియకపోవచ్చును. పాప బ్రతుకుటకు గాలి అవసరమని భావించుచున్నదా? గాలిని పీల్చుట లేదా? అతిమానసపు ఎఱుకలో నీ కా వాస్తవము గ్రాహ్యమగును. నేటి స్థితిలో నీకా ప్రసక్తియే యుండదు.

నీ యోచన గుహ్యవిద్యాఫలితమే, నీకా సంగతి తెలియదు. నీ వొకని గూర్చి యోచించువేళ నీలోని యొక అంశ తనకు తానై వానితో సంపర్క మేర్పఱచుకొనుచున్నది. నీ తలపుకు ఇచ్చను జోడించిన, వానిని గూర్చిన వెన్నో నీ మనసున దోచును. ఇది గుహ్యవిద్యను వాడిన ఫలితమే. అన్యముకాదు. నీకు మాత్రము అట్లు తోచదు. కొందరు దీని నత్యంత శక్తిమంతముగ చేయగలరు. వారితలంపులు వారియెదుట మూర్తీభవించును. ఇతరుల కా శక్తి చాలక విఫలు లగుదురు. నీ యోచనాబలము మీదను, నీ ధారణా శక్తిమీదను అది ఆధారపడి యుండును. బుద్ధిపూర్వకముగనో, అవిచారితముగనో సర్వులు గుహ్యశక్తిని వాడువారే.

గుహ్యవిద్యానిపుణుడగు శ్రీ 'X' ను గూర్చి చెప్పియుంటిరి. అతిమానస ప్రపంచమున నిది సామాన్యమనియు, అందరును అతనివలె సమర్థులే యగుదురనియు భావించితిని.

కాని, ఎందుకిది ప్రత్యేకించితివో నాకు తెలియుట లేదు. గుహ్యవిద్యను విడదీయనేల?

అదృశ్యప్రపంచ జ్ఞానమంతయును గుహ్యవిద్యకు సంబంధించినదని తలంచితిని కావున—

సరే.

సామాన్యజీవితమున మనిషికి ఎఱుక లేకుండును, లేదా పాక్షికముగ నుండును. సంపూర్ణమగు ఎఱుక గలవానికి గుహ్యవిద్య కరతలామలకముగ నుండును.

ఇదంతయు బాగుగనేయున్నదిగాని, అతిమానస జీవనమున తరగతులు, తరతమ భేదములు ఉండవనియు; అంతయు సమానస్థాయిలో మిశ్రితమై యుండు ననియు తలంతువా?

అట్లుకాదు. స్థాయీభేదము కూడ నుండును.

కార్యాచరణ మార్గములు బహుళముగా నుండును. గుహ్యశక్తి సర్వసామాన్యమై యుండవచ్చును. కాని, యీ గుహ్యవిద్యాశక్తి సర్వులకు తుల్యమయినది గుహ్యశక్తి ఇక కాబోదని నీ అభిప్రాయమా?

అవును.

ఆ! మంచిది - నా అభిప్రాయము వినుము. తరతమ భేదములు పోవు. ఎవడి స్థానమున వాడుండి తాను చేయదగిన కార్యములను పూర్ణమగు ఎఱుకతో ప్రతివాడును చేయును. పోటీపడుట ఉండదీ అతిమానస ప్రపంచమున—అంద

రకును సుఖశాంతులు తుల్యము. ఏ సంశయమును లేక, కర్తవ్యము క్షుణ్ణముగ నెఱింగి ప్రతివాడు ఏతన్నిర్వహణమున అప్రమత్తుడై యుండును. ఎవని పాత్ర వాడు నిర్వహించుటలో వర్గీకరణముండునదే. అందరును ఒకే మూసలో చేసిన ప్రతిమలవలె ఒకే మాదిరిగ నుందురనుకొనకుము. అట్టి ప్రపంచము నూహిం చుటకూడ భయావహమే యగును.

అతిమానస, భౌతిక ప్రపంచములకు భేద మేమందురా? వినుడు, ఈ నవ్య ప్రపంచమున నీకు తెలియనిది, చేయరానిది ఉండదు. స్మరణమాత్రమున నీ కన్నియు స్ఫురించును. అది పూర్తిగ జ్ఞానభూమి. అజ్ఞానమున కట ఏ పాటి స్థానమును లేదు. అంతేకాని, అది వైవిధ్యమే లేని కలగలుపు వ్యవస్థకాదు.

(దీర్ఘ మౌనము)

* * *

అతిమానసముననే విభిన్నఅనుభవములిచ్చు భూమిక లున్నవనియు, ఇవి ఒక దాని తర్వాత నొకటి దృష్టిగోచర మగుననియు, విశ్వపురోగతి నెల్లపు డధి ష్ఠించి యున్న చైతన్యమే ఈ పనిని చేయుననియు శ్రీఅరవిందులనిరి. ఈ ప్రపం చరహస్యము కొందరికే తెలిసి (అదియు పాక్షికముగనే), కొందరికి తెలియకుంట అతిమానసజీవితపురోగతి నూహించుట కష్టము. అయినను లేదనిగాదు, క్రమముగా అతిమానసపు టగ్రభూమిక చేరుకొలదియు ఈ ప్రపంచము, దాని పరివర్తనము గూర్చిన కార్యకారణసంబంధములు గ్రాహ్యమై, నావలో పయనించు ప్రయాణికుని వలె గాక, నావను నడపి నిర్దిష్టప్రదేశము చేరెదనను సరంగు విశ్వాసముతో

మనిషి ముందడుగు వేయును. భగవానుని సహకర్మిగ మనిషి మారును. నేటి ప్రపంచమున తాండవించుచున్న అయోమయస్థితికాదు; దోబూచులాటకాదు.

ఏదియో యొక స్థానమును చేరుకొని అట విశ్రమించి, "అబ్బ! అంతయు ముగిసిన దింతకాలమునకు" అనుకొనుట మనిషి యభీష్టమని తలంతును. ఈ ప్రవృత్తిగల అతిమానసము అతి నికృష్టమే యగును. సంతతపురోగతిరూపమైన ఊర్ధ్వగతి అతిమానసలక్షణము. ఇందు చీకటిలో తడుములాటయుండదు. సర్వము వెలుగులో స్పష్టముగ గానవచ్చుచుండును. కావున, "ఇదటనుండునా?" లేక "ఇదట నుండదా?" అని అడుగవలసిన పనిలేదు. మన మూహింపని వెన్నియో అట నుండును. అసాధ్యము లనుకొనినవన్నియుగూడ అటనుండును.

* * *

సెప్టెంబరు 25, 1957

"మనకు నవ్యమానవాళి అనగా నవోదయము, ఒక జాతి మానసిక మనుష్యుల రాక." అది అజ్ఞానమున జ్ఞానమన్వేషించు జాతి కాదు; అయినను అజ్ఞానమును పూర్తిగ విడచినదియును కాదు, వెలుగున కున్మీలితమే యయినను నిత్యము వెలుగులో జీవించునది కాదు. స్వతంత్రముగ వ్యవహరించునది కాదు; అయినను విజ్ఞాన మనస్క యననగును. సత్య జీవనమునకు చాలి యుండును. చీకటి పొలిమేరలు దాటి వెలుగున ప్రవేశించు దశను చేరియుండును, మరికొంత పురోగమించిన

అతిమానసము చేరగల్గియుండును. ఈ జాతినుండియే అతిమానస పురుషు లెన్నిక చేయబడుదురు. వారీ భౌతిక సృష్టిపరిణామ నాయకులగుదురు."

(అతిమానసాభివ్యక్తి— సంపుటి 16, పుట 67)

శ్రీఅరవిందు లూహించిన అతిమానవుడు నేటి మానవునకును, అతిమానస రీతితో సృష్టింపబడు మానవునకును మధ్యగా నుండును. ఆయన మనల నట్లు పరివర్తనము చెందగోరెను. ఈ మానవుడు మిథునసంయోగ జన్మి కాబోడు.

మనము పశువులరీతినే మిథున సంయోగమున పుట్టితిమి. ఎంతగా పరివర్తన జెందినను కొంత పశుత్వము మిగులకపోదు. ఆయన యూహించినవాడు గుహ్యావిద్యా విధానములచే కలుగువాడు. ఆ శక్తులు స్థూలాకృతిదాల్చుట ద్వారాన పుట్టగలడు.

మధ్యంతరుల అవసర మున్నదనుట నిశ్చయము. వీరే అతిమానస మానవుల పుట్టించు మార్గ మారయువారు. ఆయన ఆ మాటల వ్రాయువేళ మనము చేయవలసిన దిదియను విశ్వాస మాయన కుండెను.

నా కొక నమ్మిక కలదు. ఆయన మనలనుండి ఆశించినది మనము తప్పక పొందెదము అని నా దృఢవిశ్వాసము. మన వ్యక్తిగత ప్రయత్నము, మన శుభాకాంక్ష అది సాధ్యపడు కాలమును నిర్ణయించును. అదే మన ప్రధాన కర్తవ్యముగ నెంచుట చాల అవసరము. మందబుద్ధికి సకలము పూర్వమువలె సాగునట్లు తోచును కాని, జిజ్ఞాసువునకు సక్రమాభివృద్ధి గోచరించుట నిశ్చయము.

ఒక్కొక్కడును సాధ్యమగునంత చేయుడు. అనతికాలముననే ప్రథమ ఫలితములు ద్యోతకముకాక తప్పదు.

ప్రపంచమందలి ఏ ఇతరము కంటెను ఇది ఆసక్తికర మగునో కాదో మీకు తెలిసియుండవలెను. ఈ దేహమే ఒకప్పుడీ పరివర్తనకు గాకున్న భువిపై జీవించుట వ్యర్థమని గుర్తింపగలదు. ఈ పరివర్తనకు మించిన దింకేదియు లేదని తెలుసుకొనును. అణువణువునను ఈ ఉత్కంఠ గాఢపిపాసవలె జ్వలించును. ఈ కార్యమున ఎనలేని సంతసము ననుభవించును. జయము తథ్యమను దృఢ విశ్వాసము కల్గియుండును,

ఈ అభిలాష మీలో రేకెత్తింప గోరుచున్నాను, దీని ముందు జీవితమందలి ఇతరమంతయు మందము, నీరసము, వ్యర్థము, నిరర్థకము—జ్ఞానమున పరివర్తన యొక్కటే జీవితసారము.

* * *

అక్టోబరు 2, 1957

"అతిమానస ముఖ్యలక్షణము సత్యచేతన, అది దానికి ప్రకృతి సహజముగ సంక్రమించినది. జ్ఞానము దాని సొత్తు. సృష్టిపరిణామ ప్రక్రియ యందది ఈ జ్ఞానమును మరుగుపరచుకొని తెర వెనుకనుండి తెచ్చునట్లు బహిర్గత మొనర్చును. ఈ తెర మాయ తెర, వాస్తవము కాదు. జ్ఞానము సర్వవ్యాప్తము, సర్వగతము. ఎఱుక దాని చోదకుడు. కాంతిమంతమైన మనస్సున సత్యలక్షణము తనకుతానై బయటపడును. అది పారదర్శక దుస్తులలో నున్నటులు గోచరించినను జ్ఞాన

శక్తియే, సత్యపు టెఱుకయే. ఇది కూడ అతిమానసముపై ఆధారపడినదే. దిగుచున్న ఎఱుక భూమికలలో చివరది- ఈ కాంతిమానసము. దానిలో అతిమానసము తనకు తానై పరిమితుల విధించుకొనుచున్నది. కాని, దాని ముఖ్య లక్షణము మారదు. కాంతిక్రియ దానిది. దాని యందు నిర్మలజ్ఞాన మున్నది, పరమసత్య మున్నది. ఇచట మన మింకను సత్యజ్ఞానసీమ దాటి అజ్ఞాన భూమికలో అడుగిడలేదు.

(అతిమానసాభివ్యక్తి— సంపుటి 16, పుట 70, 71)

కరుణామయీ మాతా, నాకిది బోధపడలేదు; "కాంతిమయమైన మనస్సున సత్యలక్షణము తనకుతానై బయటపడును. అది పారదర్శిక దుస్తులలో నున్నటుల గోచరించినను...."

నీకు బోధపడని దేది?

పారదర్శిక దుస్తులు ....

అదొక అలంకారము.

దాని విధమిది: అతిమానసదృష్టిలో వస్తువుల యథార్థమును సమగ్రముగ అన్ని కోణములనుండి ప్రత్యక్షముగ చూడవగును. దానిని వర్ణించుటకు దాని క్రిందిదగు జ్ఞానభూమికలోనికి దిగవలెను. దానిని వర్ణింపబూనగానే ఒక్కసారిగా కాక ఒకదాని వెనుక నొకటిగ నొక క్రమ పద్ధతిలో పదగ్రస్త మొనరింపవలెను. నేడున్న భాషలలో సర్వము నొకేసారి చెప్పుట అసంభవము. అందులకే మనము చూచినదానిలో కొంతదాచి కొంత చెప్పవలసి వచ్చును. దీనినే మేలి

ముసుగు (తెర) అనె నాయన. ఇది పారదర్శికము— చెప్పు వా డంతయు చూచుచున్నాడు; అన్నియు నెఱిగియున్నాడు— ఒకే సమయమున. అట్లు సంపూర్ణజ్ఞానమున్నను అంతయు నొకేసారి చెప్పలేడు. ఈ నేటి స్థితిలో మన ముండునంతవరకును చెప్పుటకు భాష చాలదు, అవకాశమును ఉండదు.

మనము చూచినదంతయు ఒకేసారి చెప్పలేము. జ్ఞాన మచ్చటనే యున్నది. కాని దాని నొకేసారి మాటలలో చెప్పలేము. తెరపై బొమ్మలవలె క్రమక్రమముగా బహిర్గత పఱుపవలెను. చూచినది సర్వ మొకేసారి చెప్పగల్గుటయే సంపూర్ణశక్తిని, సంపూర్ణ దృష్టిని కలిగియుండుట. ఒకేసారి చూచుచు, గ్రహింపు గల్గియున్నను, ఒరుల కది తెల్పుట కొకమెట్టు క్రిందికి దిగిరావలెను. మౌనభాష కాశక్తి యున్నది— కాని అది తత్త్వవిదుల మధ్యనే సాధ్యము.

నేను చెప్పినది అర్థమైనదా ? ఏమి ?

పూర్తిగ అతిమానసజ్ఞానమున వ్యవహరించుటకు ఇప్పుడున్న మాటలు కాక ఇతరోపకరణము లావశ్యకము. భావప్రకటనకు నవ్యమార్గము లగత్యము. మానసిక సామర్థ్య మెన్నియో రెట్లు పెరుగవలెను. అప్పుడే అతిమానస జ్ఞానమును అతిమానసమార్గమున చెప్పవీలగును. అతిమానసిక భూమిక చేరినను ఆ భాష మన కందకున్నది.

(మౌ న ము)

* * *

నిన్న చూచిన చలన చిత్రమును * గూర్చి కొన్ని ప్రశ్నలు వచ్చెను. అందులో మొదటిది తేలిక. దానికి జబాబిచ్చెదను :

తమరు "ప్రార్థనలు- ధ్యానములు" (డిసెంబరు 20, 21, 1916) లో చెప్పిన వాస్తవిక బుద్ధుడును, ఆరాధింపబడు విగ్రహ బుద్ధుడును ఒకడేనా ?

విగ్రహముల విషయము — వేలాది బుద్ధవిగ్రహము లున్నవి. భారత మున వెలసినవాడు, శ్రీలంకలోని వాడు, టిబెట్టులో, చైనాలో, కాంబోడియాలో, జపానులో, ఇంకను ఇతరత్ర బుద్ధవిగ్రహములున్నవి. చరిత్ర పరముగ ప్రతి దేశమును తాను గౌతమబుద్ధునే, కపిలవస్తున జన్మించినవానినే ఆరాధించుచుంటి మందురు. కాని, వాస్తవమునకు ప్రతిదేశమును ఆయనగూర్చిన ప్రత్యేకపు టూహల కల్గియున్నది. విగ్రహమున నారాధింపబడునదా యవతారపురుషుని మించినది. నీ వొక విగ్రహమును చూపి, "నీకు తెలిసిన బుద్ధుని సాన్నిధ్యము కాని ప్రతిభకాని యిందున్నవా ? యనిన, "నేను ఉన్నది, లేదు అని చెప్పగలను. కాని నీవు, "ఎవని విగ్రహ మారాధింపబడుచున్నది ?" యనిన, నేను జబాబీయ లేను. పేరు చారిత్రాత్మకమే, కాని ఆ ఆధ్యాత్మిక పురుషుడో కాదో తెలియదు. అన్నిటికిని బుద్ధనామమే యున్నను, వాని ఆకారములు భిన్నములు.

ఇదిగో ఇదొక ప్రశ్న:—

గౌతమ బుద్ధుని బోధలు నేటి మానవులకు అతి మానసమార్గమున సహాయకారులా, అవరోధములా?

---

* 'గౌతమ బుద్ధుడు' అను ఇంగ్లీషు డాక్యుమెంటరీ చిత్రము.

మనము ధమ్మపదము పఠించి దానిపై ధ్యానించుచుందుము. కావున ఈ ప్రశ్న, బుద్ధుని బోధ లభివృద్ధిపథమున ఉపయోగించునని నా భావన. కొన్ని సూత్రములలో నిముడ్చబడిన శిక్షణ యిది. వానిని లాభకరముగ వాడవచ్చును, వ్యక్తులపై వాని సహాయకారిత్వ మాధారపడియుండును. లాభకరమా, నష్టకరమా యనునదికూడ వ్యక్తిపరముగానే యుండును.

ఇక, చివరి ప్రశ్న;—

"బుద్ధుడవతారమని శ్రీఅరవిందులనిరి...."

ఈ విషయ మిదివరలో చాలపర్యాయములు చెప్పియుంటిని. ఇదిగో ఇచ్చటనిది అత్యంత గుహ్యమగుచున్నది.

"బుద్ధుని బోధ లటుంచి, నేటి ప్రపంచమున ఆతని వ్యక్తిత్వమున మిగిలియున్న దేది ?

(ప్రశ్నించిన శిష్యునుద్దేశించి) ఈ విచక్షణ ఏల ?

నిర్వాణమున ప్రవేశించిన వేళ ఆతని బోధ లాతని అవశేషములలో మిగులుననిరి.

అవశేషములలోనా ? మంచిది, ఆ రెండును కలిసియుండు నన్నమాట ! అయిన వాని నేల విడదీయుచుంటివో నాకు గ్రాహ్యమగుటలేదు. ఆతని ప్రభావ మాతని బోధలలో కొంత యుండుట సహజము, ఆ బోధయే మానస క్షేత్రమున కా ప్రభావము నందించును,

బోధలటుంచిన, ఆతని ప్రత్యక్ష చర్యలు కొద్ది మందికే పరిమితమయినవి. వీరు గాఢవిశ్వాసము కలవారు, ఆవాహన శక్తికలవారు. మిగిలినవి ఆయన బోధ లతో మిళితమయి వేర్పాటు కవకాశములేక యున్నవి.

(కొంతఆగి) భిన్న జీవులలో అవతరించిన పరమాత్మశక్తి వేర్వేరు రూప ములలో వేర్వేరు గమ్యములతో వెలసినది. ఆయా యుగముల వెలసినవన్నియు నొకే పరమాత్మయొక్క భిన్న ఫలకములు. కార్యములందే భేదము—రూప క్రియాభేదములు బాహ్యముననే— పురోభివృద్ధిని సూచించుటకే— చరిత్రాత్మక మగుటకే. అంతియెకాని, ప్రాతవానిని పట్టుకొని వ్రేలాడుచు క్రొత్తవాని లక్షింప కుండుట కేమాత్రమును కాదు. గతమును చిరస్థాయి యొనరింపజూచుట తప్పు, గతమునందలి లాభదాయకమగుదానిని నూతనముతో చేర్చదగును. గతించినవాని కవి ఎంతటి మహిమాన్వితములయ్యును, వర్తమానమున విలువ అంతంత. మన స్సును నిరోధింప నేర్చినవారిని నేను, "ధమ్మపదము చదువుడు; దానిపై ధ్యానిం పుడు" అని హెచ్చరింపను. వారికది వృథా కాలయాపనమే యగును; అనర్థకర మగు బరువుమ్రోత యగును. పట్టభద్రునకు ఓ నా మా లు నేర్పువంటిదగును. లేదా ఎక్కములు నేర్పబూనినట్లు. అవసరమగువానికే ఆ హెచ్చరిక.

కొంతదూరము నీతో నడచి నీకు త్రోవచూపు వాడున్నాడు. ఆతర్వాత వానిని వదలి ముందుకు సాగుము. దీనికి మనుష్యులు వ్యతిరేకత చూపెదరు. సాయము దొరకకున్న ఉన్నచోటనే యుండి కదలరు. క్రైస్తవమతమున అభి వృద్ధిగాంచినవారు దానిని వదలుట కిష్టపడక తమ భుజములపై దానిని మోసెదరు. అట్లే ఇతరమతస్థులును, అందుచే ప్రయాణము సాగక అనిశ్చితమును, ఆలస్య మును అగును.

ప్రాతది వదలి క్రొత్తదానికై ముందుకు సాగిపొమ్ము.

మాతా, బౌద్ధమత పునరుజ్జీవనమునకై నేడు సాగుచున్న రాచకీయ మతోద్యమమో....

ఓహో! నాకు రాచకీయముల ప్రసక్తి లేదు, అది వ్యర్థము. జనులు వీనివి రాజకీయ ప్రయోజనముల కుపయోగించు కొనుచుందురు. నా కందులో ఏమాత్రపు టాసక్తియును లేదు.

* * *

అక్టోబరు 9, 1957

శ్రీమాత 'అతిమానసాభివ్యక్తి' చివరి పుటలు చదువును.

"అజ్ఞానమూర్తిగ తోచెడి ఈ భౌతిక ప్రపంచమును కూడ - అవ్యక్తమున మొదలయి అజ్ఞానమున పయనించి అధిక ప్రయాసతో జ్ఞాన భాస్కరుని అసమగ్రముగ చేరు ఈ ప్రపంచమున గల వస్తువులలో— ఒక గుప్త సత్యము కలదు. అది అన్నిటిని సరిదిద్దును. వక్రతల సరిచేసి మనిషిని అనేక అవరోధముల దాటించుచు పరమాత్మ దిశగా నడిపించును : విశ్వముయొక్క గుప్త ఉద్దేశ్యమును నెరవేర్చును. సత్యమే ఆధార మీ ప్రపంచమునకు— అది ఏ మాత్రమును దారి తప్పక మాన

వులను పరమసత్యమున చేర్చును. అజ్ఞాన మనునది జ్ఞానము యొక్క మేలిముసుగే. పరమాత్మని ఎఱుక కల్గినంతనే, పూర్వము అజ్ఞానముగ తోచినదే వాస్తవమునకు పరమజ్ఞానమను భావన దృఢపడును. మఱ్ఱి విత్తనమునగల సత్యమే దాని నంత మహావృక్షముగా పెరిగించి విస్తరింప జేయుచున్నది. కాని, మన ఎరువులు, దోహదక్రియలు కావని సర్వు లెఱింగినదే. అట్లే మనిషిలో గుహ్యముగ నున్న యీ సత్యము మనిషిని పరమసత్యము చేర్చకుండ నెట్లుండగలదు? దోహద క్రియలు నిమిత్త మాత్రమే. ఈ లెక్కకందని మనస్సులను, అసంఖ్యాకములగు చరాచరములను ఆ సత్యమే వెనుకనుండి నడిపించుచున్నది. విస్తృతమును, పైకి అయోమయముగను ఉన్న జీవరాశిలో ఒక స్థిరవిధాన మున్నది. దాని ప్రకారము విశ్వము మనుచున్నది. ఇట అతిమానసము మేలి ముసుగులో నున్నది. అది దాని స్వభావము ననుసరించి వ్యవహరించుట లేదు— అయినను అదియే సకలమునకు మూలాధారము. అది లేనిదే ఏదియు కానేరదు; సకలము అస్తవ్యస్తమగును. ప్రపంచ మజ్ఞానశక్తిచే పాలింపబడుచున్న దనుట హాస్యాస్పదము; చర్విత చర్వణమై గమ్యమే లేని దగును. పదార్థమునుండి ప్రాణము, ప్రాణమునుండి మనస్సు, క్రమముగా విజ్ఞాన ఆనంద (అతిమానస) కోశపరిణామములకు కారణము కానేరదు. అతిమానసమున బహిర్గతమగు పరమసత్యము గుప్తముగా ఆది నుండియు ఉండనే యున్నది, కాని యిప్పుడది బహి

గతమగుచున్నది. అంత జీవితార్థము తెలియుట సాధ్యమగును.''

(అతిమానసాభివ్యక్తి— సంపుటి 16, పుట 73, 74)

వాస్తవమునకిది ముగియలేదు. ఇచ్చట ఆగిపోయినది. ఇంక నెన్నో భాగములు రావలసియున్నవి.

(మౌనము)

ప్రశ్నలు లేకుండ ముగించుచుంటిమా ?

మాతా, చివరి పరచ్ఛేదములో వ్రాసినదానిపై ఒక ప్రశ్న: వస్తువులలో దాగియున్న అతిమానసమును కన్గొనుట అంత కష్టమేల ?

అది దాగియుంటచే—(నవ్వు)

అజ్ఞానమునకూడ నది పనిచేయుచున్నది; అది పరమసత్యమునకు సర్వ్వలను కొనిపోవును.

ప్రపంచ మీపాటి క్రమస్థితిలోనైన నుంటకు అతీతమానససత్యమే హేతువనిరి శ్రీఅరవిందులు. ప్రపంచము నొక ఎఱుక నిర్దిష్టమార్గమున వ్యవస్థీకరింపబడిన విధానానుసారము తీర్చిదిద్దుచున్నదను భావమున్నది; ఈ మహత్తరసృష్టి అజ్ఞానాంధకారపు పిచ్చిచేష్టకాదు.

అతీతమానససత్యదర్శనమున కవరోధము మన అజ్ఞానమును, ఎఱుకలేమి యును, వీనిని దాటినవారా అమోఘసత్యము ననుభవింపగలరు.

(మౌ న ము)

వేదాన్తచేతనాత్మకపు టెఱుక పొందినవారు విషయముల నిగూఢసత్యము చూచాయగ గ్రహింపగలుగుదురు. అది వారి ఎఱుకయొక్క శక్తిపై ఆధారపడి యుండును. ప్రపంచమునుగూర్చిన వీరి అనుభవములు పరస్పరవిరుద్ధముగ నుండుట కూడ చూడగలము. ఏకైక వస్తువునుగూర్చిన భిన్నఎఱుకల ఫలితమేయది. అయినను వాస్తవముగ ఉన్నది సకలము పరమాత్ముని దివ్యేచ్ఛయే యనుట తిరుగులేని సత్యము. దీనిని సిద్ధాంతీకరించిన వా రున్నారు. దీనికి వ్యతిరేకముగ సర్వమును కాకతాళీయసంఘటనమే, కార్యకారణరహిత మనువారును కలరు. ప్రపంచమిట్లున్నదేల? యనిన, ఇట్లున్నదికావున అనునదే వీరి సమాధానము. ఈ అత్యంత పరస్పర విరుద్ధాభిప్రాయములు ఒకేవస్తువుగూర్చినవని కొంచె మాలోచించిన గ్రహింపగల్గుదువు. ఎన్నియూహలో! దీనినిబట్టి ప్రపంచమనునది మానసికసృష్టి యయినట్లు తోచకమానదు. ఏదో ఒకటి ఉండవలెను. కాని అది మనస్సున కందనిదికావలెను. అందులకే ఈ ప్రపంచమునుగూర్చిన వివరణలన్నియు ఊహాగానములే యగును.

ప్రాథమికముగ ప్రపంచసత్యత్వము వ్యక్తిగతపు టెఱుక కధీనమయి యున్నది. దానికి వాస్తవిక సత్త్వములేదు, సర్వమును పరమాత్మయొక్క సంకల్ప ఫలితమనియు, లేక కాకతాళీయసంఘటన యనియు రెండు విరుద్ధభావనల కాకరమగునది నిజముగ అస్తిత్వము లేనిదేయగును. "విశ్వందర్పణదృశ్యమాన నగరీతుల్యం" మాత్రమే.

మీరెన్నడు ఈ విషయమై యోచింపలేదా? ప్రతివ్యక్తిని ప్రత్యేకములగు కొన్ని నిర్దిష్టమగు తలపులుండును. ప్రతివ్యక్తి చూచుపద్ధతి వేర్వేరుగానుండును;

అనుభూతియు భిన్నమే : ఇతరులతో గల సంబంధములును భిన్నముగనే యుండును. దీనినే ఆతడు ప్రపంచమనును. సకలమునకును ఆతడే కేంద్రము. సకలమును తన కనుకూలమగు పద్ధతిలో వ్యవస్థీకరించుకొనును. దీని కేవొంత నయు సాధ్యముకాదు కావున వాస్తవికప్రపంచము మన యూహకందనిదేదో యయియుండవలెను. అది తెలియవలెనన్న మనము మన ప్రత్యేక ఎఱుక నధిగమింపవలెను. దీనినే శ్రీఅరవిందులు అపరార్ధగోళమునుండి పరార్ధగోళమునకు పోవుట అనిరి. అపరార్ధమున వ్యక్తులెందరో అన్ని ప్రపంచములుండును. పరార్ధమున "అది'' యున్నది. అది అదే. అన్ని ఎఱుకలు దానిలో లీనము కాకతప్పదు. అదియే శ్రీఅరవిందులు తెల్పిన పరమ సత్యము (Truth Consciousness).

మానవుని ఎఱుక హెచ్చినకొలందిని ఈ సాపేక్ష భావము పెరుగును. అదే సమయమున సామాన్యపద్ధతులద్వారా గ్రహింపరాని యొక పరమసత్యమున్నదని యును దాని నెట్లయిన దర్శింపదగుననియును ఒక అస్పష్టభావన పొడచూపును.

అంతే—"దివ్యజీవనము'' చదువబోవుచున్నాము. అది మన సమస్య సాధించునమకొనెదను.



నాకు నాల్గు ప్రశ్న లందినవి. అవి నే నిప్పుడు చదివిన పాఠమునకు ంబంధించినవి కావు; మూడు భిన్నవిషయములపై. వానికి వి స్తృతజవాబు వసరము. మొదటి రెండుప్రశ్నలను తీసుకొనెదను. అవి ఆత్మ (Spirit) యొక్క విపరిణామమునకు సంబంధించినవి.

1-వ ప్రశ్న.

> "అభివ్యక్తము కానున్నదంతయు భౌతిక పదార్థమున నిమిడియున్నచో, అతిమానస మభివ్యక్తమగు వేళ ఇతర తత్త్వములు కూడ బహిర్గతము కావా ?"

యుక్తితః అది సంగతమే. పరమాత్మకును భౌతిక పదార్థమునకును ఒక రకపు ఏకత్వమున్నది. కాని, ఇది 2-వ ప్రశ్నను లేవదీయును.

> "కాలమున ఈ విపరిణామము జరిగియుండెనా, దానికి పరిణామమున కున్నంత ఐతిహ్యమున్నదా ?" దీని జబాబు పృచ్ఛకుని దృక్పథముపై ఆధారపడియుండును.

భిన్నమతస్థులు భిన్నముగా చెప్పిరని పండితులు చెప్పెదరు. తత్త్వమీమాంసకులు పురాణముల త్రోసిపుత్తురు. పురాణములు పిల్లలకని వారి అభిప్రాయము, వీరు నిరాకారవాదులు, మానసికశాస్త్రజ్ఞులు సకలమును ఎఱుకయొక్క క్రియా కలాపముగ చూతురు. ఇక రూపకల్పనా క్రియలు.— వారికి విశ్వపరిణామ చరిత్ర యొక చలనచిత్రము వంటిది. ఈవిధను వారి కెక్కుడు సజీవము, మూర్తిమంతముగా భాసించును. అది ప్రతీకయే యయినను విషయపరిగ్రహణ మున కెక్కుడు తోడ్పడును.

ఇవన్నియును తుల్యసత్యములే. వానిని సమన్వయించి సంయోగించుట ముఖ్యము. తత్త్వమీమాంసకుల రసవిహీన వివరణలు గ్రంథములలో చదువుట మంచిది. మానసిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతములు మాటలలో కాక చేతలలో చూచుట శ్రేయము. ఇక పురాణవాదులు—వీరి సిద్ధాంతముల ననుసరించి మనము పిల్లల వలె నెల్లపుడును కథలలో జీవింపగల్గిన, వానిని పిడివాదముగా చేయకయుండిన, మన జీవితములు సార్థకములు కాగలవు.

ఎన్నోకథలు ఇంతో అంతో నిజమగునవి, సమగ్రమై హృదయంగము లగునవి కలవు. వాటిలో నీకు నచ్చిన వెన్నుకొన వచ్చును, వాని ప్రకారము మనము జీవింపగల్గిన, పాక్షికముగ నైనను. విశ్వగ్రహణమున కది సాయపడును. కొందరట్లు చేసిరి. వారే దీక్షితులు. గుహ్యశాస్త్రజ్ఞులు, ప్రవక్తలుగా ఎంచ బడిరి—వారు చెప్పిన చక్కని కథ లెన్నో యున్నవి.

ఆ కథలలో ఒక కథ చెప్పెదను—అతి క్లుప్తముగ. దానిని వేదవాక్కుగ భావింపబోకుడు. కథగా మాత్రమే తీసికొనుడు.

బ్రహ్మము తన్ను తాను చూచుకొనదలచి తన్ను తాను బహిర్గతమొనరించు కొనువేళ, తనలోనుండి తొలుత బయటికి పంపిన ప్రపంచముయొక్క జ్ఞానము, దాని సృష్టించు శక్తి. ఈశక్తియు జ్ఞానమును కార్యోన్ముఖము లయ్యెను. ఈ పరమసంకల్పమున నొక ప్రణాళికయుండెను. ఈ ప్రణాళికలోని మొదటి తత్వము (అంశము)స్వేచ్ఛాసంతోషముల ప్రకటించుట. అవి ఈ సృష్టికి ఎక్కువ ఆసక్తి దాయకమైన లక్షణములుగ దోచెను.

వీని రూపకల్పనకు మధ్యస్థులు కావలసివచ్చెను. నాల్గు మూర్తులు ఆదిలో వెలసెను.—ఈ విశ్వాత్మక నిర్మాణమునకు. బ్రహ్మములో శక్తిరూపముగ నున్న

వానికి రూపకల్పన మొనర్చుట వీరిపని. ఎఱుక. జ్ఞానము, జీవనము, ఆనందము ప్రేమ, సత్యము,—అనులక్షణములతో విలసిల్లిన మూర్తులివి.

వీనికి గొప్ప శక్తి, బలము, ధృతి కలవు. నిర్మాణ స్వేచ్ఛ వారి కుండెను. ప్రణాళికలు వారు స్వేచ్ఛగా రచింప స్వతంత్రము గల్గియుండిరి. ఆరంభించిన పని కొనసాగించు విధానము వారికి కరతలామలకము. వారు నిమిత్త మాత్రులుగా కాక యజమానులుగా కర్తవ్యమాపాదించుకొనిరి. ఇదియే వారు చేసిన గొప్పపొరపాటు. ప్రపంచమునందలి అస్తవ్యస్తత కదియే ప్రధాన కారణము. భేదజ్ఞాన మంకురించెను. పరమాత్మనుండి ఆయన సంతానమే వేరయ్యెను. దానంజేసి జ్ఞాన మజ్ఞానముగ మారెను; జ్యోతి తమస్సుగ మారెను; ప్రేమ ద్వేషముగ మారెను; ఆనందము దుఃఖముగ మారెను; సత్య మనృతముగ మారెను; సమన్వయశూన్యమగు సృష్టి ఎపరిత్రోవను వారు కావించిరి, దానికొక త్రోవ తెన్ను లేకపోయెను. తమ అధినేతను విస్మరించగనే తమసోదరభావము నుకూడ విస్మరించిరి. సౌష్ఠవము కాని, అనురూపత్వము కాని వారి నిర్మాణ ములకు లేకపోయినది. వారు నిరంకుశులై సంచరించిరి.

దాని ఫలితమే ఈ ప్రపంచము. దీని సృష్టి అంచీలలో జరిగెను. దాని నంతయు నేనిపుడు మీకు చెప్పజాలను. దాని పర్యవసానమే తమోవృత. అవిద్యా సంభరిత, దుఃఖసంతప్త భౌతికతత్వము. ఈ నాల్గిటిని విశ్వనిర్మాణమునకై జనింపజేసిన సృజనాత్మకశక్తి, జరుగుచున్నదానిని వీక్షించి, జరిగిన అనర్థమును చక్కబరచు ఉపాయమునకై బ్రహ్మమున ప్రార్థించెను.

బ్రహ్మమా సృజనాత్మకశక్తిని (అదితి) అజ్ఞానములోనికి జ్ఞానమును ద్వేషము లోనికి ప్రేమను, అనృతములోనికి సత్యమును జొనుప నాజ్ఞాపించెను. మొదటి వానికంటె ఇవి ఇప్పుడు ఎక్కువ శక్తిమంతమై భౌతిక తత్త్వములోనికి చొర

బడెను. వీని ధ్యేయము పరమాత్మనుండి వేరయిన విశ్వమును మరల బ్రః మున జేర్చుట.

ఈ విధమున భౌతికమున ననేక విపరిణామములు వచ్చినవి. వీనికి విభి ఐతిహ్యము లేర్పడినవి, ఈ విపరిణామముల పర్యవసానమే అతిమానసః బహిర్గతమగుట. ఇతర విపరిణామము లుండబోవని చెప్పజాలము. బ్రహ్మః అక్షయుడు—ఆతడు సర్వదా నవ్యప్రపంచముల సృష్టించుచునే యుండును.

ఇదీ నా కథ.

* * *

అక్టోబరు 23, 1957

మాతా "దివ్యజీవనము" నందలి చివరి ఆరు అధ్యాయముల పఠన మారంభించును.

"ఆధ్యాత్మిక పరిణామము భౌతిక తత్త్వమున ఎఱుక యొక్క పరిణామము. ఆంతర్గత ఆత్మ బహిర్గతమగువరకు ఇది సాగును. భూలోక జీవితోద్దేశ్య మిదియే. అజ్ఞానపు మేలి ముసుగు, జడపదార్థపు మేలి ముసుగు సర్వగతుడగు పరమాత్మ శక్తిని కప్పును. అయినను ఈ శక్తి అంతర్గతముగ క్రమ పద్ధతిని నిర్విరామముగ వ్యవహరించుచున్నది.

భౌతిక ప్రపంచమున జడమాత్రముగ తోచుచున్నది.
దాని ప్రక్రియలు గుప్తజ్ఞానపూర్వకములు." -
(దివ్యజీవనము— భాగము 2, అ 23, సంపుటి 19, పుట 824)

కరుణామయీ, మాతా, 'పరమాత్మ శక్తి' యన నేమో తెలియుట లేదు. ఈ పరిచ్ఛేద మర్థమగుట లేదు.

విశ్వస్థితికి ఏకైకకారణమును చెప్పు దీని నర్థముచేసికొంట చాల ముఖ్యము. మన మిపుడు సంపుటము యొక్క చివరిభాగము తీసికొంటిమి. చివరి ఆరు అధ్యాయములు. గ్రంథారంభమున శ్రీఅరవిందులు క్రమముగా విశ్వజననము, దాని కారణములు. విధానములు, ఆయా సిద్ధాంతములు, జీవితరహస్యము మొదలైనవి విపులముగ నభివర్ణించిరి, సాధ్యమగునంత స్పష్టముగ విశదీకరించి, వాని లోటుపాట్లను కూడ చర్చించి, వాని నెట్లు సరిదిద్దుకొననగునో సూచించిరి. దానిని మనము చదువుటకు పది సంవత్సరములయిన సరిపోవు. దానిని లాభదాయకముగ నర్థము చేసికొనుటకు మీకున్న జ్ఞానము చాలదు, మీ మేధ కందునదికాదు, పూర్తిగ విజ్ఞానదృష్టినుండి, ఈ జీవిత పరమహేతువు లేవో చూపిన ఘట్టమునుండి మన మారంభించుచున్నాము.

వారిట్లు ఆరంభించుచున్నారు : "భూలోక జీవితపు ప్రధానమును భావగర్భితమును అగు ఉద్దేశ్యము." వారు విశ్వమునంతయు ప్రస్తావించలేదు. భూలోక జీవితమును విశ్వజీవితపు నమూనాగా భావించిరి. ఇదియే పురాణ సంప్రదాయము సకలజీవకేంద్రము భూమి యని ఆధ్యాత్మికులందురు. భూలోకవిజ్ఞాన మలవడి విశ్వవిజ్ఞానము కరతలామలకమే యగును. కావున వారు భూలోకమునే తమ పరిశీలనకు చేకొనిరి, దానిని గ్రహించిన విశ్వమునుగూర్చి తెలుసుకొనగలది వేరేమియు నుండబోదు. వారిట్లనిరి : "ప్రధానోద్దేశ్యమనగా భౌతికతత్త్వమున నణగి

యున్న ఆత్మను మేల్కొలిపి ప్రకాశమొనర్చుట. ఇది పరిమాణక్రమముగ కొనసాగునది. ఆత్మ పరమాత్మలో చేరుట ధ్యేయముగా కలది. అదియే ముక్తి.

మనము చూచు భౌతికరూపములలో మొదటిది లోహజాతి—రాయి, మన్ను లోహములు, ఇవి మన బాహ్యదృష్టికి జడములుగ తోచును. అయినను ఈ జడత్వము వెనుక ఆత్మజీవన మున్నది. అది పరమగుహ్యము—నిద్రించుచున్నట్లున్నను ఆదినుండియు పరిశ్రమించుచునేయున్నది. ఆదిలో జడముగ భాసించునది క్రమముగా సజీవమై ఎఱుకతో జ్వలించును. ఒక రాతిని సామాన్యదృష్టితో చూచి అది అచేతనమనియు, జడమనియు విశ్వసింతువు. కాని దానిని విజ్ఞాన దృష్టితో చూచిన నది క్రమానుగతముగ పరివర్తన చెంది చెంది, చివరగా నొక ఎఱుకతో తొణికిసలాడు సజీవ మూర్తియొక్క సూక్ష్మ రూపమని గ్రహించగలవు. ఈ సత్యము వృక్షసంతతిలో ఎక్కువ ప్రస్ఫుటము. రాతిలో నిది గుహ్యము. ప్రాణము వెంటనంటియే మృతియు కలదు. కాలముల అంతరము మాత్రమే ఏకైక భేదము. మొక్క ఎదుగును— సూర్యరశ్మికై తహతహనందును— అందులకై తన స్వభావ విరుద్ధముగ చాల ఎత్తు కెదుగును, దానికి వెలుగు అగత్యమగుట. ఆ చిన్న మొక్కలో జీవించు ఇచ్ఛలేమా ? దీని పరివర్తనమూలముగ నవ్యజాతి—వృక్ష పశుజాతుల మధ్యంతరజాతి—వచ్చినది. ఆ మిషాహారులగు మొక్కలున్నవి— విస్తరించిన నోటిని పోలినవి ఒక కీటకము లోనికేగిన, దానిని మ్రింగివేయును. అది మొక్కకాదు, పశువుకాదు. ఇట్టి మొక్కలెన్నో !

ఇక పశుజాతి : మొదటి పశువును మొక్కనుండి వేర్పాటు చేయుట కష్టము. ఎఱుక లేదననగును. క్రమముగా ఎఱుకగల ఉత్తమజాతి పశువులను చూడగలము. వానికిని స్వతంత్రేచ్ఛకలదు, తెలివితేటలున్నవి. ఉదాహరణ: ఏనుగు. ఏనుగుల తెలివితేటల తెల్పు కథలెన్నిటినో మీరు విని యుందురు. ఇది గమనించదగిన మనోవికాసము. దీని క్రమానుగతాభివృద్ధి వేరొక నవ్యజాతి కెడ

మిచ్చినది, (దాని జాడలు మాత్రమే మిగిలెను). పశువుకు కోతికి మధ్యది. పశువుకాదు, కోతి కాదు. రెండు కాళ్ళపై నడచుటకు ప్రయత్నించునది. ఇక మనిషి మానవ పరిణామారంభము. తెలివంతగా లేకున్నను (ఇదమిద్ధమని చెప్ప లేము)—మానసిక క్రియా కలాపమున్నది. స్వాతంత్ర్యేచ్ఛ కలదు. పరిసరము లకు లొంగక, వాని నెదుర్కొను ప్రయత్నమున్నది. తన అభిరుచికనుగుణముగ దిద్దుకొను ఆకాంక్షయు కలదు. ఇచ్చట నుండి ఆధ్యాత్మిక జీవిత సామర్థ్యముగల ఉత్తమ వ్యక్తివరకు ఎన్నియో క్రమోన్నత శ్రేణులున్నవి.

ఇచట శ్రీఅరవిందులు చెప్పిన దిదే. మీ కేమయిన ప్రశ్నలున్న....

"కరుణామయీ, మాతా, శ్రీఅరవిందులు; "ఈ ఎఱుక అత్యుత్తమ తెలివిగా మారి మనిషిలో తన్ను తానే అధిగమించును" అనిరి.

అవును. నే నన్నదియు నదియే. ఉత్కృష్టస్థితి యందు మనిషి ప్రకృతి నధిగమించును. పూర్తిస్వాతంత్ర్యము పొందగలడు. (కొంత ఉత్ప్రేక్ష కలదు) —ఆధ్యాత్మికపు ఎఱుక పొందినవాడు. బ్రహ్మముతో సంపర్కము నేర్పరచు కొనినవాడు ప్రకృతినుండి, దాని శక్తులనుండి తప్పుకొనినవాడగును.

(వర్షమారంభించెను). ఓ ! ఇది మన మనసులను చల్లబఱచుటకు. (నవ్వు)

''తన్నుతానే అధిగమించును'' అనుటలో మనిషి దివ్య ఎఱుక పొంది— (వర్షము హెచ్చును) ఓ, ఓ మౌనము మంచిది—ప్రకృతి విధానములద్వారా కాక ప్రత్యక్షముగా బ్రహ్మమును చేరు ఎఱుంగును.

ఇక మన మాగుదము— ధ్యానము లేదు—ఏలనన....

అక్టోబరు 30, 1957

"ఈ ప్రకృతి చేయు పరిణామ క్రియ—భౌతిక తత్వము నుండి మనస్సు వరకు—ద్వివిధము, బాహ్యమును, దృష్టి గోచరమును నగు భౌతిక పరిణామమున్నది — పుట్టుక యంత్రముతో కూడినది; పరిణతితో వంశ పారంపర్యమున నెదుగు ఏలుకతో అందరకు కానవచ్చునది. రెండవది, అదృశ్య ప్రక్రియయగు జీవపరిణామము - పునర్జన్మలతో ముడివడి ఆరోహణక్రమ రూపమున ఎలుక యంత్రముగా అదేసమయమున సాగుచున్నది. వ్యక్తి శీఘ్రముగ మరణించు పరికరమగుటచే మొదటిది విశ్వ పరిణామమే. ఇక జాతి ఎక్కువ కాలము మనగల సామూహిక రూపము, విశ్వమానవ మూర్తీకరణమున ముందడుగు. పునర్జన్మ వ్యక్తిపరిణతికి నిరాకరింపరాని ఉపాధి. ప్రతి తరగతి మూర్తీకరణము, ఆతనికిల్లగు ప్రతియొక మూర్తియు, పునర్జన్మ ద్వారా వ్యక్తిగత జీవునకు సాధనముగా మార్పబడుచున్నది. జీవుడు తనలో గర్భితమయి యున్న ఎలుకను అంతకంత కెక్కుడుగా ప్రకటించుకొనగల్గును. ఈ సాధనము ద్వారా (ఉపాధి) ప్రతి జీవితమును భౌతిక తత్వముపై విజయసాధనలో ఒక్కొక్క మెట్టు. చిట్టచివరకు భౌతిక తత్వమే ఆత్మయొక్క పరిపూర్ణ వికాసమునకు సాధనము కాగలదు,

(దివ్యజీవనము- భాగము 2, అ XXIV సంపుటి 19, పుట 825, 26

కరుణామయీ, మాతా. ఇది గ్రాహ్యము కాకున్నది—

ఆ॥

భూమియొక్క చరిత్ర తీసికొనిన, ఒక సాధారణ ప్రణాళికలో ఒకదాని వెంట నొకటిగా వివిధ రూపములు రూపొందుట చూడగలము. ఒకదానికంటె ఒకదాని కెక్కుడు ఎఱుక యుండుటయు గమనింపగలము. పశురూపముల తీసికొందము. వాని నర్థముచేసికొనుట తేలిక. అవి మానవజాతికి అత్యంత సన్నిహితములు. వెనుకటి వానికంటె ఎక్కువ సమగ్రత కలవి, ఎఱుకను వాడుకొనగలవి. వీని తర్వాత వచ్చిన మానవజాతి కెక్కువ ఎఱుకయు, దానిని వాడుకొనుటలో ఎక్కువ నేర్పును చూడగలము.

ఇది ప్రకృతి సకలరూపములలో గల దివ్య ఎఱుకను అంతకంత కెక్కుడుగ ప్రదర్శించుటకై అవలంబించిన ఆరోహణక్రమపద్ధతి యని శ్రీఅరవిందులు తెలిపిరి. ప్రతి నవ్యరూపమునను ప్రకృతి ఎక్కుడు ఎఱుకను వెల్లడించును. ఇట్లయిన ఒక రూపము సంపూర్ణముగ పెరిగిన అనంతరమే నవ్యరూపము రాగలదు, వెనుకటి నట్లే వ్యక్తిగతముగ ఎదుగుబొదుగు లేక యుండిపోవును. కోతి కాని కుక్కకాని (ఉదాహరణకు ప్రత్యేక జాతులకు చెందియున్నవి. వాని అభివృద్ధి కొంక పరిమితికలదు. దానిపైన మరి అభివృద్ధి లేదు. ఇది మనకు విదితమే. అట్లే మనిషియు వ్యక్తిపరముగా ఒక పరిణతిపొంది అట్లే మనును. ప్రకృతికి జాతి ప్రధానముకాని వ్యక్తి కాదు—నవ్య జాతి, నవ్యరూపముల సృష్టి వెనుకటి దానికంటే ఉన్నతస్థాయిలో నగును. ప్రాతవి క్రమముగా నశించిపోవును, ప్రతి వ్యక్తి మూర్తిలో ఒక ఏర్పాటుకలదు. ఎఱుక, లోనగల దివ్యపురుషునకు సన్నిహితముగను, ఆతని అధీనమునను కలదు. ఆతని ప్రాబల్యమున మనెడి రూపము (మూర్తి) అధిభౌతిక జీవనము కలది. ఆమూర్తి (ఆతనినే అంతరాత్మ, చైత్య పురుషుడు అనుచున్నాము) దివ్యలక్షణసమన్వితుడై యుండును. ఆ జీవితమే శాశ్వతము—భౌతిక జీవితము నాశము కాగలదియే—ఎప్పుడో ఒకప్పుడు, ఆ

చైత్యపురుషుడే జన్మపరంపరల బారిపడుచు, పూర్వానుభవములను ఇతర జన్మలకు గొనిపోవుచు అభివృద్ధి పొందుచుండును. ఇది జాత్యభివృద్ధితో సమానముగసాగి, జాతిస్థిరపడినను, నశించినను లెక్కగొనక ముందుకు సాగిపోవును. స్వప్రయత్నము, పరమాత్మ చేయూత దీనికి సాధనములు— పూర్ణత్వము చేరుటకు.

పూర్వజన్మస్మృతిగల కొందరున్నారు; కుక్కలుగా, కోతులుగా, ఏనుగులుగా తమ పూర్వానుభవములు చెప్పుతారు. దాని సత్యాసత్యముల నేనిట పరామర్శించుట లేదు. దృష్టాంతముగ తీసికొంటిని. పూర్వజన్మస్మృతి లేనివారి కది తెలియకపోవచ్చును. కాని దివ్యశక్తి ఆయా రూపములగుండ పరిభ్రమించి అంతిమముగా మనిషిలో తన చైతన్యము ప్రకాశింపజేసుకొంట నిరూపింపగల్గిన యడల కొబ్బరిచెట్టెక్కి క్రింద పోవువారిపై కొబ్బరికాయలు విసరుట జ్ఞప్తికి రానోపును.

ఏమైనను, మానసిక స్మృతులబోలిన వానిని కలిగియుండుట కనువైన యొక వ్యవస్థీకరణము చైత్యపురుషున కుండియుండవలెను. దీని గూర్చి ముందు ముందు వినగలము, శ్రీఅరవిందుల రచనలో చదివెదము, అట్టి ఏర్పాటు (జన్మాంతర స్మృతులకొఱకు) ఉన్నదనియే చెప్పనగును. దానికి తగిన ఉపపత్తులున్నవి. బాహ్యాంతర్గతమార్గముల జీవు డభివృద్ధిచెంది పరముని చేరబోవును, ఇదీ శ్రీఅరవిందులబోధ— (ఒకనితో) నీవు అతిమానసపురుషునిగా మారబోవుచున్నావు. నీ స్థూలకాయము పశుజాతికి చెందినది.) అతిమానసము కాలేదు. కాని, నీలోని సూక్ష్మజీవు డనేక జాతులలో నివసించియుండెను. పూర్వజన్మలలో, కోటానుకోట్ల అనుభవములు లోననున్నవి. మానవదేహ మిట్లున్నంతకాల మవి యుండగలవు. కాని ఈ దేహ మతిమానసపురుషదేహముగా మారగల అవకాశమున్నదేమో చూతము. ప్రస్తుతమది అంతకంత కెక్కుడు ఎఱుక నీ దేహమునుండియే జాగరిత మొనర్చుకొనుచున్నది.

(శిష్యుడు) మాతా, ప్రకృతిలో జాతికి జాతియే నశించు చున్నది, దాని కారణము ?

ప్రకృతి తన ప్రయోగము విఫలమయినదని భావించెనేమో ! మనము చేయు పనులలో నిట్టిది సామాన్యమేకదా. ప్రకృతి కనంతసాధనసంపత్తి కలదు. కాలమా ? దాని చేతులలో నున్నది. వ్యయప్రయాసల ప్రసక్తి లేనేలేదు, బాల క్రీడవలె దేనిని సరకుగొనక క్రియాశీల యగును. దానికి వలయునది నాణ్యత. కోతికి మనిషికి మధ్యకొన్ని జాతులు పూర్తిగ నశించినవి. వాని అవశేషములు మాత్రము కనుగొనబడినవి. కావున మనిషికీ, అతిమానసపురుషునకు మధ్య ఎన్ని అంతరజాతు లుత్పన్నమయి నశించునో ఊహకందని విషయము. ఈ విషయ మింకొకప్పుడు.

ఈ సృష్టికార్యమొక వినోదక్రీడ. ప్రకృతి తొందరపడదు. కాలపరిమిత యనునది దాని నిఘంటువున లేదు. కొన్నియుగములే సాగుగాక—ప్రమాదమేమి? అంతయు పూర్తియయి ఊహకు విపరీతమయిన, అంతయు మూలమట్ట మొనర్చి తిరుగ మొదలుపెట్టుటకు వెనుకాడదు. పైన చెప్పినట్టు దాని సాధనసంపత్తి అపరిమితము.

* * *

నవంబరు 13, 1957

మొదటిపుటపై నాదొక ప్రశ్న-దానిలో శ్రీఅరవిందులు "భౌతికమున ఎఱుకయొక్క పరిణామమే ఆధ్యాత్మిక పరిణామము- అది నిత్యక్రమానుగతాభివృద్ధి - ఉపాధిలోనున్న ఆత్మను వెల్లడించువరకు సాగును, ఇది దాని కీలకము. భూలోకనివాసము యొక్క ప్రధాన సార్థకోద్దేశము" అని వ్రాసిరి,

(దివ్యజీవనము- సంపుటి 19, పుట 824)

రూపదృష్టినుండి ఇతరపశువులకంటె మానవుడే విధముగా భిన్నుడు ?

దీనిని తెలియుట తేలిక,

ఆత్మను వెల్లడించు రూపమును గూర్చి శ్రీఅరవిందులు ఎఱుకయు, గ్రహింపును ఆత్మస్వభావమనిరి. అంతిమమున ఆత్మ అధికారేచ్ఛలో ప్రస్ఫుటమగుననిరి, రూపముకూడ ఒక లక్షణమే. పశువులలో అందమగునవి చూడగలము. నేటికంటె పూర్వ మొకప్పుడు మనుజు లింతకంటె అందముగా నుండిరి. మనిషిలో ఆత్మ అధికముగ ప్రకటితమగుట నిర్వివాదాంశము. మనిషి రెండు కాళ్లపై నిలబడుట ఆతని విశాల దృష్టికి తార్కాణము. ఎగిరే పక్షులదృష్టి ఇంకను విశాలముగదా యనవచ్చును. మేధాప్రకటనకు లెక్క లంతరాయమని చెప్పనగును.

ఈ నిలబడుట యొక ప్రతీక, ప్రాకుచో కనులు, ముక్కు నేలమీది కుండును. ఆతడు ఎత్తునుండి నల్దిశల చూడగల్గుచున్నాడు. ఆతని మూర్తి నిర్మాణము బుద్ధిప్రసారమున కనువుగ జరిగినది. మేదస్సు, తలనిర్మాణము, కాలుసేతుల అమరిక, ఆత్మప్రకటన దృష్టినుండియే యనవలెను.

బలము, మార్ధవము, చురుకుదనము జీవులన్నిటను మనిషిలో అధికము కాకపోవచ్చును. కాని, బుద్ధిలో ఆతనికి సమాన ప్రాణులు లేనేలేవు. తనలో నిద్రాణమైయున్న బహుళ ప్రతిభలను మనిషి జాగరిత మొనర్పగలడు. దేహాభి వృద్ధి మెలకువలు అతనికి సాధ్యము— ఇంకే జాతి ప్రాణికిని ఇది ఊహింపనైన రానిది. పశువు పుట్టి తన జాతి సహజధర్మము ప్రకార మెదుగునే కాని విద్య నేర్వబోదు. ఆ శక్తి ఉన్నదనిన అది "అ, ఆ" ల వరకు మాత్రమే. మనిషి యన్ననో తన లోటుపాట్లను సరిదిద్దుకొనగలడు; బలహీనతల నపనయించు కొన గలడు. పశు వొక నిర్దిష్టమార్గమున అభివృద్ధి చెందును. మనిషి అభివృద్ధి ఆతని చేతిలో నున్నది. తా ననుకున్నది కాగలడు— పశువో ?

తాము సామాన్యముగా చేయలేని అంగచలన క్రియల నెన్నో పశువులు (జంతువులు) నేర్చినవి. కాని అవి మనిషి ప్రాబల్యమున కధీనమయి అట్లు చేయగలుగుచున్నవి. కుక్క–కాని గుఱ్ఱముకాని తమకు తామై వాటిని నేర్వనేరవు. కావున, ఆత్మ ప్రకటనకై అత్యంతమగు అవకాశమిచ్చునది మానవరూపమే యనుట వాస్తవము. తెలివి, గమనిక, గ్రహణశక్తి, కార్యకారణనిర్ణయ దక్షత, అభివృద్ధిసాధనేచ్ఛ— వీని మూలమున మనిషి క్రమముగా ప్రకృతి ధర్మముల నర్థము చేసికొననేర్చెను, వానిని స్వంతమునకై వాడుకొనుట కూడ అలవర్చు కొనెను. ప్రకృతి కధీనుడై యుండెడివాడు దాని కధిపతి యయ్యెను,

సత్యమున జీవించు పురుషునితో (స్థితప్రజ్ఞునితో) పోల్చిన, మనిషి చాల నిమ్నస్థాయిలో అనేకలోట్లు కల్గియున్నట్లు తోపవచ్చును. కాని, పశువులతో పోల్చిన, ఎంత అగ్రమున కలడో చూడగలము. కావున ఇది సహజమే:— పరిణామము కొనసాగుకొలదిని మనిషి క్రమముగా పరివర్తన జెంది సత్యపురుషు నికి తుల్యుడు కాకపోడు.

మనిషిని గూర్చి నేను సామాన్యముగ సౌమ్యముగా మాట్లాడనని మీ రన వచ్చును. (నవ్వు) దానికి కారణ మాతడు తన్నుగూర్చి అతిసౌమ్యముగ తలంచు కలవాటు కల్గియుంటమే—

ప్రకృతిలోని ఇతరములకంటె మనిషి ఎంతయో ఉన్నతుడనుట తథ్యము.

కాని, మాతా, ఓ ప్రశ్న: ఎఱుక అవతరణ రూపాభివృద్ధి చేయునా, లేక రూపాభివృద్ధియే ఎఱుక అవతరణను నిర్బంధించునా ?

ఎఱుక అవతరణ లేనిదే విశ్వమే లేదు. ఈ విశ్వప్రారంభ మెక్కడ ? ఎవరు ప్రారంభింతురు ?

మనిషి విషయమున: పశుమానవుడు మనస్సును క్రిందకు తెచ్చెనా, లేక మనస్సే దిగి వచ్చెనా ?

ఓ ! ఉన్నత మర్కటము (Ape) తన ఆకాంక్షతో మనస్సును దిగివచ్చునట్లు చేసెననియా నీ భావము ? ఆకాంక్ష వెనుకటి అవతరణ ఫలితమే.

లేనిది వెల్లడికాదనుట నిత్యసత్యము— శూన్యము నుండి రాగలది శూన్యమే. శూన్యమున సత్తు కవకాశము లేదు. అభివృద్ధియంతయు అంతర్గత సత్పదార్థముయొక్క ప్రయత్న ఫలితమే. కార్యకారణ సంబంధ మనివార్యము. దీని నిరూపణయే శ్రీఅరవిందుల "దివ్యజీవనము" న చూడగలము. ఒక సనాతన తత్త్వము లేకున్నచో, (ఏ పేరైననేమి) పరమసత్య మొండు లేకున్నచో, ఈ విశ్వమున కాస్కారమే లేదు.

షవము చదువు దానిలో ఇది చూడగలము. అపుడు మీకు తత్త్వశాస్త్రపు కసరత్తు అవసరమగును. అయినను శూన్యమునుండి ఏదియు రూపొందదని తెలియుటకు, ఏ తత్త్వశాస్త్రావసరముకాని, మానసిక శాస్త్రావసరము కాని, ఉండబోదు.

భౌతికమునుండి ఆత్మ పుట్టినదని చూపుటకై అనేక శతాబ్దములుగ మనిషి ప్రయత్నించెను. అది కేవలము అర్థరహితము (మాత నవ్వును). మీరు చేయు పనులు మొదటగా ఊహింతురనుట హేతుబద్ధమే. ఎఱుకగల్గి ఇచ్ఛతో నడుపబడని జీవిత మర్థరహితము. ప్రకృతికి ఎఱుక గలదనియును, అది యొక ఇచ్ఛతో వ్యవహరించుచున్నదనియును ఏపాటి గ్రహణశక్తి గలవానికైనను కన్పింపకపోదు.

అయినను— శ్రీఅరవిందులు ఎక్కువగా తర్కించిన వానిలో ఇది ముఖ్యవిషయము. ఈ విషయ మింకొక పర్యాయము—

(మౌ న ము)

మానవుని అధికృతకు ప్రతీక అగ్నిని వశపర్చుకొనుటయే యన నగును. మనిషి కలచోట అగ్ని విధిగా జ్వలించినది.

పశువుకంటె మనిషి అధికుడనుటకు ఆతని వ్రాయుశక్తియు, మాట్లాడు శక్తియు నిదర్శనములు. మాటలకు పశువు లన్నియు (మానవ సంపర్క మెన్నడు నెఱుగనివి కూడ) ముగ్ధమగును, ఆకర్షింపబడును. తమ శక్తికిమించిన దగుటచేత భాషాసామర్థ్యము వలన అవి ప్రాభావితమగును.

* * *

నవంబరు 27, 1957

మూలాజ్ఞాన కలితమైన యీ ప్రపంచ స్థితియందు, పరిణామక్రమము ప్రస్తుతము చేరిన దశకంటె ఇంకను ముందునకు బోవు నవకాశము కలదా యనిగాని, సత్య జ్ఞానపరిపూర్ణుడగు స్థితప్రజ్ఞుని అవిర్భావ రూపమైన అతిమానసపరిణామ మనునది సంభావ్యమగునా యని గాని శంకించుట కవకాశము లేకపోలేదు.

శాశ్వతకాలమున కాలాతీత శాశ్వత పురుషుని అభి వ్యక్తియే ఈ సృష్టియనియు ఎలుక సప్తభూమికలు కల దనియు, భౌతికజడత్వ మాత్మ పునరారోహణకై నిర్మిం చిన మూలస్తరమనియు, పునర్జన్మ వాస్తవమనియు, భూలోక వ్యవస్థీకరణలోని భాగమనియు ఒప్పుకొనినను, మనిషి ఆధ్యాత్మిక పరిణామము అనివార్యముగ వీని ఫలితమే యగుననరాదు. ఆధ్యాత్మిక ప్రాముఖ్యమును గూర్చియు, భూలోక జీవితపు అంతరత ప్రక్రియల గూర్చియు వేరొక విధముగ భావింపవీలున్నది; సృష్టిలో నున్న ప్రతి రూపమును దివ్యత్వపు అభివ్యక్తియే యగుచో లోనినున్న దివ్యత్వమున ప్రతిది దివ్యమే యగును. దాని రూపము కాని, శీలము కాని ఈ దివ్యత్వమునకు ప్రతి బంధకము కాబోదు. ప్రతిదానిలోనను బ్రహ్మమే లీలా వినోది యగుట, మార్పులకు చేర్పులకు ఇక ఎట్టి అవసర ముండబోదు. పరమాత్మ కోరిన సమస్తమును సృష్టిలో ఆయా శ్రేణులలో నుండనేయున్నవి. పరిణామ సాపేక్ష లేనేలేదు. బ్రహ్మమున కన్నియు కలవు.

ఆయన పరిపూర్ణుడు. సృష్టికి ప్రత్యేకమగు ఉద్దేశ్యమే లేదు. ఇది పరమాత్ముని లీల; వినోదమే దీని పరమావధి. గమ్యము లేనిదగుట పరిణామపు టవసరము కాని, పరిపూర్ణమగుట నవరించు ప్రయత్నముకాని ఊహింపరాదు.

(దివ్యజీవనము- సంపుటి 19, పుట 26, 27)

శ్రీఅరవిందులు ప్రదర్శించిన ఒక హేతువాదమిది. ఆయన నుడివినట్లు, సమస్యాపరిశీలనకు, పరిష్కారమునకు ఇదొక పద్ధతిమాత్రమే. ఇది ఆయన దృక్పధమనలేము. గ్రంథమందంతటను విభిన్నవాదనలు; దృక్పధములు, ఊహలు ఆయన మన ముందుంచి వానిని చివరగా పూర్వపక్షముచేయును. మన పఠనావిధాన మందులకే లోపభూయిష్ఠము. చదివినది ప్రతిది ఆయన అభిప్రాయమయినట్లు భ్రమింతుము. తిన్నగా చదివినవాడు నేను మరొక పరిచ్ఛేదమును చదువుచో ఆతనికది వింతగా తోచును. ఇంతలోననే అభిప్రాయము మారినదా! యని విస్తుపోవును, ఒకవేళ నిదికూడ ఆతని అభిప్రాయము కానోపునని సమాధానపడిన, తర్వాతిపరిచ్ఛేదము లింకను భిన్నాభిప్రాయముల వ్యక్తపరచుట దిగ్భ్రాంతిగొల్పును. ఇవేవియు ఆయన అభిప్రాయములుకానేకావు. ముందు జాగ్రత్తకే మీకు నే నీ హెచ్చరిక చేయుచున్నాను, మహామేధావులు, పండితులు అని ప్రసిద్ధిగన్నవారు సహితము నాతో, "గ్రంథమున చెప్పినదే అనేక పర్యాయములు చెప్పుచున్నారు" అనుట పరిపాటి (మాత నవ్వును). ఆయన విభిన్న మతముల విమర్శించి, అంతమున తన భావ ప్రకటన చేయుదురు. తిరుగ వాని నన్నిటిని ఉల్లేఖించి, తర్కించి మనకు బోధింపదలచిన సత్యమును నిర్ధరింతురు. కావున. "ఆయన చెప్పినదే అనేకపర్యాయములు చెప్పెదరు."

ఈ గోతిలో పడకుండ తగు శ్రద్ధతో చదువవలెను. మధ్యలో ఏ తీర్మానమునకు రాకూడదు, ఆయననుడువునది అట్టి యభిప్రాయములుగల మనుష్యులున్నారనియే, సమస్యను సంపూర్ణముగ వివిధ దృక్పథములనుండి విమర్శించి, సవ్యముగ తోపజేయు వివిధ పక్షముల తర్కించి, సిద్ధాంతీకరించుట వారి పద్ధతి. దీనిలో విస్మయకరమగు విషయము తన నిశ్చితాభిప్రాయమును ఆయన ఒక సమన్వయరూపమున మన ముందుంచుటయే, ఏవాదనను పూర్తిగా నిరాకరించక, ఏవాదనను పూర్తిగ స్వీకరింపక, అన్నిటిని తన బుద్ధిబలమున సమన్వయించుట.

ప్రతి 3-వ వారము మనకీ పఠనమున్నది కావున చాలినంత వ్యవధి కలదు. వెనుక చదివినది విస్మరించుటకు! (నవ్వు) మీరు వేసినప్రశ్న మీకు గుర్తున్నదో లేదో నాకు తెలియదు—లేదు కదూ?

వ్యక్తిగత పరిణామ మున్నదా ?— విశ్వపరిణామమున్నదని వారే చెప్పిరి. కాని, ఈ విశ్వ పరిణామమున వ్యక్తిగత పరిణామమున్నదా, లేదా ?

ఆయన యొక సరళమును తర్కసమ్మతమును అగు సిద్ధాంతము చేసినారు. కాని దానిలో వ్యక్తిగత పరిణామము ఉండవలసిన ఆవశ్యమేలేదు.

అయినను, మన మొకింత ఓపికతో చదివిన, ఈ వ్యక్తిగత పరిణామమునకు అవసర మెట్లుకల్గినదో ఆయనయే వివరించిరి. నాకిప్పుడు కావలసినది మీకీ విషయ మర్థమగుచున్నదా? లేదా? యని. వ్యక్తిగత పరిణామము లేకనే విశ్వగతపరిణామ ముండగలదను వాదన గ్రహించితిరా?

నేను మిమ్మడుగునది వ్యక్తిగత విశ్వగత పరిణామముల భేదమేమి? ఆ రెండును ఒకదానిప్రక్క నొకటి ఎట్లు వ్యవహరింపగలవు?

ప్రకృతి తన విశ్వపరిణామ మెట్లు కొనసాగించును ? ఇది మీకు తెలిసిన దనుకొందును.

ఒకడు మరణించును — తిరిగి జన్మించును —
అదేకదూ ?

నేను మనము చూచెడి భౌతిక ప్రపంచమునుగూర్చి మాట్లాడుచున్నాను.

ఒకడు మరణించును — తిరిగి జన్మించును....

కాదు, అదింకొకటి. పుట్టుచావుల చర్విత చర్వణము వ్యక్తి పరిణామశీలత. చనిపోవుట సంపూర్ణముగ నయిన తిరిగి పుట్టునదేది ? శేషించిన దేదో జన్మపరంపరల నిలద్రొక్కుకొని నిలువవలెను. అట్లుకానిచో క్రొత్తవాడు ప్రాతవాడు కాకుండును. నిశ్శేషమగుచో అభివృద్ధి ప్రకృతిదే కాని, వ్యక్తిది కాకుండును. ప్రకృతి భౌతికతత్త్వమును తీసుకొని ఇచ్చవచ్చిన రూపకల్పన చేయును. చేసినవి విరుగగొట్టి నవ్యరూపముల కల్పించును. ఇది నిరవధికముగ సాగవచ్చును. వ్యక్తిప్రసక్తి లేకయే భౌతికతత్త్వపరిణతి కొనసాగగలదు.

మీవద్ద కొంత ప్లాస్టిసిన్ (Plasticine) ఉన్నదను కొందును. దానితో మీరొక రూపము చేతురు. అది మీకు నచ్చదు. దానిని మార్చి వేరొక రూపము చేయబోదురు. మీరు ముందుకు సాగిరన్నమాట. నీ విచక్షణాశక్తిని వాడి ఒక వస్తువు మంచిచెడ్డల నిర్ణయించుచున్నావు. ప్రతిసారి ఒక రూప మేర్పడుచున్నది. కాని క్రొత్తదిరాగనే ప్రాతది నశించుచున్నది.

ఒక రూపమునే మార్పులతో సమగ్రమొనర్పగలవు; లేదా దానిని చెరిపి వేరొకటి చేయగలవు. దృష్టాంతమునకు: ఒక కుక్కయో గుఱ్ఱమో నీవు చేయ

బూని విఫలుడవగుచో, తిరుగ నమూనా మార్చి క్రొత్తవి చేయ తలపెట్టవచ్చును. ఒక ఇంటిని నిర్మించి, నచ్చక పడగొట్టి నూతన ఫక్కిలో వేరొకటి నిర్మించ నగును. ఇట మొదటి ఇంటి స్మృతి మాత్రమే మిగులునది. అట్లే ప్రకృతి కూడ వేలాది రూపకల్పనల నొకేసారి చేయును. దాని సాధన సంపత్తి కంతు లేకుంట. కాని దానిని శాశ్వతమనలేము. అది రూపములో ప్రవేశించు జీవిత తత్త్వముగాని ఎఱుకగాని కాబోదు. ప్లాస్టిసిన్ రూపము ఒకటి పూర్తిగ నశించి వేరొకటి వచ్చుచున్నది. మిగులునది నష్టమయినదాని స్మృతిమాత్రమే. కాని. మనము వ్యక్తిగత పరిణామమును మన్నించిన, ఒక శాశ్వత తత్త్వము రూపమునుండి రూపమునకు పోవునది, అభివృద్ధిచెంది ఉన్నతరూపముల చేరు సామర్థ్యము కలది, పరిణతి చెందిచెంది పరమపురుషు డగునది ఉండితీరవలెను. ఇది ప్రకృతితో కూడి వ్యవహరించుచు ప్రకృతి పరిణామమును పూర్తిచేయగలదు. అట్లుగాక ప్రకృతి పరిణామమును తన వ్యక్తిగత పరిణామమున కుపయోగించు కొనుచున్నను బాధలేదు. అర్థమయినదా ? మంచిది. రూపాంతరము చెందు వ్యక్తిగతపురుష ప్రసక్తి లేక మనగల శాశ్వతము స్థిరమునగు ప్రపంచ నిర్మాణమును గూర్చి శ్రీఅరవిందులిచట తెల్పియున్నారు. వ్యక్తిగత పరిణామమన, నీవొక వజ్రమును తొడుగు మధ్యలో నిక్షేపించి. తొడుగులను మార్చుచు పోవుటవంటిది. అది రూపాంతరముల తన విలువను హెచ్చించుకొనుచు అంతకంత కెక్కుడు పరిపూర్ణమును, సముజ్వలమును కాజొచ్చును.

తెలిసినదా ?

స్వల్పముగా ...

స్వల్పముగానా ? సరే. అది కొంతమంచిదే. వ్యక్తిగతపరిణామమును విశ్వసింతురా ? దాని అనుభవము మీకున్నదా ? అది ఎట్లు సాధ్యము ? తెలుసు కొనదగ్గదే. ప్రకృతియొక్క సామూహికపరిణామమునకు వెలిగా దాని నెల్లెఱుంగ గలము ?

జబాబు చెప్పగలరా?

తనలోగల శాశ్వత తత్వ మెఱుంగక ఇది ఎట్లు సాధ్యము ?

ఆఁ, మంచిది. మరి, మీలోనున్న ఆ శాశ్వత త్త్వమును మీ రెఱుగుదురా?
(మౌ న ము)

అట్టిది మీలో నున్నదో లేదో తెలియగోరెదరా?

అవంతగా ఏల గుప్తపర్చబడెను ?

మనము దానిగురించి శ్రద్ధవహింపమేమో నని కావచ్చును. ప్రయత్నించినచో దానిని తెలియుట సాధ్యముకావచ్చును. అది ఆడంబర మొల్లని సుజనశీలి (స్త్రీ కాని పురుషుడు కాని) వంటిది. తనపై పితరుల దృష్టి బలవంతముగా మళ్లింపబోదు. తాను ముందుకు రాబోదు. అయినను తన కొఱకై వెదకెడివానికై వేచియుండ వచ్చును, గృహము లోలోపల నుండవచ్చును. తలుపు వెంబడి తలుపు తెఱచుకు లోన ప్రవేశించవలెను.

నాకుమాత్ర మది గుహ్యముకాదు. దాని ప్రకాశమును సర్వత్ర, చూచుచున్నాను— సర్వత్ర సర్వదా అనుక్షణము చూచుచున్నాను.

మీరు దానికై వెదకి చూచెదరా?
(ధ్యా న ము)

* * *

డిసెంబరు 4, 1957

సృష్టి సూత్రములు శాశ్వతములనియు, మార్పులేని వనియు గమనింపగలము. ఏ జాతి ప్రాణి ఆ జాతి లోనే యుండి వేరొక జాతికి మారు అవసరము కాని ప్రయత్నము కాని లేకుండనుండును. కొన్ని జాతులు నశించుచున్నను అది విశ్వగతమైన చిచ్ఛక్తి తన స్వకీయానందము కొఱకే అట్లు చేయుచున్నదనియు, వానికి ప్రతిగా నితరముల సృష్టించు చున్నదనియు భావింప వీలున్నది. జీవి తన స్వభావమునకు పరిమితమై మార్పు చేర్పుల కంత సుముఖము కాదు. విశ్వగత చిచ్ఛక్తి జీవములలో క్రమముగా మనస్సును వ్యక్త పఱచినంత మాత్రమున దాని తరువాత అట్లే అతిమానసమును వ్యక్తపఱచునని చెప్పవీలు లేదు. మానసము, అతిమానసము ఒకే జాతివి కావు: మనస్సు అవిద్యాసంబంధి, అతిమానసము దివ్యజ్ఞానసంబంధి. ఈ ప్రపంచ మవిద్యా సంబంధియై, అట్లే ఉండగోరునది. పరార్థగోళపు దివ్యశక్తుల అపరార్ధ గోళమునకు తెచ్చు ఉద్దేశ్య మవసరము కాదు. అట్లే అపరార్థ గోళమున నిగూఢమైయున్న దివ్యశక్తుల ప్రకటించు ఉద్దేశ్యము కూడ లేకపోవచ్చును. అవి గుహ్యముగ నటనుండి సృష్టి కాధారముగ మాత్రమే యుండును కాని, దానిని సమగ్ర మొనరించుటకు కాకపోవచ్చును ఈ అవిద్యా సృష్టికి మేరువువూస మనిషి. సాధ్యమగునంత జ్ఞానము, ఎఱుక పొందినవాడు. అతని పురోభివృద్ధి ప్రయత్నము

తిరోగమనమే కానోపు. మనస్సుయొక్క శక్తి పరిమితమగుట, ఒక దశలో ముందుకు సాగుట అసంభవమగును. భావములు నేతిబీరకాయలే యగును. మనః పరిధిని దాటి అతిమానసము లేక అంతకు పైస్థితికి చేర కోరిన, ఈ విశ్వజీవితము నతిక్రమించి పోయి, ఆనంద విజ్ఞాన లోకమును గాని, అవ్యక్త బ్రహ్మానుభవ స్థితిని గాని పొందనగును.

(దివ్యజీవనము — సంపుటి 19, పుట 827- 28)

దీని అవగాహనకు, ఆదిలో మీరు కొంత పరిశ్రమ చేయుట అవసరము. ప్రతి పరిచ్ఛేదముయొక్క తాత్పర్యమును వ్రాసికొనుచు వెనుకటివానికి చేర్చుచుండుట ముఖ్యము. అధ్యాయము ముగియునరికి నీకొక సమగ్రచిత్ర మేర్పడ గలదు. నే నిప్పుడు చదివిన భాగముపై మీ రడుగు ప్రశ్నకు నా జబాబు వెనుక నే నిచ్చిన జబాబుకు విరుద్ధముగా నుండవచ్చును. ఆయన రచనాపద్ధతి అది. చెప్పినదే చెప్పుచున్నట్లు తోచును. కాని తేలికగ అర్థమగుటకా విధాన ముద్దేశింపబడినది. ఆయన వివరణాపద్ధతి గ్రహించుటకు అత్యంత నిర్మలభావస్ఫురణ అవసరము.

ఒక క్రమపద్ధతిని అనుసరించకున్న మీకీ పఠనము లాభకారి కాదు. అందులకే ఈ విషయ మింతగా చెప్పుచుంటిని. అదొక పద్మవ్యూహము. అయోమయముగ దాని కీలక మెఱుంగనివారికి తోచును. బండి చక్రపు టాకులు నేమికి వలె భావములన్నియు ఒక కేంద్రమున కలుపబడినవి.

ప్రశ్నలేమైన కలవా?.... లేవు.

ఇది గ్రహించుట కష్టముగనున్నది కదా? ప్రశ్న వేయుట కష్టమే. వివరణ పూర్తమగువరకు ఏ విషయమును స్పష్టపడదు. పరస్పరవిరుద్ధములుగా

తోచు విషయములను సమన్వయించుటకు నిశితమగు ధారణాశక్తి ముఖ్యము. ఎప్పటికప్పుడు చదివిన భాగముల తాత్పర్యముల వ్రాసుకొనుచుండుట అవసరము. చివరగా వాని నన్నిటిని శోధించి శ్రీఅరవిందు లుద్దేశించిన భావమును గ్రహింప గలము.

(మౌనము)

ప్రతి జాతి జీవియు దాని స్వభావమున కంటిపెట్టుకొని యుండు నను చున్నారిట శ్రీఅరవిందులు. తనకు ప్రసాదింపబడిన శక్తులతో తుష్టిపొందు నను చున్నారు. మార్పు కోరక తన జాతిలో శాశ్వతముగ నుండగోరు ననుచున్నారు. కుక్క కుక్కవలె, గుఱ్ఱము గుఱ్ఱమువలె మనుటకే చూచును. దీనినుండి శ్రీఅరవిందులు మనిషిమనిషిగానే మనగోరునా? యని ప్రశ్నించుచున్నారు. అతడు మానవాతీతుడు కాగోరునా? .

ఆ పరిచ్ఛేదము తాత్పర్యమిది.

కాని, ఇట్టి వివరణల కలవాటుపడిన ఊహాశీలియగు మనస్సుకు, దీనిని చదువగనే, దానిలోని యొక అనిర్వాచ్య భాగమున కిది రుచించదు. బాహ్య రూపముతో తృప్తిపొందక ఉన్నతస్థితి కేగ ప్రయత్నించున దీ భాగమే—దేహమా? కాని.కే ఉన్నతాశయమును లేదు. ఉన్నది చాలునను భావము కలది. ఈ మార్పు తప్పదని చక్కగ మనకు తెల్పుటయే శ్రీఅరవిందుల దృఢ సంకల్పము.

తమ్ము తాము భిన్నజంతువులుగా మార్చుకొను నావశ్యకత నూహించుకొనిన మచ్చిక జంతువుల చూచితిని. పిల్లులలో, కుక్కలలో, గుఱ్ఱములలో, పక్షులలో- ఉన్నతస్థితి ప్రకటనకైన దాహము. పశువును దాటి మనిషి యగువాడు తప్పక ఈ గాఢవాంఛకు గుఱియగును. తన అసంతుష్టిని బాపుకొనుటకు కాంక్షించక. తప్పదు. మానవజీవిత మన్నిరంగముల నసంతుష్టికర మగునదనుట వాస్తవమే

అయినను దీనినుండి తప్పించుకొని బయటపడగలడా మానవుడు? అనునదే ప్రశ్న. శాశ్వతమును అమరమును నగు దివ్యరూపమును (ఈ రూపనాశన మయినను) పొందగలడా?

మన ప్రస్తుత సమస్య: ఈ మహోన్నతరూప మెట్లు సాధ్యము? ఇది యెంతయు కుతూహలము కల్గించునది—ఈ యున్నరూపమునే తగు సవరణల మూలమున నవ్యరూపముగా మార్చునగునా? లేక, మనకింకను తెలియని ఉపాయముల ద్వారా ఈ నవ్యరూప ముద్భవించునా? ప్రాతక్రొత్తల కేదైన కార్యకారణ సంబంధముండునా? లేక, ఆకస్మికసంఘటన యగునా? ఈ రూపము పూర్తిగ పరిత్యజించిననే ఆ అమరరూపము రాగలదా?

అన్నియు ప్రశ్నలే, దీనిని కొంత మననము చేసి ధ్యానించిన అవగాహన ఎక్కువ సుగమమగును.

(ధ్యానము)

( ఈ ప్రసంగమును మొదట ప్రచురించినపుడు, (మార్చి 6, 1963) శ్రీమాత దానికి ఈ పరామర్శవాక్యములను చేర్చెను.)

రెండును ఏల కారాదు?
రెండు నొకేపర్యాయము విలసిల్లును. ఒకటి రెండవదానిని త్రోసిపుచ్చదు.

అయిన మటి, ఒకటి రెండవ దానిలోనికి పరివర్తన చెందునా ?

అవును. ఒకటి మారి రెండవదాని చిత్తునమూనాగా తయారగును. పరిపూర్ణతగల రెండవది, ఇది రూపొందినంతనే బయల్పడును. దేని అందము దానిది—రెండును సహేతుకములే. కావున రెండును మనును.

మనస్సు సర్వదా ఎన్నికకు ప్రయత్నించును, నిశ్చయించగోరును. వస్తువుల స్వభావ మంత తేలికగ అందునది కాదు. మన ఊహాగానము సాధారణముగ తప్పుచుండును. యద్భావం తద్భవతి—నీ నమ్మిక ప్రకారమే నీకు సకలము లబ్ధమగును.

సంభవింపరాని దేదియు లేదు. సంభవింపగలది నేడో రేపో, ఎప్పుడో ఒకప్పుడు సంభవింపకతప్పదు. కాలనిర్ణయము మాత్రము చేయుట కష్టము.

మనిషికి, పశువుకు మధ్య ననేక అంతరరూపము లుద్భవించి నశించినవి. అనేకము లట్లే సంభవించును. చేయుప్రతి ప్రయత్నమును అంతిమ సాఫల్యమునకు దోహద కారకమే.

అడుగదగు ప్రశ్న: మానవజాతి ఇదివరలో తుడిచివేయబడిన జాతులవంటిదగునా? భూమిపై అనేక జాతులు తుడిచివేయబడినవి. మనుష్యజాతి మనినంతకాలము మనినవి మాత్రము అట్లు నశింపలేదు. అభివృద్ధి కవకాశముగలవేవియు నశింపవు. పరిణామవశమున అంతకంత కున్నతస్థితికి పోవుమార్గ మనుసరించునను భావమొకటున్నది. హీనజాతులకు సన్నిహితముగ నున్నవి మాత్రము నశింపవచ్చును. ఇదివరలో అట్లే జరిగినది.

సంభవము కాని దేదియును లేదు—ఒక క్షణమైనను ఉనికి నిశ్చయము.

* * *

డిసెంబరు 11, 1957

"ఇకముందు కొన్ని రసాయనిక, లేక ఇతర పద్ధతుల మూలమున జీవుల కల్గించుట సాధ్యమని కనిపెట్టినను, తేలినది కొన్ని భౌతిక పరిస్థితులలో జీవనము (Life) కల్గుననియే. అంతియకాని కొన్ని రసాయనిక ప్రక్రియలు జీవనము నుత్పాదించునని కాదు, జడపదార్థము చేతనముగ మారు పరిణామ కారణమనియును కాబోదు. ప్రతిదియు తనకు తానై మనును; తన స్వాభావిక శక్తుల మూలముననే వృద్ధి పొందును అది సృష్టిలోని వివిధ స్థాయిలలో గల వర్గములలో ఏయొక్క ప్రత్యేక వర్గమునకో మాత్రము చెందియుండును. ఒక వర్గము దాని పై వర్గముయొక్క హేతువు కాని, దాని క్రిందివర్గము యొక్క ఫలితము కాని కాబోదు. అవన్నియు భౌతిక పరిణామము యొక్క తారతమ్య విశేషములు మాత్రమే.

(దివ్యజీవనము— సంపుటి 19. పుట 829)

కరుణామయీ, మాతా, ఆదిమ మానవుడెట్లు వచ్చెను ?

శ్రీఅరవిందులు చెప్పినదేమనగా శాస్త్రీయదృక్పథమునుండి చూచినచో, సిద్ధాంతములవెంట సిద్ధాంతములు ప్రతిపాదింపబడి, సంశయింపబడి నిరాకరింపబడుచు వచ్చినవి. భౌతిక దృక్పథమగుట తేలికగ నిరూపింపగలవిగా తోచినను. చూడగా అత్యంత దుర్లభములుగా తేలినవి. గుప్తవిద్యాపద్ధతి నవలంబించిన, (కొన్ని స్మృతు లాధారముగా) నది భౌతిక నిరూపణ కందదు కావున నవి అంత

కంటె ఎక్కుడు సంశయాస్పదములుగ భావింపవలసివచ్చును. ఈ విషయమున మిగిలినవి ఊహాగానములే. భౌతికనిరూపణమాత్రమే సాధ్యము. ఆదిలో ఒక్క మానవుడో లేక కొందరు మానవులో ఉండియుండిరను అభిప్రాయము సామాన్యముగ నున్నది.

ఇక ఇతిహాసములు తీసికొనిన, అవి అలేఖ్యములగుట శాస్త్రీయదృక్పథము నుండి సంశయాస్పదములు. వ్యక్తి స్మృతిపై ఆధారపడినవి. మొట్టమొదట ఒక మనిషి లేక మిధున ముండెను. వారి సృష్టి ఒకవిధముగా భావిని రాగల అతిమానసప్రక్రియకు (శ్రీఅరవిందులు చెప్పినది) పోలిన మార్గమున జరిగినది. ఉత్తమలోకవాసులు ధ్యానానుష్ఠానముల భౌతికరూపకల్పన చేసిరి. నిమ్నజాతులాపనికి చాలునవి కానేరవు.

ఆధ్యాత్మిక అదృశ్యజ్ఞానముల ప్రకారము, రూపమునకు ముందుగా ఎఱుక వచ్చును. భౌతిక వాదము దీనికి వ్యతిరేకము. రూపమే ఎఱుక వచ్చుటకు సన్నివేశము కల్పించునని వారి విశ్వాసము. అదృశ్యలోకజ్ఞాన మున్నవారికి, ప్రకృతిశక్తులు వ్యవహరించురీతి తెలిసినవారికి సంశయములేదు. వారెఱుకకే ప్రాధాన్యమిచ్చెదరు. ఉన్నతశ్రేణికి చేరిన ఎఱుకయే, రూపమున చేరి దాని పరివర్తనకు తోడ్పడుచున్నది. ఆ రూప మంత శీఘ్రముగనో, చాలకాలమునకో, తన్ను (ఎఱుకను) వ్యక్తపఱచు సాధనముగ మార్పుచెందును. ఇదియే సవ్యమగునది. భౌతికవాదులు దీని నంగీకరింపరు. తెలియుటకంటె సంశయించుట తేలిక, మానవుని మనస్సు అన్నిటిని సందేహించు అలవాటులోపడినది. ఇది దాని మొదటి చలనము. ఈ పద్ధతిని అది దేనిని కూడ ఎఱుగజాలదు. సృష్టికి సంకల్పరూపభావన, దాని అభివ్యక్తి వ్యక్తీకరణము, ఇదీక్రమము;—సంశయమునకు తావులేదు. గతముతో ప్రత్యక్షసంబంధ మున్నవారి కందరకును మానవునిప్రథమ

రూప స్మృతి యున్నది. ఇప్పటి వారి కంటె మేలిమిస్మృతి వారికి రాబోవు అతిమానస మానవుని గూర్చిన నిశ్చయ జ్ఞానమును కలదు.

(మౌ న ము)

ఒకదాని ననుకరించుట, ఆ ప్రకారము నడచుకొనుట జీవప్రవృత్తి. పశు జాతిలో దీనికి విస్పష్టదృష్టాంతము లున్నవి. వృక్షములలోకూడ ఇది కాననగును. అయినను పశువులలో ఎక్కువ స్ఫుటముగ కాన్పించును. ఎన్నో దృష్టాంతర ముల నీయవచ్చును, ఆ యర్థమున, అదృశ్యపద్ధతులద్వారా భువిపై మూర్తీభ వించగల ఆదర్శరూపము ననుకరింప ప్రయత్నించు పశుజీవిత మూహాకందనిది కాదు. వరుసగాచేయు ప్రయత్నములద్వారా, అంతకంతకు విజయవంతమగు ప్రయత్నములచే ఆదిమమానవరూపములు కల్పింపబడి యుండవలెను.

* * *

డిసెంబరు 18, 1957

దివ్యజీవనము నుండి ఒక పరిచ్ఛేదము చదివి (పు 929)

ఆధునిక విజ్ఞానశాస్త్రము కనుగొనినవానిలో ముఖ్యమగునది దిదొక్కటే: వస్తువుల బాహ్యాంతర్గత యథార్థములు మన కందరానివి. ఒక మనిషిని, ఒక వస్తువును, ఒక ప్రకృతిదృశ్యమును చూచుటకు కళ్ళు, త్వక్కు, ఘ్రాణము విని యోగింతువు—వాసన, రుచి మొదలగునవి. విజ్ఞానశాస్త్ర మిట్లనును: అదం తయు భ్రమ. వాని స్వస్థితిలో వానిని తాకలేవు; వానిస్వస్థితిలో వానిని భావింప లేవు; వానిస్వస్థితిలో వానిని రుచిచూడలేవు. నీ అవయవ నిర్మాణము వానితో నొక ప్రత్యేకసంబంధము నెలకొల్పుకొనును. ఈ సంబంధము పైపై దే.—భ్రమ కల్గించునది,—అవాస్తవికము.

విజ్ఞానశాస్త్రదృష్టినుండి నీవు అణువుకంటె అత్యంత సూక్ష్మమగు వాని పుంజమవు. అవి నిత్యభ్రమణమున నుండును. ముక్కు, కన్ను, నోరు పోలిన వేవియు నందు లేవు—అదొక భాసమాత్రమే. పూర్వపు ఆధ్యాత్మిక నిరంకుశులవలెనే నేటి విజ్ఞానశాస్త్రజ్ఞులును ప్రపంచము మిథ్యయను తీర్మానమునకు వచ్చిరి—వేర్వేరు మార్గముల పయనించి. ఇదొక మహత్తరమగు అన్వేషణ. ఇంకొక అడుగు ముందుకు వేసిన పరమసత్యమే పొందగలరు. కావున, ఎవరైన "నేను దీనిని చూచుచున్నాను, తాకుచున్నాను, చిత్తవృత్తిచే గ్రహించుచున్నాను, అది వాస్తవమే", అనిన, అది శాస్త్రదృష్టినుండి శుద్ధ తెలివితక్కువే. శాస్త్రజ్ఞా నము లేనివాడే అట్లనగలడు. జగత్తు మిథ్య— మనము చూచు ప్రపంచము మిథ్య.

దీని వెనుకగల సత్యమేమి? ఆధ్యాత్మిక జ్ఞానాన్వేషకు లిట్లందురు. "మేమా పరమసత్యానుభూతి పొందితిమి." అది వాస్తవమునకు అంతఃకరణాను భూతియే. అది సర్వ సామాన్యమని దృఢముగ చెప్పుటకు తగిన ఆస్కార మింత

వరకును లేదు. ఎవని అనుభూతి వానికిమాత్రమే సందేహింపరానిది. ఇక కొంచము ముందుకేగిన___

ఒక అనుభూతి, లేక ఒక కనిపెట్టినదాని విలువ అది మనకిచ్చు శక్తిపై ఆధారపడియుండును. పరిస్థితులు, పరిసరములు మన అనుభూతి కనుగుణముగ పరివర్తన మొనర్పగల శక్తిప్రకటన దాని విలువకు సాక్ష్యము, వ్యక్తిగత, లేక సామూహిక అనుభూతియొక్క మహాశక్తి. మనోదృక్పథమున నత్యంతమగు మార్పుతెచ్చును. మనిషి ఎఱుకపై దాని ప్రభావమత్యంతము, ఆనందము పొందిన వాని కక్షయశాంతి. వస్తువుల వాస్తవపరిజ్ఞానము నిరూపింప నవసరములేదు. నేను ప్రస్తావించిన అనుభూతి పొందినవాడు దాని నితరుల కందజేయగల శక్తిమంతు డయిన, వాని అనుభూతియే నిజమనుదానికి సాక్షిక ప్రమాణము. సమత్వబుద్ధి పొందినవాడు బాహ్యప్రపంచమున కొంత మార్పు తేగలిగిన, (ప్రజలలో కొంత స్నేహభావము తేగల్గిన) దానిని సులభముగ నిరూపణ యననగును. అతిమానస శక్తి ప్రపంచపరివర్తన మొనర్చి నవ్యజాతిని సృష్టించిన (ఇది తప్పదని శ్రీఅర విందుల విశ్వాసము) పశువులు మానవజాతిని కాదనలేనట్లు, మానవులీ పురుషులను విశ్వసింపక తప్పదు. అట్టి లోకాతీతశక్తి కలదనుటకు వేరే సాక్ష్యాధార మనవసరము.

ఆదిలో వ్యక్తము కాగలది శక్త్యంశము___దీనికి ప్రయాసతోకూడిన నిరూపణ అవసరము కాదు, స్వయంవేద్యమగుట. రానున్న నవ్యజాతికి ఇతరజాతుల నుండి తమ్ము రక్షించుకొను దక్షత ప్రధానావశ్యకము,___జయశీలియగు ఇచ్ఛాశక్తి అతిమానసక్రియ శక్తిరూపములో రక్షణ ధ్యేయముగా ప్రావిర్భవించును. దాని మోహన, సమత్వ, తేజో, విస్ఫూర్తు లనంతరము ద్యోతకమగును. దీని పునాదులు జ్ఞాన, సత్య, ప్రేమలు, ఇవి స్పష్టముగ కొంచెము కొంచెముగా అభివ్యక్తము కాగలవు___రంగస్థలము ఉత్తమేచ్ఛాశక్తులతో ఏర్పాటైనపిదప.

అచలత నెలకొననిదే ఏదియు సాధ్యముకాదు. అహమునశింపవలెను. బ్రహ్మార్పణబుద్ధి, చిత్తనైర్మల్యము, భగవానునితో ఐక్యత అచలతాంశములు. ఈ గుణములు కలవాడే అచలుడు కాగలడు. వీని పరోక్షమున అతిమానసశక్తి ప్రమాదకారి, అన్యుడు దీనికై ప్రాకులాడరాదు. అత్యంత స్వల్పమయినను ఈ శక్తికి ప్రపంచము నస్తవ్యస్త మొనర్పగల సామర్థ్యమున్నది. పిల్లవానిచేత అణ్వాస్త్రముంచినట్లే కాగలదు.

ఈ సందర్భమున మీకొక హెచ్చరిక- మీ అభివృద్ధికై ఆ శక్తిని మీరు వాంఛింపకుడు. నిస్వార్థత సంపాదింపుడు—సర్వస్వ మర్పించుకొనుడు. భావ గ్రహణశక్తి వృద్ధిచేయుడు—అంతియ కాని, ఆ అమోఘశక్తికై ప్రాకులాడకుడు. పరిగ్రహణము ప్రమాదకారి, అపరిగ్రహివి కమ్ము. విషమపరిస్థితులలో ప్రజలా శక్తిని గర్హింతురు, దానికి బాధ్యులు ఆశ. అహంకారము, అజ్ఞానము, పరిగ్రహణము కలవారేకాని శక్తి కాదు. నిన్ను నీ వర్పించుకొమ్ము—నిరాఘాటముగ నిస్సంకోచముగ. పరిగ్రహణ మొనర్పబూనెదవా, నీ వగాథపుటంచుల పరిభ్రమించగలవు,—జాగ్రత్త!

